# రేపటి విజేతలందరికీ శుభాకాంక్షలతో...

ఏ విజయాన్నైనా చాలా మంది కలిసికట్టుగా ప్రయత్నించినప్పుడే సాధించడం వీలవుతుంది. నేను కూడా ఐ.ఏ.ఎస్. సాధించడానికి మా అమ్మ నాన్నలు ( శ్రీమతి ఆకురాతి భోగేశ్వరి, డా॥ ఆకురాతి కోదండరామయ్య ) ఎంతగానో తోడ్పడ్డారు వారి కృషితో నా కృషిని కలుపుకుని ఈ విజయం సాధించాను. - **ఆకురాతి పల్లవి**

గత 8 సంవత్సరాల నుంచి ఎనలేని కృషితో పట్టుదలతో శ్రమించి ఇంగ్లీష్‌లో ఉన్న ఎన్నో పుస్తకాలను చదివి తనదైన శైలిలో తెలుగులోకి తర్జుమా చేసి తెలుగులోనే సివిల్స్ వ్రాసి విజయకేతనం ఎగురవేసిన **ఆకురాతి పల్లవి** ఎంతో కష్టపడి తయారు చేసి సంపాదించిన జ్ఞానాన్ని ఆమె వరకే పరిమితం కాకుండా మెటీరియల్ ద్వారా అందరికీ అందుబాటులోకి తెచ్చినందుకు వారికి కృతజ్ఞతలు.

అనువాదం చేసేటప్పుడు చాలా సమస్యలు ఎదురవుతాయి. ఎందుకంటే ఒక భాషా నిర్మాణం మరో భాషా నిర్మాణంతో పూర్తిగా సరిపోదు. అటువంటి ఎన్నో సమస్యలను ఎదుర్కొని ఇంగ్లీషు నుండి తెలుగులోకి అతి సులభ పద్ధతిలో తర్జుమా చేసి ఆ మెటీరియల్‌ను తెలుగు మీడియం విద్యార్థులకు అందుబాటులోకి తేవాలనే నా కోరికను మన్నించినందుకు నా హృదయపూర్వక కృతజ్ఞతాభివందనాలు.

ప్రతి మనిషిలో అనంతమైన శక్తి దాగి ఉంటుంది. దానిని వినియోగంలోకి తెచ్చుకోవడంలోనే మనిషి విజయం ఆధారపడి ఉంటుంది. ఆ శక్తిని ఎవరైతే పూర్తిగా సద్వినియోగం చేసుకోగలుగుతారో వారే ఆకాశమే హద్దుగా విజయాలవైపు అడుగులు వేయగల్గుతారు.

అసహనంతో జరిగే ప్రయోజనమేమీ లేదు. ఓర్పువహించండి. విజయం మిమ్మల్ని తప్పక వరిస్తుంది. కావున మీ లక్ష్యానికి తగ్గట్టుగా పట్టుదలతో నిరంతరం శ్రమించండి. విజయం మీదే !

**మంచి స్నేహితునిలా ఈ మెటీరియల్ ఎందరి మనసుల్లో తట్టి లేపి విజయపథం వైపు నడిపిస్తుందని ఆశిస్తున్నాను.**

**గమనిక:** గత 8 సంవత్సరాల నుండి ఎంతో శ్రమ పడి తయారుచేసుకోబడ్డ ఈ మెటీరియల్‌ను అందరికీ అందుబాటులోకి తేవాలనే సంకల్పంతో ఉచితంగా ఈ మెటీరియల్‌ను **శ్రీనివాస జిరాక్స్ సెంటర్**లో ఇవ్వడం జరిగింది. కేవలం జిరాక్స్‌కైన మొత్తమునే చెల్లించి ఈ మెటీరియల్ పొందవచ్చు.

మీ ఉన్నతిని ఆశిస్తూ....

ఎ. మధుసూదన్ రెడ్డి, Civil Aspirant

**Books that I referred to prepare this material**

# ANCIENT INDIA

1. Romila Thapar Penguin Publications
2. Romila Thapar (small book)
3. Jha
4. A.L. Basham "The wonder that was India"
5. IGNOU material ***
6. Brilliant
7. NCERT***
8. A.U. Distance Education Material
9. Nilakanta Sastri South India
10. Gopala Reddy Material
11. Wikipedia (internet)
12. Y.D. Mishra Material
13. Ambedkar Open University Material***
14. Krishna Reddy

# పల్లవి. అకారాది

# పల్లవులు - కళలు

1) వాస్తు → see spe. essay on architecture

## శిల్పకళ:

పల్లవులు శిల్పకళ లో అద్భుత ప్రగతి సాధించారు. విశాలమైన శిల్ప ఫలకాలు వారి మహేంద్రవర్మ I గుహాలయాల్లో దర్శనమిస్తాయి. త్రిచి గుహాలయం లోని గంగాధరమూర్తి శిల్పం చెప్పదగినది.

మహేంద్రవర్మ I కాలం నాటి మానవశిల్పాలు మండగపట్టు, దళవానూరు, శిల్లవాలిస్తా లలో చూడొచ్చు. ఇతని కాలం లో గర్భగుడి & ఇరువైపులా ఉండే ద్వారపాలకుల శిల్పాలు భారీగా పెద్దగా ఉండి భారీ దండం ధరిస్తారు. కాని వారు ప్రమథాలు లేదా ఇతర ద్వారపాలక శిల్పాల్లా కాక కేవలం ఒక జత చేతులతే కలిగి ఉంటారు. అలాగే వారు భయంకరం గా కన్పించరు.

ఇతని కాలం లోని మానవ శిల్పాల్లో గుండ్రని[1] చేతులు, పొడవైన[2] ముఖం, double[3] chin, చప్పిడి[4] ముక్కు మరియు మందపాటి / దళసరి[5] పెదాలు కన్పిస్తాయి.

మహేంద్రవర్మ I తర్వాతి కాలంలోని పల్లవ శిల్ప ప్రకృతి నింగికెగసింది. హిందూ దేవతల శిల్ప ఫలకాల్లో ఎక్కువగా మానవాకారం లా చూడవచ్చు. 'లౌకిక ముద్రలు' కూడా వారి శిల్పాల్లో సాధారణమే.

(వరాహ గుహ లోని) వరాహ మండపం లోని 'అభిషేక దృశ్యం' లో రాజు సింహాసనం పై నుండ ఇద్దరు రాణులు చెరోవైపు నుంచుని ఉన్నారు. మహిషాసురమర్ధిని గుహ లో బొమ్మలలా చేసిన చిత్రాన్ని చెక్కినది. 'గోవర్ధనధారి' 'గంగావతరణ' 'మహిషాసురమర్ధిని' అద్భుతంగా రాతిపై కుడ్యచిత్రాల్లా భాసిల్లాయి. కైలాసనాథాలయం లో శివుని పలు రూపాల శిల్పాలు గలవు. పూర్వీకులందరి నుండి నందివర్మ II వరకు పల్లవుల చరిత్ర ని చెప్పే సమాంతర శిల్పపటాల సముదాయం వైకుంఠపెరుమాళ్ ఆలయ ప్రత్యేకత. హిందువులు నందివర్మ II అభిషేక/పట్టాభిషేక దృశ్యం చెక్కినది.

కుడ్యచిత్రాలు:

మహేంద్రవర్మ I కు 'చిత్రకారపులి' బిరుదుంది. సిత్తన్నవాసల్ లోని జైన గుహాలయం, కంచి కైలాసనాథాలయం, పనమలై లోని తాళగిరీశ్వరార్ ఆలయాలు పల్లవుల అద్భుత కుడ్యచిత్ర కేంద్రాలు. సిత్తన్నవాసల్ చిత్రాలు మహేంద్రవర్మ I కాలానికి చెందినవి. కుడ్యచిత్రాల్లో తామర మొగ్గలు, వికసించిన

తామరలు గల తామర సరస్సు చిత్రం రమ్యమైంది.
కైలాసనాథాలయం లోని చిత్రాలు నిర్మించిన వీరి
శివ సంబంధ దృశ్యాల్ని చూపుతాయి.

## మహేంద్రవర్మ I సంగీతప్రియుడు.

'సంకీర్ణజాతి' అనే కొత్త రాగం అతని కాలంలో వాడుక లోకి వచ్చింది. సంకీర్ణజాతి అతని బిరుదుగా కూడా మారింది. కుడిమియామలై శాసనం లో సంగీతపర వివరాలున్నాయి (musical tabular note), దీన్ని ఇతనికే ఆపాదిస్తారు.

శిల్పాల్లోనూ, వర్ణచిత్రాల్లోనూ కన్పించే నాట్య దృశ్యాల ద్వారా వారు నాట్యాన్ని కూడా ఆదరించినట్లు తెలుస్తుంది.

మహేంద్రవర్మ I 'మత్తవిలాస ప్రహసనం' మరియు 'భగవదజ్జుక' రచనలు వెలయించాడు.

Add this to guide ...

# పల్లవులు – మతం

పల్లవుల పాలనలో దక్షిణ భారతం గొప్ప మత పరివర్తన పొందింది. ఆచార్య జయస్వాల్ అభిప్రాయం లో ఉత్తరాది కి శుంగులు ఎలాంటివారో దక్షిణాది కి పల్లవులు అలాంటివారు. వైదిక ధర్మానికి వారి అంకితభావం, ఆదరణ జైన, బౌద్ధాల పతనాన్ని త్వరపర్చింది.

పల్లవాధిపత్యానికి స్థాపకుడు శివస్కందవర్మ అతని వారసులు అశ్వమేధయాగం తో సహా పలు వైదిక యాగాలు నిర్వహించినట్లు తెలుస్తుంది.

పల్లవుల రాజధాని 'కంచి' వైదిక విద్య కి ఎంతగా కేంద్రమయ్యిందంటే దాన్ని 'దక్షిణకాశి' గా కీర్తించారు.

అయితే పల్లవులు బ్రాహ్మణులైనప్పటికీ 'శైవ' ముద్ర వేసారు. పల్లవులది 'వృషభ లాంఛనం'. వారి పతాకము 'ఖట్వాంగం' అనగా మానవకపాలం ధరించే గదం. శైవం లోని తీవ్రరూపాలు 'కాలాముఖ' 'పాశుపత' మొ॥నవి వీరి నాటిలో మిక్కిలి ప్రసిద్ధి చెందాయి.

వైష్ణవం కూడా చెప్పుకోదగ్గ ప్రగతిని

సాధించింది. కొంతమంది పల్లవ రాజులు భట్టారకులు.
వీరి కాలంలో ప్రసిద్ధ నయనార్లు, ఆళ్వార్లు
భక్తి పద్యాలు రాసి వరుసగా శైవ, వైష్ణవాల్ని ప్రచారం
చేశారు.

బ్రాహ్మణత్వం అంతగా పుంజుకొని విజృంభిస్తున్నా
బౌద్ధ, జైనాలు కూడా కొనసాగాయి. Yuan Chwang
హ్యుయాన్‌త్సాంగ్ కంచిలో వంద విహారాల్ని, వాటిలో
పదివేల మంది బౌద్ధసన్యాసులను చూశానని రాశాడు.
ప్రసిద్ధ బౌద్ధ తర్కవేత్త 'దిగ్నగ' కంచికి చెందినవాడంటారు.
నలంద విశ్వవిద్యాలయ ఆచార్యుడు 'ధర్మపాల' కంచివాడే.
మహేంద్రవర్మ I మొదట్లో జైనుడని తర్వాత శైవం స్వీకరించాడని
తెలుస్తుంది. తిరుచిరాపల్లి గుహాలయం లోని శాసనంలో
ఆలయంలో లింగ ప్రతిష్ఠాపన గురించి తాను అన్యమతం నుండి
శైవానికి మారుతున్నానని మహేంద్రవర్మ I పేర్కొన్నాడు.
ఇతని శైవ గురువు అప్పర్.

ఏమైనా జైన, బౌద్ధాలు పతన దిశగా
పయనిస్తున్నాయి. తమ ఆధిపత్యాన్ని నాటుకొని పెంచుకుంటున్న
శైవ శాఖల హింస జైన, బౌద్ధాలు త్వరితంగా
కనుమరుగయ్యేలా చేసింది.

# పల్లవులు - సాహిత్యం

పల్లవుల కాలం లో గణనీయమైన సాహిత్య ప్రగతి జరిగింది. పల్లవ రాజులు సంస్కృతాన్ని ఆదరించారు. సంస్కృతం క్రమంగా ప్రాకృతాన్ని దక్షిణాదిలో స్థానభ్రంశం చేసింది. ఏవో కొన్ని తప్ప మొత్తం రాజ పత్రాలన్నీ సంస్కృతం లోనే ఉన్నాయి.

పల్లవులు 'ఘటికలు' అనే ఉన్నత ప్రమాణాల కళాశాలల్ని విరివిగా ఆదరించారు. కంచి ప్రఖ్యాత విద్యాకేంద్రమై దేశ నలుమూలల నుండి విద్యార్థుల్ని ఆకర్షించింది.

గొప్ప సంస్కృత కవులు భారవి, దండి పల్లవ ఆస్థానానికి చెందినవారేనంటారు. మహేంద్రవర్మ I 'మత్తవిలాసప్రహసనం' 'భగవదజ్జుకం' లను రాశాడని తెలుస్తుంది.

తమిళ సాహిత్యం బాగా ఎదిగింది. శైవ, వైష్ణవ ఆచార్యులు మంచి పద్యాలు రాశారు. ఆళ్వార్లు, నయనార్లు భక్తి గీతాలు వాటి భక్తివిశ్వాసాలకి, సౌందర్యానికి మరియు భగవంతుడితో గల గాఢానుబంధానికి ప్రతిబింబాలు. తిరువళ్లువార్ రాసిన

'సురత' వ్యక్తి మరియు సమాజ నైతికత ని చెప్పింది, ఇది పల్లవుల కాలం లోనిదే.

---

"దక్షిణ భారత వాస్తుకళ చరిత్ర
క్రీ.శ. 6 వ శతాబ్ద చరమం లో పల్లవుల
క్రింద మొదలవుతుంది"

— వి. ఎ. స్మిత్

* పల్లవుల కళా సంప్రదాయాలు కేవలం దక్షిణ భారతం లో ప్రమాణాన్ని ఏర్పరచడమే గాక ఆగ్నేయాసియా దేశాల్లోని శైలులని కూడా ప్రభావితం చేశాయి.

"పల్లవుల కళ అది ప్రవేశపెట్టబడిన దేశాల్లో వారి నాగరికతల్లోని భారీ కట్టడాల్లో దేదీప్యమాన ప్రకాశం గా ప్రతిఫలించి దాని మాతృదేశం కంటే ఘనమైన వైభవాన్ని ప్రదర్శించింది."

# పశ్చిమ చాళుక్యులు – మతం

పశ్చిమ చాళుక్య రాజులు కొందరు శైవులు, కొందరు వైష్ణవులు. వారు తమను 'సత్య' శరణార్థులుగా చెప్పుకొన్నారు. చాళుక్యులు సనాతన హిందువులు, వైదిక ధర్మాన్ని ఆదరించారు. కొందరు తొలి రాజులు అశ్వమేధయాగం లాంటి పలు వైదిక యాగాలు చేశారు. వారు బాదామి, ఐహోలు, పట్టదకల ప్రాంతాల్లో నిర్మించిన ఆలయాల ద్వారా హిందూమతానికి వారందించిన ఆదరణ వెల్లడి అవుతుంది.

ఐతేనా చాళుక్యులు ప్రశస్తనీయమైన పరమతసహనాన్ని చూపారు. బౌద్ధం దేశం నుండి దాదాపుగా కనుమరుగైంది, కాని చాళుక్య ప్రాంతం లో జైనం దాని స్థానాన్ని ఆక్రమించుకొనసాగింది. జైనం వీరి రాజ్యం లోని కొన్ని వర్గాల ప్రజలలో బాగా ప్రఖ్యాతి గాంచింది. విజయాదిత్య I నిరవద్య ఉదయదేవ అనే జైనాచార్యునికి గ్రామాన్ని దానం చేశాడు. విక్రమాదిత్య II కూడా జైనాన్ని ఆదరించాడు. రెండవ పులకేశి సేనానియైన రవికీర్తి జైనుడని తెలుస్తున్నది.

చాళుక్యుల మత భావాల్లో క్రమంగా భక్తి భావం చోటుచేసుకొంది. దానధర్మాలు చేయడం, వ్రతాలు చేయడం, తీర్థయాత్రలు చేయడం బహుళ ప్రచారం లోకి వచ్చాయి.

# చాళుక్యులు - సంస్కృతి

చాళుక్యులు కళా, సాహిత్యాల్ని గొప్పగా ఆదరించారు. రెండవ పులకేశి మామగారైన గంగదుర్వినీత 'శబ్దావతార' అనే సంస్కృత వ్యాకరణ గ్రంథం రచించారు. పూజ్యపాద విరచితమైన 'జైనేంద్ర వ్యాకరణ' వీరి కాలం లోనిదే. చాళుక్యుల ఆదరణ లో సంస్కృత భాష వికసించింది. సంస్కృతం రాజభాష గా గౌరవస్థానం పొందింది. చాళుక్యుల కాలంలో ఆంధ్ర, కన్నడ భాషలకు మూలమైన దేశీయపదాలు చోటుచేసుకున్నాయి.

అజంతా లోని కొన్ని అద్భుత కుడ్యచిత్రాలు అలాగే ఎలిఫెంటా మరియు బాదామి లలోని గుహాలయాలు కూడా వీరి ఆదరణలోనే వెలిశాయి.

# గుప్తులు — కళలు

గుప్తుల వాస్తు Vol.3 p.31

## శిల్పకళ:

గుప్తులు శిల్పకళ లో చక్కని ప్రతిభ కనబర్చారు. వీరి శిల్పకళ కి కీలకమైన అంశం మానవాకృతి. ఈ కాలం లోని శిల్పాలు వాటి సొగసు, పొందిక[2] మరియు ప్రవహించే[3] లయబద్ధత కు ప్రసిద్ధి గాంచాయి. అదుపు[4] లో ఉన్న అలంకారాలు, పారదర్శక[5] దుస్తులు వాటి రూపానికి గంభీరత ను జోడించాయి. అనేక హిందూ దేవుళ్ళ, దేవతలు అలాగే బుద్ధ మరియు బోధిసత్వాల మూర్తుల్ని కచ్చితమైన[6] సమతూకం తో, సహజ సొగసు తో, ఆధ్యాత్మిక[7] ముఖ ధాతువుల తో అద్భుతం గా రూపొందించారు.

ఉదయగిరి గుహలలోని భూ-వరాహ శిల్పం, దేవగఢ్ లోని శేషశయన విష్ణు, గజేంద్ర వరద, నర నారాయణ శిల్పాలు విమర్శకుల చేత గుప్త శిల్పకళా శిఖరాలు గా కీర్తించబడుతున్నాయి. దేవగఢ్ లోని దశావతార దేవాలయం లోని రామాయణ శిల్పఫలకాలు, కోశాం లోని శివ-పార్వతి శిల్పాలు గుప్తుల శిల్పకళ కి మంచి ఉదాహరణలు.

సారనాథ్ లోని కూర్చున్న బుద్ధ, మథుర లోని ఎర్ర ఇసుకరాతి లో నిల్చున్న బుద్ధ శిల్పాల్ని బౌద్ధ శిల్పకళ లో అత్యుత్తమమైనవి గా భావిస్తారు. ఇవి వాస్తవమైన భారతీయ కళా నిపుణత్వాన్ని అపూర్వం గా చాటుతున్నాయి.

ప్రసన్నమైన ధ్యాన భావము, బుద్ధుని కళ్ళలోని దయ, కృపాపూర్వక చిరునవ్వు, పారదర్శక వస్త్రము మరియు ప్రవహించే లయబద్ధమైన శిల్పకళ యొక్క ఉన్నతమైన లక్షణాల్ని నిరూపిస్తాయి.

ఇవి కంచు, రాగి బుద్ధ ప్రతిమలు ఉదాహరణకు సుల్తానగంజ్ లోనివి, ఇంకా నలంద, సారనాథ్ మొ॥ ప్రాంతాల్లో కన్పించే లోహ బుద్ధప్రతిమలు ఈ కాలం లోనివే. లోహ విగ్రహాలు ఉత్సవ విగ్రహాలుగా పండుగల్లో సంప్రదాయాల్లో ప్రాధాన్యత పొందాయి.

టెర్రకోట:

టెర్రకోట పలకలు, బొమ్మలు చెక్కిన అలంకరణలతో కాన్పూరు లోని పార్శ్వన ; కోశాం, అహిఛత్ర, బికవీర్, పవయా, పాటలీ మరియు మహాస్థాన్/మహాసథాన లలో దొరికాయి. బౌద్ధుల దేవతలు, రామాయణ దృశ్యాలు, పూల డిజైనులు, పక్షులు జంతువుల ముద్రలు మొ॥ ఉన్నాయి. టెర్రకోట ఉత్పత్తి సాధారణ ప్రజలు ధరించేవారు. బౌద్ధ కథల్ని వివరించే దృశ్యాలు గల టెర్రకోట పలకలతో బౌద్ధ ఆలయాలు అలంకరించబడ్డాయి.

నాణేలు:

అనేక భాగాలయిన వర్గాల వారే కాక గుప్తుల

నాణేలు చక్కని కళాత్మకతకు ఆటపట్టులు.

ఆనాటి గుప్తుల నాణేలు కుషాణ మరియు హెలెనిస్టిక్ నాణేల నుంచి పరిణామం చెందినవి, ఇవి మరలా అందమైన ఆలి రోము నాణేల అనుకరణలన్నది తెలిసిందే. గుప్తుల బంగారు, వెండి నాణేలు నున్నని [1] నునుపైన [2] సమానమైన అంచులు గలవి. వాని మీద బహువిధాలా సంక్లిష్టమైన రూపాలు మలచబడ్డాయి. అనేక హిందూ దేవతలు కార్తికేయ (స్కంద) విష్ణు, లక్ష్మి మొ॥ వారు చిత్రించబడ్డారు. ఇవేగాక చక్ర, ధనుస్సు, బాణం, అశ్వమేధ సూత్రం, నెమలి, గరుడ, బల్లెము మొ॥నవి చిహ్నాలు కూడా నాణేలపై ఉన్నాయి. దుస్తులు, [3] మానవ శరీర భాగాలు సైతం నాణేల మీద స్పష్టంగా చిత్రించబడ్డాయి.

గుప్తుల కాలం లోని లోహ పరిజ్ఞాన పరిణతికి లోహ పరిశీలనకి వారి నాణేలు నిలువుటద్దాలు.

గుప్తుల నాణాల్లో గుప్త రాజుల కార్యకలాపాల్ని కళాసౌందర్యం ఉట్టిపడేలా చిత్రించారు. ప్రతి నాణెం కూడా అద్భుతమైన డిజైనుతో సూక్ష్మ నైపుణ్య ముద్రణతో ఒక 'సూక్ష్మ శిల్ప ఖండం'గా కొనియాడదగినదని రామలింగారెడ్డి అభివర్ణించారు.

చిత్రకళ - కుడ్య చిత్రాలు:

గుప్తుల కాలం లో చిత్రకళ కూడా సంప్రదాయ (Classic) దశకు చేరిందని బాగ్ మరియు అజంతా కుడ్యచిత్రాలు నిరూపిస్తున్నాయి. ప్రపంచ ప్రఖ్యాతి గాంచిన అజంతా

చిత్రాలు అద్భుత భారతీయ కళాఖండాలు. గుహ గోడలే
గాక పైకప్పును సైతం ఆవరించిన ఈ చిత్రాలు
విస్తారమైన వస్తువు కలవి — బుద్ధుని జీవితం లోని హృదయానికి
హత్తుకునే దృశ్యాలు, జాతక కథలు, జంతువులు, పక్షులు,
సరస్సులు, చెట్లు, పువ్వులు మొదలైనవి. ఈ చిత్రాలు వాటి
తుల్య మిశ్రమానికి[1], భంగిమల సౌందర్యానికి[2], కేశాలంకరణ[3]
పద్ధతులకి, అలంకారాలకి[4] ప్రసిద్ధి గాంచాయి. బుద్ధుడు
తన గృహం వద్ద భిక్షయాచన చేస్తూ భార్యాపిల్లల్ని
కలవడం, నల్ల రాకుమారి, బోధిసత్వ పద్మపాణి మొద
దృశ్యాలు ఒలికించగల కరుణారసం, కళా సౌందర్యం
వర్ణనాతీతం. ఈ చిత్రాల ద్వారా నాటి దుస్తులు,
ఆచారాలు, అలంకరణలు ఆధారంగా నాటి ప్రజల సాంఘిక-
సాంస్కృతిక జీవనమును తెలుసుకోవచ్చు.

ఏదేమైనా కొంతమంది చరిత్రకారుల
ప్రకారం అజంతా లోని చిత్రాలన్నీ గుప్తులకే చెందినవి
కావు. కొన్ని వాకాటకులవి కూడా అయి ఉంటాయి.
అయితే అవన్నీ క్రీ.శ. 4 మరియు 5 శతాబ్దాలకే చెందినవని
మరియు తప్పకుండా గుప్తుల శైలి నుంచి స్ఫూర్తి పొంది
ఉంటాయని చరిత్రకారులు తెలుపుతున్నారు.

ఈ చిత్రాల ప్రత్యేక లక్షణాలుగా

రేఖల సున్నితత్వం[1], సొగసైన రూపాల వైవిధ్యం[2], ఆహ్లాదపరిచే[3] రంగులు మరియు అభివ్యక్తి[4] సంపదలను చెప్పవచ్చు. ఇవి గొప్ప కళ-చరిత్రకారులైన ఆనంద కుమారస్వామి మరియు స్టెల్లా క్రామ్రిష్ ల ప్రశంసలు పొందాయి. భారతీయ కళా నిపుణత్వం లో శిఖరం గా నిలిచే గుప్తుల కుడ్యచిత్రాలు చూస్తే గుప్తుల కళ భారతీయ కళ లో ఉత్తమమైనది ప్రతినిధియని వి.ఎ. స్మిత్ ప్రశంసించాడు.

## ఇతర కళలు:

గుప్తుల కాలంలో నాట్యం, నాటకాలు బాగా తెలుసు కాళిదాసుని రచనలు ఇతర రచనల వల్లా తెలుస్తుంది. వీరుల/ జనావాసాలు సాధారణం గా చాలా వరకు కలపతోనే నిర్మిత మయ్యేవి కాబట్టి వడ్రంగి వారికి సమాజం లో ప్రముఖస్థానం ఉండి ఉంటుంది.

# Samantha System and Changes in Political Structure

సామంత విధానం అన్నది గుప్తుల కాలం లో మొదలై గుప్తుల అనంతర దశ లో పటిష్టమై నాటి రాజకీయ - ఆర్థిక నిర్మాణం లో ముఖ్య లక్షణమయ్యింది. ప్రాచీన భారత రాజకీయ నిర్మాణాన్ని మధ్యయుగ భారత ఫ్యూడల్ రాజకీయాల వైపు మళ్లించడం లో ఈ సామంత విధానం ప్రధాన పాత్ర పోషించింది.

## 'సామంత' - పద అర్థం

స్మృతులపై వ్యాఖ్యానాల ఆధారంగా కౌటిల్య సామంత అంటే 'పొరుగు' లేదా 'సరిహద్దున గల' అని అర్థము తెలుస్తుంది. అయితే క్రీ.శ. 5 వ శతాబ్దం చివరిల్లో ఈ పదానికి 'లొంగి ఉండే పాలకుడు' అన్న అర్థం ఏర్పడింది.

సామంతులు అంటే ఏదో చిన్న చిల్లర రాజులు కారు. మందసోర్ శాసనం లో 'మహాసామంత, మహారాజ ఉదయసేన' అనే సంబోధన, ఆయా ప్రాంతాన్ని 'రాజ్య' అనడం మొ॥ ఉదాహరణలు సామంతులు గౌరవప్రదమైన రాజులని తెల్పాయి.

## సామంతవిధానం :

గుప్తుల కాలం లో సామంతవిధానం

తలెత్తడానికి ఇన్ని కారణాలు ఉన్నాయి.

1) మౌర్య సామ్రాజ్యం తర్వాత కాలంలో ఒక పెద్ద రాజ్యంలో ప్రత్యక్షంగా పాలించబడే మధ్య భాగం చుట్టూ అనేకుల సామంతుల్లా ప్రధాన చక్రవర్తికి లొబడి పాలించే వారుండటం సాధారణమైంది. 'అర్థశాస్త్రం' లో బలహీన రాజు బలవంతుడైన రాజు యొక్క ఇష్టాయిష్టాల ప్రకారం చేయాలని చెప్పబడింది. దీని ద్వారా ఒప్పందాల సాయంతో కూడా సామంతులుగా మారాలని అర్థమవుతుంది. శిలాశాసనాలు, సాహిత్యాలు కూడా భావ విస్తరణాన్ని తప్పించేందుకు గాను ధర్మవిజయమంటే ఓడించిన రాజ్యాన్ని ఆక్రమించుకోవడం గాక దాన్ని లొబడినట్టే రాజ్యంగా మార్చటమేనని చెప్పాయి. సముద్రగుప్తుడు సాధించిన మహా జైత్రయాత్ర ఫలితంగా ఎన్నో రాజ్యాలు కలుపబడ్డప్పుడు అప్పటి స్థితిలో వాటన్నింటిని ఒకే కేంద్ర పాలన కిందకి తేవడం కారణాల సాధ్యం కాదన్న వాస్తవం గుర్తించి అనేకుల్ని సామంతులుగా మలిచాడు. ఈ విధంగా గుప్త సామ్రాజ్యంలో సామంత విధానం వేళ్లూనింది. ఇదే విధానాన్ని తర్వాత కాలపు వారసులు కూడా అనుసరించడం కన్పిస్తుంది.

2) కొన్ని సార్లు ప్రాంతీయ పాలనను

వారసత్వహక్కు గా మార్చాలని క్రమంగా వారు బలం
పొంది తమను ప్రభుత్వ ఉద్యోగులు గా కాక సామంతులుగా
పిల్చుకోవటం మొదలుపెట్టేవారు. ఉదాహరణకు గౌడశాసనాలని
ప్రభుత్వోద్యోగి సామదత్త మొదట్లో గవర్నరు గా మాత్రమే
పాలించేవాడు. తర్వాతి కాలంలో అదే వృత్తం లోను
పాలించే ఉత్కళ మరియు దండభుక్తి లను తమను
సామంతమహారాజ గా చెప్పుకోవడం శాసనాల్లో గమనించవచ్చు.
~~[మైత్రకుల రాజవంశాల్లో మొదటి ఇద్దరు సేనాపతి
బిరుదు తో కన్పించగా తర్వాతి వారు మహాసామంతరాజు
బిరుదు తో కన్పిస్తారు]~~

ఇక దక్షిణ లో యాదవులు, చాళుక్యుల
పాలన లో నయితే ఒక 'మహామండలేశ్వర' నిజంగా
సామంతుడా లేదా ప్రొవిన్షియల్ వైస్రాయ్ సామంత బిరుదు
పెట్టుకున్నాడా గుర్తించడం కష్టం. అంకిత భావం గల
సామంతుల్ని చక్రవర్తి లోను కలుపుకొని సొంత ప్రాంతాలకి
ప్రొవిన్షియల్ అధికారిగా నియమించే ఆచారం వల్ల
ఈ అస్పష్టత మరింత పెరుగుతుంది.

3) సామంతుల సంఖ్య పెరగటానికి మరో కారణం పెద్ద
సామంతరాజ్యాల్లో మళ్ళీ వారి సొంత సామంతుల్ని
కలిగి ఉండడం. ఎరాన కు చెందిన మాతృవిష్ణు
(క్రీ.శ. 480)

సురసమ్మి చంద్రు కి సామంతుడు ఇతడు మళ్ళీ
చక్రవర్తి బుధగుప్తుని కి సామంతుడు. ([illegible]
[illegible])
ఇలా ఫ్యూడల్ క్రమానుగత శ్రేణి ఏర్పడుతుంది.

4) నాటి వ్యవస్థ లో క్రమ క్రమంగా భూదానాలు
పెచ్చుపెరిగాయి. మతావసరాల కోసం బ్రాహ్మణులకు,
అరుదుగానైనా ఉన్నత ప్రభుత్వోద్యోగులకు జీతాలకు
బదులుగా గాని, నిర్వహణ కోసం గాని భూదానాలు చేసేవారు.
ఈ భూదానాల్లో భూమిశిస్తు వసూళ్ళ వరకే గాక ప్రజలపై
ఇతర పన్నులు విధించేందుకు, నేరస్థుల్ని శిక్షించేందుకు కూడా వారికి
కూడా దానగ్రహీతలకు హక్కు లభించేది. దానం చేసిన
ప్రాంత ప్రజల్ని దానగ్రహీత ఆజ్ఞలకు లోబడి ఉండాల్సిందిగా
చెప్పేవారు కూడా. ([illegible]
[illegible]) రాజ సైన్యాలు కూడా
వారి భూముల్లో ప్రవేశించరాని దానగ్రహీతలకు అభయ
మిచ్చేవారు. ఫలితంగా సమాంతరంగానే దానగ్రహీతలు
రాజు నుండి దాదాపుగా స్వతంత్రులైపోయేవారు, వారికి వారే
సామంతులు గా చెప్పుకునేవారు. అందువల్ల క్రీ.శ. 7 వ
శతాబ్దం తర్వాత "అధిరాజులు" అనుచు 'మహాసామంత'
'పంచమహాశబ్ద' వంటి బిరుదులతో చెప్పుకునేవారు

అటానమీ (autonomy) ని ప్రకటించుకునేవారు.

సామంత విధానం లో సామంతుల హోదా, (1) అధికారవిధులు ఒకేలాగా లేవు. 'చక్రనీతిసార' లో ఒకలక్ష వెండి కర్షల ఆదాయం వచ్చే సామంతుని నుండి మొదలుకొని 50 కోట్ల కర్షల ఆదాయం గల సార్వభౌముని వరకు ఎంతో మంది క్రమానుగతశ్రేణిలో చెప్పబడ్డారు. ఇందులో నిజమేదయినా దీన్నిబట్టి భిన్న అధికారాలు, ఆదాయాలు గల సామంతులు వివిధ స్థాయిల్లో ఉండేవారని అర్థమౌతుంది.

(2) చక్రవర్తి చెలాయించే అధికారం సామంతుని హోదా, బలగాన్ని బట్టి మారేవి.

సాధారణంగా సామంతులు చక్రవర్తి ఆస్థానంలో ఉత్సవ సమయాల్లోనే గాక నిర్ణీత కాలక్రమంలో హాజరై (3) 'ప్రణామాలు (homage)' చెల్లించాలి. క్రమం తప్పకుండా 'కప్పం' కట్టాలి. యుద్ధాలప్పుడు చక్రవర్తి కోసం పోరాడటానికి 'సైన్యాన్ని' పంపాలి. ఇందుకు బదులుగా సామంతులు తమ భూముల్ని పాలించుకునేందుకు చక్రవర్తి వారి హక్కుని గుర్తించేవాడు, వీరికి గుర్తుగా రాజచిహ్నాల్ని కూడా ఇచ్చేవాడు.

అధికారికమైన ఈ సంబంధాలతో పాటు (4) ఆచరణలో సామంతులు వివిధ విధాలుగా చక్రవర్తికి

లో బడి ఉండేవారు. సామంతుల భార్యలు చక్రవర్తి
భార్యని సేవించేవారు. యశోమతి తోను అసంఖ్యాక
సామంతుల సతీమణులు ఖలకలాడించేవారు చెప్పుకొంది.
చక్రవర్తి కొడుకుల లో చదువుకునే సామంతుల కొడుకులు
కూడా వారిని సేవించాల్సి ఉండేది.

మామూలుగా చెల్లించే కప్పం లో పాటుగా
చక్రవర్తి గృహం లో పెళ్ళిళ్ళు మొ॥ ఉత్సవాలు, శుభకార్యాల్లో
కూడా సామంతుల నించి పెద్ద కానుకల్ని ఆశించేవారు.
చక్రవర్తి ఇష్టపడితే సామంతులు తమ కూతుళ్లని ఇవ్వాలని
ఆశించేవారు.

చక్రవర్తి ప్రతినిధి[5] సామంతరాజు ఆస్థానం లో
ఉండేవాడు. ఇతన్ని సామంతుడు ఎక్కువ గౌరవంగా చూసుకునే
వారు. ఇతడు తన కింద ఉన్న సాధారణాల నాయకుల లో ని
సామంతుడు తిరుగుబాట్లు, కుట్రలు మొ॥ చేయకుండా నిఘా
ఉంచేవాడు. సామంతులు కూడా తమ ప్రతినిధుల్ని చక్రవర్తి
ఆస్థానం లో ఉంచి ఎప్పటికప్పుడు కొత్త సమాచారాలు తెలుసుకునేవారు.

<u>చక్రవర్తి కి ఒక సామంతుడు తన విధుల్ని
నిర్వర్తించకపోతే అతని భూమిని[6] స్వాధీనం చేసుకునే హక్కు ఉంది.</u>
ఇలాంటప్పుడు సాధారణంగా ఆ భూమి లో ఉన్న ఒకరి పై ప్రభుత్వాధికారి
గా గుర్తిస్తారు.

(7) సామంతుల "అంతర్గత స్వాతంత్ర్యమన్నది" వారి హోదాని బట్టి మారేది. ఉచ్ఛకల్పులు, పరివ్రాజకులు, మరియు వర్మనలు గుప్తుల సామంతులుగా మారి (I) అంతర్గత స్వేచ్ఛ ననుభవించారు. వీరిలో ఉచ్ఛకల్పులైతే ఒక్కసారి వారి భూదానాల్లో చక్రవర్తి పేరు తలచనే లేదు, అయితే అది తరుచు గా జరిగేది. మొత్తం మీద నిర్ణీత కప్పాన్ని క్రమం తప్పక (చెల్లిస్తూ) చెల్లించడం మినహా వీరు పూర్తి అంతర్గత స్వాతంత్ర్యం అనుభవించారు. వారు తమ సొంత సామంతుల్ని కలిగి ఉండొచ్చు. సొంత అధికారుల్ని నియమించుకోవచ్చు. పన్నులు విధించడం, గ్రామాలు దానం చేయడం లేదా [illegible] కూడా అధికారం ఉంది, ఒక్కసారి చక్రవర్తి ప్రస్తావన లేకుండానే. చక్రవర్తి ఆస్థానం లో వారి మాటలకు విలువ ఉండేది.

చిన్న సామంతుల విషయం లో మాత్రం (II) వారు తమ ప్రాంతాల్లోనే గ్రామదానాల [illegible] కూడా చక్రవర్తి అనుమతి కోసం ఆగాల్సి వచ్చేది. ఉదాహరణకు వాకాటక సామంతుడైన నారాయణ మహారాజు.

ఇక మూడవ శ్రేణి సామంతులు మరింత (III) నియంత్రణ కు, [illegible] గురయ్యేవారు. వారి గ్రామాల్ని దానాలు గా చక్రవర్తే గాక చక్రవర్తి (ప్రధానమంత్రి) [illegible] కోసం వారికి చెప్పకుండా కూడా ఇచ్చేసేవారు.

(8) సామంతులు తిరుగుబాట్లు చేసినట్లయితే వారిని యుద్ధం లో ఓడించిన తర్వాత నానా అవమానాల పాల్జేసేవారు.

వారి అవిధేయత కు శిక్షగా వారి సంపద ని లాక్కునేవారు. కొంత కాలం పాటు వారి ప్రాంతాల్ని సామ్రాజ్యం లో కలిపేసేవారు.

చక్రవర్తి శక్తివంతంగా ఉన్నంత కాలమే సామంతులు విధేయులుగా ఉండేవారు. అతడేమాత్రం బలహీన పడినా వీరు స్వాతంత్ర్యం (9) ప్రకటించుకునేవారు. ఉదాహరణకు పశ్చిమ చాళుక్యులు బలహీనపడగానే వారి సామంతుడైన దంతిదుర్గ రాష్ట్రకూటులు స్వతంత్రులై పొందటమే గాక చాళుక్యులనే సామంతులుగా దిగజార్చాడు. అయితే 200 ఏళ్ల తర్వాత రాష్ట్రకూటులు బలహీన పడ్డప్పుడు మరలా చాళుక్యులు అధికారం పొందారు.

## రాజకీయ నిర్మాణం లో కలిగిన మార్పులు :

1) సామంత విధానం ద్వారా 'కప్పం' మినహా కేంద్ర ప్రభుత్వానికి ఆ ప్రాంతం నుంచి ఇతర ఆదాయం వచ్చేది. ఈ విధానం లో స్థానికం గానే ఆర్థిక కార్యకలాపాలు అనుసారి ప్రభావాలు కూడా ప్రాంతీయం గానే ఉండేవి.

2) సామంత విధానం లో 'వికేంద్రీకరణ' ప్రధానమైన మార్పు. అంతర్గత పాలన లో స్వేచ్ఛాయుతంగా సామంత రాజులు ప్రభుత్వాధ్యక్షుల వలె ప్రతిదానికి కేంద్ర ప్రభుత్వం మీద ఆధారపడాల్సిన అవసరం లేకపోవడం చే పాలన చాలా వరకు ప్రాంతీయ -మౌతుంది. ఇది వికేంద్రీకరణ ను బలపరుస్తుంది.

3) సామంత విధానంలో భూమిశిస్తు వసూళ్లు మొదలైనవి కేంద్ర ప్రభుత్వ ఉద్యోగులు కాక సామంతరాజులే చూసుకుంటారు. కనుక ఈ విధానం ద్వారా కేంద్రానికి కావాల్సిన ప్రభుత్వోద్యోగుల సంఖ్య గణనీయంగా తగ్గుతుంది. అలాగే ప్రావిన్షియల్ గవర్నర్ల స్థాయి ప్రభుత్వోద్యోగులు కూడా మొఘలుల్లా అంత సంఖ్యలో అవసరం ఉండదు. సామంతరాజులే వారి స్థానాన్ని భర్తీ చేస్తారు కాబట్టి. అందుకే మౌర్యులు ముఘల్లు విస్తృత ఉద్యోగ బృందం గుప్తులకి లేదు.

4) ఈ విధానంలో సామంతులు యుద్ధాలప్పుడు చక్రవర్తికి సైన్య సహాయం చేయాలి. దీనిద్వారా చక్రవర్తి మొఘలుల్లా భారీ స్థిరసైన్యాన్ని (సిద్ధ సైన్యం) లాగే పోషించాల్సిన అవసరం ఉండదు.

5) ఈ విధానంలో ప్రజలు చక్రవర్తితో ప్రత్యక్ష సంబంధాన్ని కోల్పోతారు. వారు క్రమంగా చక్రవర్తికి గాక తమ ప్రాంత సామంతుని పట్లే విధేయత పెంచుకుంటారు. ఇది సామ్రాజ్య మనుగడకి (లోపం ①) ప్రమాదకరమైంది. అదిగాక సామంతులకి అంతర్గత పాలనా స్వేచ్ఛ ఉండడంతో ఆయా ప్రాంతీయ శాసనాలు వేరుగా ఉండి ప్రజలలో పాలనా (లోపం ②) ఐక్యత లోపిస్తుంది.

6) చక్రవర్తి అసమర్థుడు ఎప్పుడైతే అప్పుడు దేశప్రజల స్థితిగతుల గురించి తెలుసుకోని నిర్లక్ష్యం చేసేవాడు. కావున సామంత విధానం కారణంగా గుప్త చక్రవర్తులు ప్రజల బాగోగుల్ని అధికంగా సామంతుల దయా దాక్షిణ్యాలకే వదిలేయాల్సి (లోపం ③) వచ్చింది.

7) సామంతులు చక్రవర్తి కి బలమైన స్నేహితులుగా గాని లేదా ప్రమాదకరమైనవారిగా / పోటీదార్లు ప్రమాదం గా గాని ఉండే అవకాశముంది. చక్రవర్తి ఏ మాత్రం ఏమర్చినా శక్తివంతుడైన సామంతుడు స్వాతంత్ర్యత ప్రకటించుకోవడమో లేదా ఇతర సామంతులు, తెగల నాయకులతో చేరి ఏకంగా తానే చక్రవర్తి గా మార యత్నించడమో (లోపం ④) చేసే వీలుంది.

ఈ విధంగా సామంత విధానం ద్వారా చక్రవర్తి కేంద్రీకృత సామ్రాజ్యం లేని చక్రవర్తి వలె విస్తృతాధికారాలు చెలాయించలేడు. అందువలనే (కొందరు చరిత్రకారులు గుప్తుల యుగం లో ఫ్యూడల్ వ్యవస్థ లక్షణాలు మొదలైతే అవి గుప్తుల అనంతరయుగం లో బలపడసాగాయని అంటారు.) కుషాణుల తర్వాత మళ్ళీ అంతటి సువిశాల కేంద్రీకృత సామ్రాజ్యాన్ని స్థాపించినవారిని ప్రాచీన భారతదేశం లో వీరు కుదరలేదు.

క్రీ.శ. 300 – 750 మధ్యకాలం లో
(సామాజిక) సాంఘిక వ్యవస్థ నిర్మాణం
Social Structure
సాంఘిక నిర్మితి

గుప్తుల, గుప్తుల అనంతర యుగాల్లోని (క్రీ.శ.750 వరకు) సాంఘిక నిర్మితి సమకాలీన రాజకీయ, ఆర్థిక మార్పులు, మతం లో కలిగిన నూతన భావాలు వీటన్నింటి ప్రభావ పరిణామ ఫలితమని చెప్పవచ్చు.

నాటి సాంఘిక నిర్మితి లో వర్ణవ్యవస్థ అత్యంత ప్రధానమైనది. బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులు తమ వృత్తుల్ని మాత్రమే నిర్వహిస్తూ తమకు కేటాయించబడ్డ హక్కుల్ని అనుభవించవచ్చు. సంఘం లో ఈ చాతుర్వర్ణ్య ధర్మాన్ని కాపాడటమే రాజధర్మం. అయితే ఈ కాలం లో ఇది ఆదర్శ వర్ణధర్మం గా మాత్రమే మిగిలి ఆచరణలో పలు మార్పులు చోటుచేసుకున్నాయి.

రాజకీయ – సాంఘిక క్రమానుగతశ్రేణి – వర్ణాలు

నూతనంగా పెరిగిన భూదానాలు భూప్రభువర్గాన్ని సృష్టించాయి. సామంతులు, పాలనా హక్కులు గల భూప్రభువులు వారి వర్ణాలతో సంబంధం లేకుండా ప్రత్యేక సాంఘిక హోదా గల వర్గం గా ఎదిగారు. ఈ వర్గం లో బ్రాహ్మణ

భూ(ప్ర)భువులు తమ పొలాల్లో పనులను త్యజించి తమ భూమి లో పాలనా నిర్వహణ చేసే బ్రాహ్మణ భూస్వాములు కూడా ఒక భాగం. ఈ వర్గం వర్ణ కట్టుబాట్లకి అతీతం గా వెలసింది. దాంతో సంఘం లో ఒకరి హోదా కేవలం వారి వర్ణాన్ని బట్టే గాక అనేక రకాల భూస్వాముల మధ్య వారి స్థానాన్ని బట్టి కూడా ఉండేది. సాంఘిక హోదా లో తేడాలకు ఒకరికి ఎంత భూమి ఉంది అన్నది ఆధారం అయింది. ఇది ఏదో ఒక వర్ణానికి పరిమితం కాలేదు.

గుప్తుల, గుప్తుల అనంతరయుగం లో నూతన జాతుల (కులాల) పుట్టుక, ప్రోత్సాహం సాంఘిక నిర్మితి లో ప్రధాన పరిణామం. నగరాలు బలహీనమై గ్రామాల్లో స్థిరపడిన చేతివృత్తుల వారు, నూతనం గా సంస్కరించబడ్డ వర్ణవ్యవస్థ లో శూద్రులు గా చేర్చబడ్డ అనంత్య తెగల వారు ఈ నూతన జాతుల/కులాల పుట్టుక కు కారణమని చెప్పవచ్చు. క్రీ.శ. తొలి శతాబ్దాల్లో మనువు మిశ్రకులాలు కేవలం 61 గా చెప్పగా క్రీ.శ. 8 వ శతాబ్దం లోని విష్ణుధర్మోత్తర పురాణం వేలాది మిశ్రకులాలు ఉన్నాయని చెప్పడం దీన్ని బలపరుస్తుంది.

గుప్తుల కాలం లో వర్ణ నియమాలు

అంత కఠినంగా లేవని మధ్యయుగం లోనే అవి మరింత కఠినంగా తయారయ్యాయని ఎ.ఎల్. బాషం

అభిప్రాయపడ్డారు. గుప్తుల కాలం లో అనులోమ వివాహాలను (ఉన్నత కులాల అబ్బాయి తక్కువ కులాల అమ్మాయి) అనుమతించేవారు. కాని మిశ్రకులాల సంఖ్య అసంఖ్యాకం గా పెరుగుతుండడం తో క్రమంగా కులాంతర వివాహాలను వ్యతిరేకించడం మొదలైంది.

వర్ణసంకరాల ద్వారా గాక సమకాలీన అవసరాల దృష్ట్యా కూడా నూతన కులాలు ఆవిర్భవించాయి. గుప్తుల కాలం లో భూవిభజన ఎక్కువయ్యింది. ఫలితం గా సేద్యమైన భూపత్రాలు, గ్రంథాల నిర్వహణ కోసం కాయస్థ, కరణ, కరణిక, పుస్తపాల, చిత్రగుప్త, మొ॥ శ్రేణులు ఏర్పడ్డారు. కాలక్రమం లో వేరు వేరు వర్ణాలకు చెందిన ఈ శ్రేణులందరూ తమ శ్రేణుల వర్గం లోనే అంతర్గత వివాహాలు, సాంఘిక సంబంధాలు పరిమితం చేసుకోవడం ద్వారా కాయస్థ కులం గా ఆవిర్భవించారు.

క్రీ.శ. తొలి శతాబ్దానికి అంటరానివారు ఏర్పడినా వారి సంఖ్య పరిమితంగా ఉండేది. కాని క్రీ.శ. 3 వ శతాబ్దం నుండి వారి సంఖ్య గణనీయంగా పెరిగింది. సాయుధీకరణకు, బ్రాహ్మణీకరణకు అంగీకరించని వెనుకబడిన తెగల వారిని

అంటరానివారి గా చూడడం ఇందుకు కారణమని భావిస్తారు. 

ఏదేమయినా ఆనాడు వ్యవసాయ విస్తరణ అధికంగా సాగేది కాబట్టి శ్రామికశక్తి కూడా బాగా అవసరమయింది, దీన్ని అంటరానివారి చేత తీర్చుకున్నారు. అయితే వారికి వ్యవసాయం చేసేందుకు అనుమతి లేదు. కేవలం కూలీ పనులే చేయించుకునేవారు. ఈ పనులు లేనప్పుడు తోళ్లు శుభ్రం చెయ్యడం లాంటి అల్పమైన పనులు చేసేవారు. వారి నీడ కూడా అంటరానిదిగా భావించేవారు. బహిరంగ ప్రదేశాల్లో తమ రాకను తెల్పుతూ చెక్క మోగించే అంటరానివారిని గూర్చి ఫాహియాన్ పేర్కొన్నాడు.

గుప్తుల కాలం లో నేతపనివారు మొ॥ వృత్తుల వారు ఉన్నత సాంఘిక స్థాయి కలిగి ఉండేవారు. కాని క్రమంగా వర్తకవాణిజ్యాలు దెబ్బతిని ఈ వృత్తుల వారు ఆర్థికంగా పతనమవడమే గాక సాంఘికంగా కూడా దిగజార్చబడ్డారు. ఈ వృత్తికారులు ముందు కులాలు గా ఏర్పడ్డారు. తర్వాత కులవ్యవస్థ లో పతనం పొందారు. సువర్ణకార, మాలకార, చిత్రకార, నవీత మొ॥ కులాల్ని భిన్న సమూహాలు కూరించే అంత్యజుల వృత్తుల నించి ఏర్పడినవే. వృత్తి శ్రేణులు కులాలు గా రూపాంతరం చెందాయి. ఈ కులాలు సాంఘిక స్థాయి లో పతనాన్ని క్రమంగా పొందాయి. నేతపనివారు, వడ్రంవారు, దర్జీలు, మంగలి, చెప్పులుకుట్టేవారు, కమ్మరి, చాకలి మొ॥ కులాలు క్రీ.శ. 6వ శతాబ్ది నాటికి అంటరానివారి గా దిగజార్చబడ్డారు.

ఈ కాలం లో తులనాత్మకం గా

వైశ్య, శూద్రుల సాంఘిక హోదా లో మార్పులు కలిగాయి. శూద్రులు కేవలం బానిసలు, సేవకులు కారు. వారు కౌలుదార్లు, పంట-భాగస్వాములు, సాగుదార్లు గా ఎదగసాగారు. నగరాల పతనం కూడా అనేక మంది శూద్ర వృత్తికళాకారుల్ని వ్యవసాయం లోకి నెట్టింది. హ్యుయాన్ త్సాంగ్ వ్యవసాయదార్ల్ని శూద్రుల విధి గా చెప్పాడు. స్కంద పురాణం శూద్రుని 'అన్నద' - ధాన్యమిచ్చేవాడు గా పేర్కొంది. ఫలితంగా శూద్రుల సాంఘిక, ఆర్థిక హోదా పెరగసాగింది.

మౌర్యానంతర దశ లో మంచి దశ లో ఉన్న వైశ్యుల హోదా వర్తక వాణిజ్యాల పతనం తో పాటే పతనమయింది. ఆర్థికం గా బలహీన వైశ్యులు వ్యవసాయం లోకి దిగారు. గుప్తుల కాలం వరకు స్వేచ్ఛా భూస్వాములుగానున్న వైశ్యుల్ని కింది వర్గాల రైతులు త్వరితం గా / వేగం గా అణచివేత కు ఆధారిత స్థితి కి నెట్టివేయబడ్డారు. వైశ్య, శూద్రుల విధుల్ని / పనుల్ని మరియు వారి జీవిత ప్రమాణాల్లో భేదం అంతరించింది / అస్పష్టమైంది. అందువల్లనే అల్బెరూని రచనల్లో వైశ్య, శూద్రుల్ని ఏకగాటన కట్టి వేయడం కన్పిస్తుంది.

వర్ణవ్యవస్థ గంగామైదాన ప్రాంతం నుంచి దేశం లోని ఇతర ప్రాంతాలకు వ్యాపించే క్రమం లో కూడా ఎన్నో మార్పులు పొందింది. భూదానాలు

స్వీకరించిన బ్రాహ్మణులు క్రీ.శ. 5-7 శతాబ్దాల మధ్య
దక్కను, మధ్య భారతం, ఒరిస్సా, బెంగాల్ మరియు అస్సాం లకు
వ్యాపించారు. వీరు స్థానిక పురోహిత వర్గం మీదకు బ్రాహ్మణ హోదా
కల్పించారు. స్థానిక తెగల ప్రజల్ని సంక్షిప్త సాంఘిక నిర్మాణం
లో రైతులు గా మార్చటం, వారిని శూద్రులు గా పరిగణించటం
గుప్తానంతర యుగం లోని ప్రధాన సాంఘిక పరిణామం. బ్రాహ్మణులు
ఈ ప్రాంతాలను వ్యాపించేనాటికి శూద్ర, వైశ్యుల మధ్య అంతరం
స్పష్టమవడం లో ఈ ప్రాంతాల్లో వైశ్యులు ప్రత్యేకంగా రూపొందలేదు.
ఎప్పుడో వర్తక వాణిజ్యాలు బాగా సాగినప్పుడు కొందరు వైశ్య హోదా
చెప్పుకోవడం అప్పుడప్పుడు జరిగింది. అలాగే స్థానిక పాలక వర్గాలు
తమను క్షత్రియులు గా చెప్పుకుని సూర్య, చంద్ర వంశాలు
ఆపాదించుకున్నా ఈ ప్రాంతాల్లో క్షత్రియ వర్గం స్పష్టంగా
ఏర్పడలేదు.

అసంఖ్యాక కులాల పుట్టుక వల్ల ఈ కాలం లో
ముఖ్యంగా గుప్తానంతర యుగం లో అంటరానివారి లో సహా
అన్ని వర్ణాల్లో కులాల క్రమానుగత శ్రేణి ఏర్పడింది. మరోవైపు
ఒకే వర్ణం అనేక వర్ణాలు గా విడిపోయిన సందర్భాలూ ఉండేవి.
అభీర తెగ లో అభీర బ్రాహ్మణ, అభీర క్షత్రియ, అభీర
శూద్ర అనే విభజనలు ఏర్పడ్డాయి.

తమ పురోహిత సేవల్ని వ్యాపారీకరణ చేసుకున్న
బ్రాహ్మణులు, తెగల వారితో వ్యవహరించేవారు, శరీర శ్రమ ని
పూర్తి గా విడువలేని బ్రాహ్మణుల్ని క్షత్రియ అగ్రహార

## స్త్రీల హోదా :

'బృహత్సంహిత' లో స్త్రీలని, శూద్రులని సమానంగా పేర్కొనడం సమాజంలో దిగజారిన స్త్రీ హోదాకు ప్రతిబింబం. వారు నియమిత విద్యకు అనర్హులు. కౌమారానికి ముందే (pre-puberty) వివాహాలు చేయడం వైపు మొగ్గు చూపేవారు. 'స్త్రీధనం' తప్ప వారికి ఆస్తిహక్కులు లేవు. అయితే విధవల విషయంలో యాజ్ఞవల్క్య వాక్యాలు కొంత ప్రగతిని చూపిస్తుంది. 'సతి' ఈ కాలంలో సాంఘిక ఆమోదం పొందింది, క్రీ.శ. 510 నాటి సతి శాసనం ఎరాన్ లో లభించింది. క్రీ.శ. 5 వ శతాబ్దం తర్వాత నుండి వివాహానంతరం స్త్రీ గోత్రం మార్చే ఆచారం మొదలై పితృస్వామ్యానికి చిహ్నంగా నిల్చింది. దేవదాసీలు గా స్త్రీలు నియమింపబడటం కొనసాగింది. వేశ్యలు ప్రత్యేక సాంఘిక వర్గం గా ఉండేవారు, మత్స్యపురాణం వేశ్యల విధులు- బాధ్యతలు వారి ప్రాముఖ్యతల్ని పేర్కొంది. గణికలనే ఆస్థానకారిణులు ఉండేవారు, వేశ్యల్లా కాక వారి శిక్షణ ను బట్టి ఇది కోరబడే వృత్తి (more demanding profession) గా తెలుస్తుంది. జపాన్ లోని గీషా లేదా గ్రీసు లోని హెటేరా లా గణిక సమానురాలని చెప్పవచ్చు. పరదా పద్ధతి పాటించేవారు కాదు. అయితే [illegible] రాజులు తమ రాణుల్ని ఆస్థానంలో పరదా లేకుండానే అందరి మగవారిని చూడనిచ్చేవారు కాదు.

## వివాహ నియమాలు :

వివాహాలు సాధారణంగా తల్లిదండ్రులే ఏర్పాటు చేసేవారు, అయితే గంధర్వ వివాహాలు అడపాదడపా కన్పిస్తాయి. విధవా వివాహాల పట్ల అయిష్టత ఉన్నా పూర్తిగా నిషేధం చెయ్యబడలేదు. వివాహిత విధవ కు సాధారణ గృహిణి హోదా ఉండేది కాదు. గుప్తుల కాలంలో బ్రాహ్మణ, క్షత్రియులు ఆస్థానకారిణుల కూతుళ్లను, స్త్రీ బానిసలను వివాహం చేసుకునేవారు. కాని గుప్తానంతర యుగం లో వివాహ నియమాలు కఠినం చేయబడ్డాయి. బ్రాహ్మణులు కులాంతరంగా క్షత్రియ, వైశ్య కన్యల్ని మాత్రమే వివాహం చేసుకోవచ్చు. అనులోమ వివాహాల ఫలితమైన బిడ్డలు తల్లి కులాన్ని; ప్రతిలోమ వివాహాల ఫలితమైన పిల్లలు తండ్రి కులాన్ని పొందుతారు. [illegible] మేనరిక వివాహాల్ని ఖండించారు. స్వయంవర వివాహాలు అప్పుడప్పుడు — తల్లిదండ్రుల అనుమతి తో స్వయంవర మహోత్సవాల్లో కన్యలు తమకు నచ్చిన వారిని వివాహమాడేవారు.

## బానిస వ్యవస్థ :

గుప్తుల కాలంలో బానిసలు పెరిగారు. బ్రాహ్మణుడు ఎప్పటికీ బానిస కాడు. బ్రాహ్మణ స్త్రీని కొనడం, అమ్మడం నిషేధించబడ్డాయి. స్వేచ్ఛా స్త్రీ బానిసను వివాహమాడితే బానిస అవుతుంది. బానిస స్త్రీ తన యజమానితో కొడుకును ప్రసవిస్తే బానిసత్వం నుంచి విముక్తమవుతుంది.
గుప్తుల కాలంలో బానిసల సంఖ్య పెరిగినా సమకాలీన ఇతర ప్రాచీన ప్రపంచంలో పోలిస్తే అది తక్కువేనని రొమిలాథాపర్ అభిప్రాయం. యుద్ధ ఖైదీలు, అప్పులు తీర్చనివారు, బానిసస్త్రీ సంతానం వంటి సంప్రదాయ పద్ధతులే గాక తమ స్వాతంత్ర్యాన్ని పణంగా ఓడిపోయిన వ్యక్తులు కూడా బానిసలుగా మారేవారు. బానిసల్ని ఉత్పత్తికంటే ఇంటి పని చేసేందుకే వాడేవారు.

## కుటుంబం :

హిందూ సమాజంలో 'ఉమ్మడి కుటుంబం' తప్పని సరి లక్షణంగా ఉండేది. తండ్రీ, కొడుకులు, మనుమలు ఆస్తిపై సమయాజమాన్యం కలిగి ఉండేవారు. తండ్రి ఆస్తిలో కొడుకులకి సమాన వాటాలుండేవి. పితృస్వామ్య కుటుంబవ్యవస్థ అది జగద్విదితమే.

## నగర జీవనం :

శాసనాధారాల ద్వారా వర్తక శ్రేణులు తరచుగా నగర పాలక సభల్లో ప్రతినిధులుగా ఉండేవారని తెలుస్తుంది. అంటే శ్రేణులు వారికి రాజకీయంగా తక్కువ పాత్ర

ఆచారం లో స్త్రీలకు అమలయ్యేది కాదని అది
వాస్తవం కన్నా ఊహకే ఆదర్శమని తెలుస్తుంది.

నగరాల్లో ధనికులు సుఖప్రదమైన జీవనం
గడిపేవారని 'కామసూత్ర' వంటి గ్రంథాల ద్వారా తెలుస్తుంది.
కళల అభివృద్ధికి కావాల్సిన తీరిక వీరికుండేది.

అయితే అధిక సంఖ్యాకుల జీవనం మాత్రం
కష్టాలు, పేదరికం తో గడిచేది. సమకాలీన రచనలు
తరచుగా 'కలి' కాలం లో ఇలాంటి మంచి జీవితం కష్టమని
వ్యాఖ్యానించటం, జాతకాల్ని సాకుగా చెప్పటం కన్పిస్తుందని
శర్మలాంటి వారు అంటారు.

గ్రామీణ జీవితం:

గ్రామీణ సమాజం లో ఉన్నతవర్గం వారు సుస్థిరంగానే
ఉన్నా భూస్వాముల ప్రమాణాల్ని పెరగటం లో రైతు
మీద భారం అధికమై తీవ్ర కష్టాలు పడ్డారు. భూమిశిస్తు
ఏ లోటు పెరిగిన పన్నులు, వృష్టి ఇంతకు ముందు
కాలం లో పాలకుల వారి స్థితి ని దయనీయం చేసింది.

ఆహారం:

ప్రాచీనయుగ భారత్ లో పంటలు లెక్కు
అదమా కాకా వర్ణించే లిపి రాజుడు, అయితే శాస్త్రీయ
ఆధారాల ద్వారా నాటి ప్రజలు మాంసాహారం బాగానే
తినేవారని తెలుస్తుంది. మొక్క జొన్నయాల కేవలం

ఉన్న నియమాలు కూడా సడలించబడ్డాయి. ఉదా; మొలాసిస్ మరియు తేనె లేదా ద్రాక్ష లేదా మధూక పుష్పాల నుంచి తీసిన సుర-బ్రాహ్మణులకు ఈ మూడు రకాలూ నిషేధించబడ్డాయి. క్షత్రియ, వైశ్యులకు చివరి రెండు అనుమతించబడ్డాయి. ఎద్దు మాంసాన్ని బలం కోసం వైద్యపరంగా తినమనేవారు. దేశ, విదేశీ మధువుతో పాటు తమలపాకు సేవనం తరచూ చేసేవారు.

శుభ్రత:

గుప్తుల కాలంలో, అంతకుముందు సాధించిన ఉన్నత వ్యక్తిగత శుభ్రతా ప్రమాణాలు గుప్తానంతరయుగంలో కూడా పాటించబడ్డాయి. గృహస్థ స్నానం, పళ్లు తోముకోవడం, శరీరాన్ని పవిత్రంగా ఉంచుకోవడం పై విస్తృత సూత్రాలు చెప్పబడ్డాయి. 'రతిరహస్య' లో స్త్రీ పురుషుల సౌందర్య సాధనా చిట్కాలు చెప్పబడ్డాయి.

వినోదాలు:

ఈ కాలంలో ఉన్నతవర్గాల వినోదాలు 'కందుక' (బంతి), పాచికల ఆటలు ఆడేవారు. నాటకాలు అధిక సంఖ్యలో చూసేవారు. ప్రత్యేక సందర్భాల్లో గిరిజన నృత్యాలు, గానసభలు జరిగేవి. జూదం పురుషుల్లో తరచూ కనిపించేది. కోడి, పొట్టేలు, దున్నపోతుల మధ్య పందేలు గ్రామీణ ప్రాంతాల్లో సాగేవి.

* ఈ కాలంలో నగరవాసులు తాము ఆర్థికంగా మెరుగుగా ఉండటం చే ఉత్తమ జీవితాన్ని గడపడమే గాక అధిక సాంస్కృతీకరణ పొందినవారమని - 'నాగరకులమని' చెప్పుకునే వారు.

* 'ఆపద్ధర్మ' - ఇది గుప్తుల కాలంలో బాగా ఉండేది. సాధారణ సమయాల్లో అనుమతించబడని విధంగా అత్యవసర పరిస్థితుల్లో వ్యక్తులు వర్ణధర్మం తమ వర్ణాలకు నిషేధించిన విధుల్ని కూడా నిర్వర్తించవచ్చని ఆపద్ధర్మ చెబుతుంది.

# పల్లవ - చాళుక్యుల ఘర్షణ

క్రీ.శ. 6 వ శతాబ్దం మధ్యభాగం లో మొదలై / మొదలుకొని దాదాపు 300 ఏళ్ళపాటు దక్షిణ భారతీయ రాజకీయ చరిత్ర ప్రధాన రాజ్యాల మధ్య ఘర్షణల చరిత్ర గా నడిచింది. వీని లో కాంచీపురం రాజధానిగా గల పల్లవులు, బాదామి రాజధాని గా చాళుక్యుల మధ్య ఘర్షణలు ప్రధానమైనవి.

ఘర్షణ కు కారణాలు :

1) చాళుక్యుల రాజ్యంలో చాలా వరకు శిలామయమైన భూమి, సారవంతం కాని నేల ఉన్నందువల్ల భూమిపై రాబడి వచ్చే ఆదాయం తక్కువ. ఈ కాలానికి వాణిజ్యం కూడా పతనావస్థలో ఉన్నందున ఆ మార్గం లో వచ్చే ఆదాయం కూడా స్వల్పమే. అందువల్ల చాళుక్యులు తరచూగా ఇరుగు పొరుగు ప్రాంతాల్లో కొల్లగొట్టేవారు.

మరోవైపు పల్లవులు సారవంతమైన కావేరి నది డెల్టా ప్రాంతం లో ఉండడం చే సిరిసంపదలతో రాజ్యం తులతూగేది. ఇది సహజంగానే చాళుక్యుల్ని ఆకర్షించింది. చాళుక్యులే ముందు ఘర్షణ ను ఆరంభించటం దీనికి మద్దతు కల్పిస్తుంది.

2) పల్లవుల తో ఘర్షణకు ముందే పులకేశి II ఉత్తరంలో హర్షుణ్ణి ఓడించాడు. తరువాత దక్షిణం లో

తూర్పు దక్కను లో దక్షిణ కోసల, కళింగ, పిష్టపుర మొ॥ వాటిని జయించి ఏలాడు. ఇక మిగిలిన బలమైన రాజ్యం పల్లవ రాజ్యమే. ఈ సమయంలో రాజుగా సమానమైన శత్రువులుగా నిరంతరంగా దేశములో లో పల్లవుల పై దండెత్తి వెళ్ళాడు.

3) ఒక సారి ఘర్షణ మొదలయ్యాక తర్వాత అనేక యుద్ధాలు కేవలం ప్రతీకారం తీర్చుకోవటం కోసం కూడా జరిగాయని చెప్పవచ్చు.

"ఈ ఘర్షణ ఎంత రాజకీయమైందో అంత ఆర్థికమైంది, ఫలితం గా ఇరు వంశాల అదృష్టం లో మునిగితేలుతూ శతాబ్దాల పాటు కొనసాగింది"

— రొమిలా థాపర్

ఘర్షణ కొనసాగిన తీరు :

క్రీ.శ. 610 లో రాజ్యాన్ని అధిరోహించిన రెండవ పులకేశి సైనికయాత్రల ద్వారా అధికారాన్ని స్థిరపరచుకొని క్రీ.శ. 630 లో పల్లవ రాజ్యం పై దండెత్తి "పుల్లలూరు యుద్ధం" లో మహేంద్రవర్మ I ను ఓడించెను. మహేంద్రవర్మ తన రాజధానిని కాపాడుకున్నా రాజ్య ఉత్తర భాగం చాళుక్యులకి కోల్పోయాడు. చాళుక్య - పల్లవుల కి జరిగిన సుదీర్ఘ ఘర్షణ కి ఇది ఆరంభం అయ్యింది.

పులకేశి II సామ్రాజ్యంలో మరింత దిగ్విజయాన్ని సాధించాలని పల్లవరాజ్యం పై మరలా దండెత్తాడు. పల్లవ సామంతులు బాణుల్ని ఓడించి ముందుకు సాగాడు. మహేంద్రవర్మ I కొడుకు, రాజైన నరసింహవర్మ I "మణిమంగళ (2) యుద్ధం" లో పులకేశి II ని అడ్డగించి ఓడించాడు. ఈ యుద్ధంలో సింహళ రాజకుమారుడు మానవర్మ పల్లవుల కి మంచి తోడ్పాటు అందించాడు. అనంతరం నరసింహవర్మ I చాళుక్య రాజ్యం పై దండెత్తి క్రీ.శ. 642 లో బాదామి ని వశపర్చుకొని "వాతాపి కొండ" బిరుదు ధరించాడు.

పులకేశి II కొడుకు విక్రమాదిత్య I రాజకీయ సంక్షోభం నుంచి బయటపడి పల్లవ సేనల్ని బాదామి నుంచి తరమటమే గాక తన తండ్రి రాజ్యాన్ని పునరుద్ధరించాడు. నరసింహవర్మ I మరణానంతరం (క్రీ.శ. 668) రాజైన (3) మహేంద్రవర్మ II కాలం లో విక్రమాదిత్య I తో ఘర్షణ మొదలైంది. ఇతని కొడుకు పరమేశ్వరవర్మన I (4) కాలం లో విక్రమాదిత్య I పాండ్యరాజు అరికేసరి పరాంకుశ మారవర్మ I తో కలిసి కంచి పరిసరాల దాకా సేనని నడిపాడు. పల్లవరాజు పారిపోయి శరణు కోరాడు. విక్రమాదిత్య I తన్ని కావేరి తీరం వరకు తరిమికొట్టి ఉరయూరు లో వేచాడు. పరమేశ్వరవర్మ I ఈ లోపు లో పెద్ద సైన్యం సమకూర్చుకుని చాళుక్యుల

మిత్రుడు గంగ వంశ భూవిక్రముని "విలందె"(5) వద్ద ఎదిరించాడు. ఈ యుద్ధం లో ఎదురు దెబ్బ తగిలింది. అయినా చలించక శత్రువుల దృష్టి మరల్చేందుకు అంత సైన్యాన్ని చాళుక్య రాజ్యం పైకి పంపి తాను ఆక్రమణ సేనల్ని ఎదుర్కొన్నాడు. "పెరువలనల్లూర(6) యుద్ధం" లో చాళుక్యుల్ని ఓడించి పల్లవ రాజ్యం కాపాడుకున్నాడు.

ఆ తర్వాత వినయాదిత్య (క్రీ.శ. 681-96) విజయాదిత్య (క్రీ.శ. 696-733) ల అటు నరసింహవర్మ II (క్రీ.శ.700-28) ల కాలం లో ఘర్షణ కొనసాగించింది.

కాని పరమేశ్వరవర్మ II (క్రీ.శ. 728-31) కాలం లో విక్రమాదిత్య II(7) చాళుక్యుడు, గాంగ రాజుసూరుడు ఎరియప్ప తో కలిసి కంచి పై దాడి చేశాడు. పల్లవ రాజు ఎంతో నష్టపడి శాంతి పొందాడు. గాంగ రాజు పై ప్రతీకారం తీర్చుకునేందుకు చేసిన "విలందె యుద్ధం"(8) లో పల్లవరాజు చంపబడ్డాడు.

నందివర్మ పల్లవ మల్ల కాలం లో విక్రమాదిత్య II(9) గాంగ సామంతుడు శ్రీపురుష తో కలిసి క్రీ.శ. 735 లో కంచి ని ఆక్రమించాడు. అయితే ఉదాత్తంగా వ్యవహరించి కంచి నగరాన్ని ధ్వంసం చేయ యత్నించలేదు. ప్రజలకి కానుకలు, కైలాసనాథ ఆలయ దేవాలయాలకి చెందే బంగారాన్ని వాటికి తిరిగి ఇచ్చివేసి వారి మెప్పు పొందాడు. కైలాస నాథ ఆలయం లోని స్తంభం పై ఈ వివరాలు రాసి

ఈ విధంగా నరసింహవర్మ I బాదామిని ఆక్రమించడం ద్వారా చాళుక్యులకి జరిగిన అవమానాన్ని తుడిచిపెట్టినట్లుగా పేర్కొన్నారు. [ఈ ఘర్షణలకు ప్రతీకారం కారణమన్న విషయాన్ని దీని ద్వారా బలపరచవచ్చు] ఆ తర్వాత విక్రమాదిత్య II తన రాజ్యం తిరిగి వెళ్లాడు.

అయితే విక్రమాదిత్య II తన పాలన చివరి కాలంలో పల్లవుల పైకి కొడుకు కీర్తివర్మ II ను దాడికి పంపాడు. ఇతడు యుద్ధంలో గెలిచి ఎన్నో ఏనుగులను, పెద్దమొత్తంలో బంగారం, వెండి బాదామికి తెచ్చాడు.

[ ] పల్లవులతో, అరబ్బులతో అనేక యుద్ధాల వల్ల చాళుక్య రాజ్యం బలహీనపడింది. అంతట వారి సామంతుడు దంతిదుర్గ రాష్ట్రకూట క్రీ.శ. 757 లో చాళుక్యరాజ్యాన్ని ఆక్రమించాడు. (కీర్తివర్మ II బాదామి చాళుక్య వంశం లో చివరి పాలకుడు అయ్యాడు.)

ఈ ఘటనతో సుదీర్ఘ కాలం సాగిన చాళుక్య-పల్లవ ఘర్షణ ముగిసింది.

**ఘర్షణపై విశ్లేషణ:**

దక్షిణ భారతంలో ప్రధానంగా బాదామి చాళుక్య - పల్లవ - పాండ్యుల మధ్య ఘర్షణల్లో సదా

పల్లవులే గురి గా ఎన్నుకున్నారు, ఇందుకు ప్రధాన కారణం కొందరు వారి సామ్రాజ్యవాదం గా చూడడం.

ఈ ఘర్షణల్లో చాళుక్యులే పల్లవులపై దాడి చేశారు, పల్లవులు ప్రధానం గా వారిని తమ ప్రాంతాల్లోంచి వెళ్లగొట్టడానికే పరిమితమయ్యారు. ఒకటి నరసింహవర్మ I బాదామి ని ఆక్రమించడం మినహాయింపు. అయితే ఇది కేవలం ప్రతీకారం తీర్చుకునేందుకు మాత్రమే చేసిన చర్య, ఇదికూడా మొత్తం ఘర్షణ చరిత్ర లో ఒకేసారి జరిగింది. మరోసారి పల్లవ పరమేశ్వరవర్మ I చాళుక్యరాజ్యం లోకి సైన్యాన్ని పంపాడు, అయితే ఇది కేవలం తనను ఆక్రమిస్తు తన ప్రాంతం లో ఉన్న చాళుక్యరాజు దృష్టి మరల్చేందుకు చేసిన చర్య మాత్రమే.

అలాగే విక్రమాదిత్య II కంచి ని గెలిచినప్పుడు చూపిన ఉదాత్తత కూడా శాశ్వతమైనదేమీ కాదు. తన పాలన చివరి కాలం లో తానే తన కొడుకును పల్లవులపై దాడి కి పంపి సంపద దోచుకోవడం గమనించదగింది.

ఘర్షణ ప్రాముఖ్యత:

1) రెండవ పులకేశి మహేంద్రవర్మ I ను ఓడించిన తర్వాత తన సోదరుడు విష్ణువర్ధనుని ఆంధ్ర ప్రాంతానికి ప్రతినిధి గా పంపాడు. ఆతడు ఆ ప్రాంత పరిస్థితుల్ని చక్కబెట్టిన తర్వాత తన సోదరుని అనుమతి తో తూర్పు చాళుక్య వంశాన్ని ( క్రీ.శ.      ) స్థాపించాడు. తెలుగు నేల ను ఈ వంశీయులే ఆ తర్వాత ఐదు శతాబ్దాల పాటు ఏలారు.

2) నరసింహవర్మ I బాదామి ని ఆక్రమించడం, రెండవ పులకేశి మరణం లతో చాళుక్యుల్లో అంత రాజకీయ సంక్షోభం నెలకొంది. ఈ సమయం లో స్వేచ్ఛకై ప్రయత్నిస్తున్న వారిని అణచి తిరిగి రాజ్య విస్తరణ నెలకొల్పడం లో విక్రమాదిత్య I కు తమ్ముడు జయసింహవర్మ ఎంతో అండగా నిల్చాడు. ఇందుకు గుర్తింపు గా దక్షిణ గుజరాత్ ను తమ్మునికి ఇచ్చివేశాడు. ఫలితం గా లాట చాళుక్య రాజ్యం ఏర్పడింది.

3) రెండవ పులకేశి ని సంహరించడం లో నరసింహవర్మ I కు సింహళ రాకుమారుడు మానవర్మ ఎంతో అండగా ఉన్నాడు. అందుకు ప్రతిఫలంగా మానవర్మ ను సింహళ సింహాసనం పై నిలిపేందుకు నరసింహవర్మ తోడ్పడ్డాడు. ఇలా రెండు ప్రాంతాలు దగ్గరవడానికి అవకాశం దొరికింది.

4) ఈ ఘర్షణల ఫలితంగా జరిగే యుద్ధాల్లో గెల్చిన పక్షం ఓడిన వారి దేవాలయాల్లోని విగ్రహాల్ని గెలుపు గుర్తుగా తీసుకెళ్లటం మరియు వాటి తో పాటు ఆ రాజ్యం లోని వృత్తిపనివారిని, వాస్తుశిల్పకారుల్ని, కళాకారుల్ని మరియు వారిని కూడా తమ రాజ్యం తీసుకొచ్చేవారు. వారిచేత తమ కట్టడాల నిర్మాణం చేయించడం మరియు చేసేవారు. ఫలితం గా సంస్కృతుల సమ్మేళనం, ఆలోచనల ప్రవాహం మరియు అధికంగా సాధ్యపడతాయి.

పల్లవుల కైలాసనాథ దేవాలయానికి ప్రత్యక్ష అనుకరణగా భావించే విరూపాక్షఆలయాన్ని పల్లవుల కళాకారులచేత నిర్మింపజేసి ఉంటారని కొందరు చరిత్రకారులంటారు.

విశ్లేషణ:

* ఈ ఘట్టాల్లో కన్పించే మరో ముఖ్య అంశం పల్లవులు-చాళుక్యులు సమఉజ్జీలు, విజయం సాధారణంగా కొద్దిపాటి తేడాతో మాత్రమే ఉండేది. ఇద్దరిలో ఏ ఒక్కరూ ఇతరుల భూభాగాన్ని కలుపుకున్న తర్వాత దాన్ని అదుపులో ఉంచుకోలేకపోవటం వారి సైనికశక్తిలో రాజకీయ అధికారంలో ఉన్న అనిశ్చితమైన సమతౌల్యాన్ని (precarious balance) సూచిస్తుంది.

దాదాపు మూడు శతాబ్దాల పాటు నిరంతర ఘర్షణకు గురైనా పల్లవులు గాని బాదాములు/ బాదామి చాళుక్యులు గాని శత్రువుకి తలొగ్గక తమ ప్రతిపత్తిని (నిల్పుకొనేందుకు నిరంతరం పట్టు తప్పక) నిల్పుకొని వాస్తుకళల్లోనూ తమదైన శైలిని ఆవిష్కరించి నిలిచిపోయారు. దక్షిణ భారత చరిత్రలో అజరామరమైన [నిల్చిన తీరు అద్భుతం.]

# పల్లవుల పాలన

సాంస్కృతిక సేవలలోనే గాక పల్లవులు దక్షిణ భారతంలో పాలనా వ్యవస్థ కూ చక్కని మార్గదర్శకం అందించారు. కులసామ్యకం గా తక్కువ ఆటంకపరిచే ప్రభుత్వ వ్యవస్థ, రాజధాని నుంచి విపరీత జోక్యం లేకుండా గ్రామ, జిల్లా పాలన లో స్థానిక స్వతంత్రత ను ప్రోత్సహించింది. ఈ స్వతంత్రత రాజ్యాధికారాన్ని కోల్పోయేలా చేయలేదు. పైగా కష్టసమయాల్లో, పాలనా విషయాల్లో ఇది సమర్థవంతంగా పనిచేసింది.

## రాచరికం:

పల్లవ రాజులు 'మహారాజాధిరాజ', 'ధర్మమహారాజ' వంటి ఆర్భాట బిరుదుల్ని ధరించేవారు. శాసన ప్రశస్తులు, [illegible] లో వైదిక యాగాల ద్వారా తమ సార్వభౌమత్వాన్ని చాటేరు. సాధారణంగా పెద్దకొడుకు వారసత్వంగా రాజయ్యేవాడు. ఆ అవకాశం లేనప్పుడు మంత్రిమండలి పురోహితులతో చర్చించి రాజవంశం కి చెందిన వార్ని రాజు గా నియమించారు. సిద్ధాంతరీత్యా రాజు శాసన, కార్యనిర్వాహక, న్యాయాంశాల్లో సార్వభౌముడు.

## అధికార యంత్రాంగం:

రాజ కుటుంబ సభ్యులు చాలా పాలనా బాధ్యతల్ని నిర్వహించేవారు. రాజు కు సాయపడేందుకు 28

'మంత్రి మండలి' ఉండేది. శివస్కందవర్మ శాసనం ద్వారా వీరికి అనేకమంది ప్రభుత్వోద్యోగులు గల విస్తారమైన అధికార యంత్రాంగం ఉండేదని తెలుస్తుంది.

పాలనా విభాగాలు:

పల్లవ రాజ్యంలో వీరి సార్వభౌమాధికారాన్ని గుర్తించిన చిన్న రాజులు ఉండేవారు.

వీరి పాలనలో ముఖ్యుల ద్వారా పాలన నుండి క్రమంగా భూదానాలు పొందిన మధ్యవర్తులు మరియు వీరి పాత్ర పోషించే దేవాలయాల ద్వారా పాలించడం వైపుకు మరలడం కన్పిస్తుంది.

పల్లవ రాజ్యాన్ని పాలనా సౌలభ్యం కోసం ఆహార, విషయ, రాష్ట్ర గా విభజించారు. తమిళప్రాంతంలో అతిచిన్న పాలనావిభాగంగా 'నాడు' ఉండేది. ఈ ప్రాంతీయ పాలనలో అధికార క్రమానుగతశ్రేణిలో అధికారులు స్థానిక స్వతంత్ర సంస్థలతో కలిసి పనిచేసేవారు. చాలా వరకు అధికారులు సలహా పాత్ర పోషించేవారు.

ఈ స్థానిక సంస్థలు కులం, వృత్తి, మతవర్గం ఆధారంగా స్థానిక సంబంధాలపై ఏర్పడేవి. వీటి నిర్వహణకు తరచూ సమావేశమవడం తప్పనిసరి. ఈ సంస్థలు అనేక రకాలు, అనేక స్థాయిల్లో ఉండేవి. ఇవి కమిటీలు / ఉపసంఘాల ద్వారా పనిచేసేవి.

ఈ కాలంలో గ్రామ సభలు ప్రధానంగా 3 రకాలు. అవి

సభ : ఇది గ్రామ పాలక సభ. ఇది గ్రామానికి సంబంధించిన అన్ని పనులు - దేవాలయసంపద, సాగుభూమి, నీరాలకట్టలు, భూమిపట్టాల నిర్వహణ మొ|| అన్నీ చూసేది.

ఊర్ : 'సభ' నియంత్రణ సంస్థ లేదా అధికారిక సంస్థ, కాని ఇది 'ఊర' తో కలిసి పనిచేసేది. బ్రాహ్మణేతర సాగుదార్ల అదుపులో గల ప్రాంత నాయకులు ఇందులో ఉంటారు.

చేరి : కులవ్యవస్థ వెలుపల జీవించే వారి నివాసప్రాంతం.

నగరం : ఇది వర్తకుల కి ప్రాతినిధ్యం వహిస్తుంది.

భూయజమానుల సంఘం కూడా 'నాడు' పాలనలో పాలుపంచుకునేది.

గ్రామ సభ కి అధికారిక పాలన కి మధ్య వారధిగా గ్రామపెద్ద ఉండేవాడు. ఇతడు గ్రామ నాయకుడిగానూ, ప్రభుత్వ మధ్యవర్తిగానూ వ్యవహరించేవాడు.

న్యాయపాలన :

పల్లవ రాజు సర్వోన్నత న్యాయాధికారి. అయితే చాలావరకు న్యాయవిచారణ స్థానికంగానే సాగేది. గ్రామ న్యాయస్థానాలు, కుల మరియు శ్రేణి పంచాయతీలు వివాదాలు పరిష్కరించేవి. ఇవేగాక కేంద్రప్రభుత్వం 'అధికరణాలు' 'ధర్మాసనాల'ను నిర్వహించి

స్వయంపాలన సాగించేది. 'మెట్కాఫ్ లాస్ ప్రవాసనం' ద్వారా స్వయంపోషకాల్లో కూడా అవిచ్ఛిన్నంగా జారబడిందని తెలుస్తోంది. మొత్తం మీద పల్లెలు నివాసుల స్వయంగా అందించారు.

రెవెన్యూపాలన :

ప్రభుత్వాదాయ దృష్ట్యా 3 రకాల గ్రామాలు కన్పిస్తాయి.

1) సాగు చేసే భూమి మీద, ఉత్పత్తి మీద మరియు ఇతర వృత్తి సుంకాలను చెల్లించే విభిన్న తెగల గ్రామాలు.

2) ఒక లేదా అనేకమంది బ్రాహ్మణులకు దానం చేసిన గ్రామాలు బ్రహ్మదేయ భూములు, వీరు శిస్తు కట్టాల్సిన అవసరం సాధారణంగా ఉండేది కాదు.

3) దేవునికి దానమీయబడిన గ్రామాలు - దేవదాన లేదా దేవాదేయ గ్రామాలు - ఇవి మొదటి రకం వంటివే కాకపోతే ఇక్కడ సాగుదార్లు దేవాలయానికి కౌలుదార్లుగా ఉంటారు.

గ్రామంపై 2 రకాల శిస్తులు విధించేవారు.

1) సాగుదారు ప్రభుత్వానికి చెల్లించే శిస్తు పంటలో $\frac{1}{6}$ నుంచి $\frac{1}{10}$ వ వంతు మధ్య ఉండేది. దీన్ని "గ్రామం" వసూలు చేసి ప్రభుత్వ వసూలుదారుకు చెల్లించేది.

2) రెండవ రకం 'స్థానికసుంకాలు', ఇవి కూడా గ్రామమే

వసూలు చేస్తుంది. కాని ఇవి గ్రామ మరియు గ్రామ పరిసరాల సేవ కు వినియోగిస్తారు - నీటిపారుదలా వసతుల మరమ్మత్తు నుంచి ఆలయ ఆలయకాలువల వరకు వీటిని వాడేవారు.

రాజ్య భూమిశిస్తు అధికంగా ఉండేది.

వ్యవసాయ వస్తువులు, చేనేతకార్లు, వివాహాలు, కుమ్మరి, చాకలి, వస్త్రకార్లు, మద్యవస్తువులు మొ॥ వాటిపై సుంకాలు విధించడం ద్వారా అదనపు ఆదాయం సమకూర్చుకునేవారు.

రాజ్యానికి ఆదాయం అంతా దాదాపుగా గ్రామాల నుంచే వచ్చేది. వర్తకులు, నగర సంస్థల నించి ఆదాయం అంతగా రాబట్టలేదు.

గ్రామాల్లో లభించిన 'వీరగల్' ల ద్వారా గ్రామ ప్రజల పరిరక్షణా బాధ్యత కూడా గ్రామాలే చూసుకునేవని తెలుస్తుంది. ఇది వికేంద్రీకృత పాలన కు సాక్ష్యం చెబుతుంది.

సైనిక పాలన:

రాజు కు కాల్బలం, అశ్వదళం, గజబలం తో కూడిన స్థిరసైన్యం ఉండేది. పల్లవులు నాగపట్టినం/ నాగపట్టణం లో ఓడరేవుని నిర్మించి నౌకాదళాన్ని అభివృద్ధి చేసారు.

ఏదేమయినా పాలనాపరంగా పల్లవుల ఘనత గ్రామ స్వాతంత్ర్యత కు వారందించిన చేయూతలోనే ఉంది.

# పల్లవుల సాంఘిక, ఆర్థిక పరిస్థితులు

పల్లవుల కాలంలో దక్షిణ భారతంలో బ్రాహ్మణీకరణ దాదాపు పరిపక్వస్థాయికి చేరింది. వారందరూ ధర్మ రక్షకులుగా పల్లవ రాజులు ముఖ్యంగా ఆలయాల్లో వైదిక యాగాలు చేయడం, బ్రాహ్మణులకు దానాలు చేయడం చేశారు. భూదానాలు పొందిన బ్రాహ్మణులు సాధారణంగా శిస్తు చెల్లించాల్సిన అవసరం లేదు. సమాజంలో వీరిది అగ్రస్థానం. నిగమం ఉన్న ఈ కాలంలో బ్రాహ్మణులు వ్యాపారాల్లో పెట్టుబడులు పెట్టి ఆగ్నేయాసియా దేశాలకు వెళ్ళి వచ్చేవారు. అనేకమంది బ్రాహ్మణులు పౌరోహిత్యం పనులు వదిలి ప్రభుత్వోద్యోగాలు చేపట్టారు. 'బ్రహ్మక్షత్రియ' పదం ద్వారా బ్రాహ్మణులు అనేక కులాలుగా ఉన్నారని తెలుస్తుంది. పాలక వర్గం వారు ఇక్కలో సంబంధం లేకుండా బ్రాహ్మణులని ఆదరించి క్షత్రియ హోదా పొందేవారు. వైశ్యవర్గం అంటూ ప్రత్యేకంగా లేకపోయినా వర్తకులు తమను వైశ్యులుగా చెప్పుకున్నారు. వ్యవసాయం ఇతర వృత్తిపనులు చేసేవారు శూద్రులుగా కింది స్థాయిలో ఉంచబడ్డారు. పల్లవ సమాజంలో అంటరానివారు కూడా ఉండేవారు. సమకాలీన సాహిత్యం పులయాలు, చండాలురుగా పేర్కొంది. వీరి నించి కూడా భక్తి ఉద్యమ సాధువులు రావడం విశేషం.

ఆహారం, వివాహ విషయాల్లో కులాల ప్రత్యేకీకరణ సమాజంలో ప్రబలంగా ఉండేది. అయినా అందరికీ ఉపయుక్తమైన నీటిపారుదల వనరులు, గ్రామపాలన విషయాల్లో కులాలతో సంబంధం లేకుండా ప్రజలందరూ సహకరించుకునేవారు. సామాజిక సామరస్యం మరియు

సంప్రదాయం కొనసాగేవి. అంటే వివిధ సాంఘిక వర్గాల మధ్య వివాహాలు లేవని కాదు, అయితే అవి ప్రధానంగా పరిగణించలేదు.

సాధారణంగా వర్ణవ్యవస్థ ననుసరించే సాంఘికహోదా ఉండేది. అయితే ఎవరైనా వ్యక్తి గ్రామం కోసం ప్రాణత్యాగం చేస్తే అతని వారసులకు సాంఘికంగా ఉన్నత హోదా పొందడం వంటివి కూడా జరిగేవి.

పల్లవులు వ్యవసాయవిస్తరణ కోసం బ్రాహ్మణులకు విరివిగా భూదానాలు చేశారు. వీరు ఈ ప్రాంతాలలోని ట్రైబల్స్ కి బ్రాహ్మణ హోదానిచ్చి, అలాగే సాధారణ ప్రజలని శూద్రులుగా మార్చి ఈ వ్యవస్థలో వర్ణవ్యవస్థ పరిధి లోకి తెచ్చేవారు.

భూదానాలు పొందిన ఆలయాలు సమాజంలో ముఖ్యపాత్ర పోషించేవి. మత, సాంస్కృతిక వ్యవహారాలే గాక ఆర్థిక కార్యకలాపాలు కూడా ఇవి నిర్వర్తించేవి.

ఉన్నతవర్గాల స్త్రీలు సమాజంలో గౌరవప్రద హోదా కలిగి ఉండేవారు. వారికి ఆస్తిహక్కు కూడా ఉన్నట్లు తెలుస్తుంది. వారిలో కొందరు మంచి విద్యావంతులు, లలిత కళల్లో నిష్ణాతులు. కింది తరగతుల స్త్రీలు నేత నేయడం, బుట్టలల్లడం వంటి పనుల ద్వారా కుటుంబ నిర్వహణలో పాలుపంచుకునేవారు. నాట్యకత్తెలు గౌరవస్థానంలో సమాజంలో మంచి ప్రభావం

స్త్రీలు

కలిగి ఉండేవారు. 'వీరగల్' శాసనాల ద్వారా 'సతి' ఆచారం పరిచయమవున్నదని దాన్ని గౌరవించేవారని తెలుస్తుంది. దేవాలయాల్లో నృత్యసంగీతాలకు దేవదాసీలను నియమించే ఆచారం ఉండేది.

సామాన్య ప్రజలు పట్టు వస్త్రాలు, ధనికులు పొడవైన వస్త్రాల్ని ధరించేవారు. రాజకుటుంబీకులు సహజంగానే విలువైన వస్త్రాలు ధరించేవారు. ప్రజలు ముఖ్యంగా రాజకుటుంబీకులు ఆభరణాలు ధరించేవారు - బంగారు, వెండి, విలువైన రాళ్లు, ముత్యాల తో చేసినవి. పాదరక్షలు, గొడుగు వాడేవారు. రాజకుటుంబీకులు తమ శిరస్సులను కిరీటాలతో అలంకరించేవారు.

వండిన అన్నం ప్రధాన ఆహారం. పాలు, చక్కెర, మాంసం తినేవారు. సాధారణ ప్రజలు విలాస ఆహారమైన బియ్యం బదులు రాగి, చాలం మొ॥ తినేవారు. తాంబూల సేవనం సర్వ సామాన్యం. మద్యపానీయాల్ని సామాన్యులు, ధనికులు ఇద్దరూ సేవించేవారు.

పురుషులు వేట, పశు- గుర్రాల స్వారీ, ఈత, కత్తియుద్ధం, కుస్తీపట్లు మొ॥ వాటితో వినోదించేవారు. స్త్రీలు ఆట, నృత్యం, పాటలు మొ॥ వాటితో ఆనందించేవారు.

పల్లవులకు కాంబోజ, ఘనాక్, చంపా, అరేబియా మొ॥ ఆగ్నేయాసియా దేశాలతో వర్తక సంబంధాలుండేవి. శ్రీలంక వీరి మిత్రదేశం.

పల్లవ ఆర్థిక వ్యవస్థలో వ్యవసాయం ముఖ్యపాత్ర వహించింది. ప్రజలు భూస్వాములు భూమాయం మాదిరి

ఆధారపడి జీవించేవారు. పల్లవుల కాలంలో వ్యవసాయం పై శ్రద్ధ చూపి నాగళ్లను ఉంచటం మొ॥ చేసేవారు. నీటిపారుదలకు వసతులు కల్పించేవారు. మహేంద్రవర్మ I మహేంద్రతటాకం తవ్వించాడు. హ్యూయాన్‌త్సాంగ్ కూడా ఇక్కడి భూములు సారవంతమైనవి, వివిధ రకాల ధాన్యం, పండ్లు, కూరగాయలు పండుతున్నట్లు తెల్పాడు.

పల్లవుల కాలంలో 18 రకాల పన్నులుండేవి. 'అష్టాదశ పరిహార' అనే శాసనాల్లోని పదం ద్వారా ఆనాటి ప్రభుత్వం 18 రకాల పన్నులు విధించి, వసూలు చేసినట్లు తెలుస్తుంది.

పల్లవ శాసనాల ద్వారా 'నానాదేశి', 'మణిగ్రామం' అనే వర్తక సంఘాల పేర్లు తెలుస్తాయి. ప్రధానంగా చైనా, ఆగ్నేయ ఆసియా దేశాలతో వర్తక వాణిజ్యం 'మామల్లపురం', 'నాగపట్నం' రేవుల ద్వారా జరిగేది. నరసింహవర్మ చైనాకు దౌత్యవర్గాలను పంపి వర్తకాభివృద్ధికి కృషి చేశాడు.

ఆలయాలు, విహారాలు, ఘటికలు మొ॥ వి ముఖ్య విద్యాకేంద్రాలు. గ్రామాలు నిగమాలు చేసుకొనేవారు.

బట్టలు, దానికి సంబంధించిన పరిశ్రమలు, లోహ పరిశ్రమ, రంగులు, వడ్రంగి, కమ్మరి వృత్తులు మొ॥ వృద్ధి చెందాయి.

Examples for Chalukyas :

* చాళుక్య విజయాదిత్యుని భార్య వినపోటిగళ్ళ మహాకూటం వద్ద హిరణ్యగర్భ ఉత్సవం చేసింది, దేవతకు పగడాలు పొదిగిన పీఠాన్ని, వెండి గొడుగును బహూకరించింది.

Q. Make a comparative study of the administrative system and development of art under the Pallavas of Kanchi and Chalukyas of Badami. (1990)

Ans: క్రీ.శ. 6 వ శతాబ్ద మధ్యకాలం నుండి దాదాపు 3 శతాబ్దాల పాటు దక్షిణ భారతం లో రాజకీయ, ఆర్థిక, సాంఘిక, సాంస్కృతిక పరంగా ప్రధానశక్తులుగా నిల్చినవారు కంచి పల్లవులు, బాదామి చాళుక్యులు.

పల్లవులది, చాళుక్యులది రాచరికపు ప్రభుత్వ పద్ధతి. సింహాసనానికి వారసత్వంగా పెద్దకొడుకు సాధారణం గా వారసుడయ్యేవాడు. రాకుమారులను సమకాలం లో ఉత్కృష్ట ప్రమాణాలలో సాహిత్యం, న్యాయం, తత్వం, యుద్ధవిద్యలు మరియు పాలన లో శిక్షణ నిప్పించేవారు. వారి సామర్థ్యానికి, అభిరుచికి తగిన పాలనా హోదాల్లో శిక్షణనందించేవారు. రెండవ పులకేశి కి సంరక్షకుడిగా ఉన్న మంగళేశుడు అతని రాకుమార హక్కులనుంచి తప్పిద్దామని ప్రయత్నించాడు. కాని రాజు పెద్దకొడుకైన పులకేశి II కే ప్రజామద్దతు బలంగా ఉండడం తో అతని ఎత్తులు పారలేదు. పల్లవుల లో వారసుడు లేకపోవటం తో మంత్రిమండలి పురోహితులతో చర్చించి రాజవంశం లో ఒకరిని రాజుగా ఎంపిక చేసింది. ప్రధాన రాజవంశం లో వారసత్వం

విఫలమైనప్పుడు మాత్రమే నందివర్మ II ను రాజుగా ఎంపిక చేసినారు.

రాజు శాసన, కార్యనిర్వాహక, న్యాయాధికారాలు సిద్ధాంతరీత్యా సర్వాధికుడు. సైనిక బలగాలకు అతడే సర్వసైన్యాధిపతి. ఇది రెండు రాజ్యాలకీ వర్తిస్తుంది.

తొలి పల్లవ రాజులు తమను 'ధర్మమహా రాజాధిరాజ' వంటి ఆర్భాట బిరుదులతో చెప్పుకున్నారు. తొలి పల్లవ, చాళుక్య రాజులిరువురూ అశ్వమేధయాగాది వైదిక క్రతువులు నిర్వహించి తమ సార్వభౌమత్వాన్ని చాటుకున్నారు. తర్వాతి కాలంలో ఇరువంశాల వారూ 'పరమేశ్వర' వంటి బిరుదులు పెట్టుకున్నారు. ఇరువంశాల రాజులూ వారికిష్టమైన మతాన్ని అవలంబించేవారే గాని వాటిని తమ ప్రజలందరిపై రుద్దాలని ప్రయత్నించలేదు. ఒక రాజకీయ విధానంగా వారు అన్ని మతాలనూ ఆదరించారు.

రెండు రాజ్యాలూ వారి సొంత 'ధ్వజ' 'లాంఛనాలు' కలిగి ఉన్నాయి. పల్లవులది వృషభలాంఛనం మరియు ఖట్వాంగ ధ్వజము. చాళుక్యులది వరాహ లాంఛనం. రాజభవనాన్ని వైభవంగా ఉంచేవారు. ఇరు రాజ్యాల్లోనూ రాణులు రాజులతో సమ ప్రాధాన్యత కలిగి ఉండేవారు. రంగపతాక, పల్లవ రాజసింహుని భార్య కైలాసనాథ దేవాలయ నిర్మాణంలో స్వీయ ఆసక్తి చూపేది.

సిద్ధాంతరీత్యా రాజు నిరంకుశాధికారాలు

గలవాడు. కాని, ఆచారాలు ఇట్టి మార్పులనే కోరాలు మార్చేసేవి. రాజకుటుంబం లో సభ్యులు పాలన లో కీలక ముఖ్య బాధ్యతలు నిర్వహించేవారు. ఇది శాసనాల్లో వర్ణిస్తుంది.

రాజు విస్తృత అధికార యంత్రాంగం సాయం తో పాలించేవాడు. 'శాసన సంకారిక' అనే అధికారులు రాజాజ్ఞలను అమలు పరిచేవారు. 'కోశాధ్యక్ష' 'నిలక్షలత్వార' 'అధికారి' మొ॥ ప్రభుత్వాధికారులు ఉన్నారు. రాజు యొక్క మౌఖిక ఆజ్ఞలు వినేవారు 'వాయిలకేత్సర'లు. వీరు వాటికి లిఖిత రూపమిచ్చి సంబంధిత అధికారులకి అందించేవారు. వాటిప్రతులు ఈ ఆజ్ఞలను 'రాజ్ఞాపత్ర విలతం' అనేవారు. క్రమబద్ధమైన మంత్రిమండలి ఏదీ ఏర్పాటు చేయబడ్డట్లు గాని పనిచేసినట్లు కన్పించదు. అయితే పల్లవుల వాఙ్మయం లో మాత్రం 'మంత్రి మండల' ఉన్నట్లు తెలుస్తుంది. రెండవ నందివర్మ పట్టాభిషేకానికి ముందు చర్చలు ఈ మంత్రిమండలే చేపట్టింది.

ప్రాంతీయ పాలన ను సామంతులు రాజకుమారులు చేపట్టేవారు. రాజకుటుంబంలో విశ్వాసం ఉంటే ఇది మంచి లాభదాయకం అవుతుంది. కాని విరోధాలు తలెత్తినప్పుడు ఇది సులభంగా అంతర్గత విభేదాలు

యుద్ధానికి రాజకీయ సంక్షోభానికి దారితీస్తుంది. ఉదాహరణకు
చాళుక్యుల రాజ్యం లో రెండవ పులకేశి మరణానంతరం
విక్రమాదిత్య I రాజ్యేశ్వరుడుగా ప్రకటించాడు.
చాళుక్యుల భూదానాల్లో 'విషయపతి' పేరు
కన్పిస్తుంది. పల్లవుల భూదానాల్లో 'రాష్ట్రికులు'
పేరు కన్పిస్తుంది. పల్లవుల రాజ్యంలో పెద్ద పాలనా విభాగం
'వలనాడు' లేదా 'మండలం'. ఈ విభజనలో పెద్దల
సభ ఉంది, దాని ప్రముఖుల్ని 'దేశభోజక',
'నట్టుక్కోన్' గా పిలిచేవారు.

గ్రామాలు సాధారణంగా పల్లవుల రాజ్యంలో
స్వతంత్రమైనవి (autonomous). గ్రామసభలు వివాదాల
పరిష్కారానికి, సాధారణ ఆసక్తుల్ని చర్చించేందుకు సమావేశ
మయ్యేవారు. 8, 9 శతాబ్దాలకు చెందిన తమిళ శాసనాల్లో
ఉర్, సభ, నగరం అనే 3 రకాల గ్రామసభలు కన్పిస్తాయి.
'ఉర్' గ్రామంలో భూమిగల వారందరికి ప్రాతినిధ్యం వహిస్తుంది. 'సభ'
లో బ్రాహ్మణ భూయజమానులు మాత్రమే ఉండేవారు. 'నగరం'
వ్యాపారులకు ఆధిక్యత గల ప్రాంతాలకు ప్రాతినిధ్యం వహిస్తుంది. అనేక
సందర్భాల్లో ఈ గ్రామసభలు పక్కపక్కనే ఉండేవి. గ్రామసభ నీటిపారుదల,
చెరువులు, రోడ్లు, దేవాలయాలు మొ॥ నిర్వహించేది. ఇది
సాధారణంగా ఉపసంఘాల ద్వారా పని చేసేది. చాళుక్యుల
రాజ్యం లో "గవుండ" (గ్రామపెద్ద / పెద్ద) నాయకత్వాన
పనిచేసే గ్రామస్థానిక పాలనకు 'మహాజన' పర్యవేక్షకులుగా

ప్రభుత్వాల ఆదరణ ఉండేవాడు. తమిళ దేశం లో సామూహికం గా అనుబంధంగా అధిక స్వాతంత్ర్యం గల గ్రామసభలుండె పాలించె. చాళుక్యుల రాజ్యం లో రాజాధికారులు గ్రామసభల పనుల్లో దగ్గరి సంబంధాలు కలిగి ఉండేవారు. క్రీ.శ. 725 కి చెందిన, బాదామి చాళుక్య, రాజమారుడు విక్రమాదిత్యుని శాసనం ద్వారా రాజ్యాంగం మహాజన మరియు నగరులకు అనుకూలంగా ఇవ్వబడినట్లు తెలుస్తుంది.

కళలు:

రాతి-వాస్తుకళ పల్లవ, చాళుక్యులు ఇద్దరు పాలకుల రాజ్యాల్లో కన్పిస్తుంది. క్రీ.శ. 450 నుండి 650 వరకు ఎల్లోరా లో బౌద్ధులు రాతి-వాస్తుకళ సృష్టించారు, పర్వతాలు రాతి లో తొలిచిన గుహలు మలిచారు. వీటిలో చైత్యాలయాలు, విహారాలు కలసి ఉన్నాయి. ఈ విహారాల్లోని బుద్ధ స్త్రీ, పురుష దేవతా చిత్రాలు వాటి భారీ పరిమాణం, ఉట్టిపడే సజీవత్వం, వాటి దుస్తులు, అలంకరణలకు ప్రసిద్ధి చెందాయి. బాదామి లో నాలుగు రాతి గుహాలయాలకు స్తంభాలున్నాయి. ప్రతి దానికి స్తంభాల వరండా, స్తంభాల హాలు, చతురస్ర గర్భగృహం రాతి లో లోతుగా తొలచబడి ఉన్నాయి. వాటిలో ఆకర్షణీయ అంశం గోడల మీద చెక్కిన గణాల విచిత్ర భంగిమలు.

పల్లవులు రాతి-వాస్తుకళ ను తమిళ దేశం లో మహేంద్రవర్మ I కాలంలో మొదలుపెట్టారు. ఇతని గుహాలయాలు మండగపట్టు, పల్లవరం, మామండూర్,

సింహమంగళం, తిరుచిరాపల్లి, మహేంద్రవాడి లలో ఉన్నాయి. శివ, విష్ణు గుహాలయాలు రెండూ పల్లవ మహేంద్రవర్మ చే తొలిపించాడు. మామల్లపురం లో పల్లవులకు చెందిన అనేక గుహాలయాలున్నాయి. కొన్నిట్లో చాళుక్యుల వానివలె వెనుక గోడలో గర్భగృహాలు తొలచబడ్డాయి. కొన్ని గుహాల్లో చాళుక్యుల వలెనే వీరూ శిల్పాలు చెక్కారు. కొన్ని గుహాలకు ముందు స్తంభాల మండపాలున్నాయి. మామల్లపురం లో పది ఏకశిలా రథాలున్నాయి. వీటిలో పంచపాండవ రథాలు ప్రసిద్ధం. ఐదు రథాలు చిన్న ప్రమాణంలో, ఎత్తుబడి కలిగఉన్నాయి.

చాళుక్యులు, పల్లవులు నిర్మిత దేవా నిర్మాణ ఆలయాలని కట్టడం లో ఎంతో సేవ చేశారు. చాళుక్యుల ఐహోలు 'ఆలయాల నగరం' గా పేరుబడింది. లడ్ ఖాన్ ఆలయం ఒక సమావేశసభ ను ఆలయం గా మార్చినట్లుంటుంది. చదునైన, ఎత్తుతక్కువ పైకప్పు దీనికుంది. దాని గర్భగృహం చిన్న చతురస్రం. దుర్గాలయం బౌద్ధుల చైత్యాన్ని బ్రాహ్మణ దేవాలయ వాస్తు లోకి తెచ్చే ప్రయత్నం గా కన్పిస్తుంది. ఇది అర్ధవృత్తాకార (apsidal) నిర్మాణం. చదునైన పైకప్పు, గర్భగృహం మీద ఉత్తరాది లా పైకి లేచే శిఖరం దీనికి ఉన్నాయి. పెద్ద చతురస్ర స్తంభాల పై నిలుపబడ్డ వాలు స్లాబుల లో వరండా పైకప్పు ఉంటుంది, ఇది ప్రదక్షిణ మార్గం ఏర్పడుతుంది. పాపనాథగుడి లో గర్భగృహాన్ని, ప్రధాన మండపాన్ని కలిపే 'అంతరాల' కొత్త లక్షణం గా కన్పిస్తుంది.

చాళుక్యుల కాలం లో ఆర్కిటెక్చర్ గా "పట్టదకల్"
దేవాలయాలు నిలుస్తాయి. పాపనాథ దేవాలయం ఉత్తరాది
శైలి లో కట్టారు. సంగమేశ్వర, విరూపాక్ష ఆలయాలు
దక్షిణాది శైలి లో కట్టారు. విరూపాక్ష ఆలయం బహుశా
కంచి నుంచి రప్పించిన పనివారి చేతనే నిర్మించారని
తెలుస్తున్నారు. ఇది కంచి లోని కైలాసనాథ ఆలయానికి
ప్రతిరూప అనుకరణ. ఆలయగోడలు శిల్పాలతో అలంకరించారు.

పల్లవులు కూడా అనేక నిర్మాణ ఆలయాలు
కట్టించారు. "అవన్నీ" కూడా దక్షిణాది శైలి లోనే ఉన్నాయి.
ఈ ఆలయాలు మామల్లపురం, కూరమ్మ, కాంచీపురం లలో
ఉన్నాయి. వీనిలో అతిపురాతనమైనది తీరదేవాలయం. ఆలయానికి
సాధారణంగా ఉండే సాలభంజిక దీని వెనుక భాగం లో ఉండటానికి
కారణం గర్భగృహం నలు ప్రముఖంగా నీరు లోపున ఉండడమే.
ఆలయానికి రెండు విమానాలున్నాయి. పల్లవుల శైలి లోని
ముఖ్యాంశాలన్నీ కైలాసనాథ దేవాలయం లో ప్రత్యక్షంగా
కనిపించాయి — గర్భగృహం, మండపం యొక్క sturdy
స్తంభాలు, సింహ చిహ్న స్తంభాలు పదే పదే రావడం.
విమానం మంచి పొందిక కలిగింది. పల్లవుల వాస్తు కు
మరింత పరిణతి చెందిన ఉదాహరణ గా కంచి లోని
వైకుంఠ పెరుమాళ్ ఆలయాన్ని చెప్పవచ్చు. దీని ముఖ్య
భాగాలు — ప్రదక్షిణా మార్గం, మండపం, గర్భగృహం

— ఇకపై ప్రత్యేక కట్టడములు కాక, అవన్నీ అవన్నీ పొందిగ్గా [illegible]బడిన కొండే నిర్మాణం గా మలచబడ్డాయి.

అజంతా లోని బౌద్ధ గుహలు వాటి చిత్రాలకు ప్రపంచ ప్రసిద్ధి గాంచాయి. పల్లవులు కూడా సిత్తన్నవాసల్ జైన గుహాలయం లోని కుడ్యచిత్రాలకు పేరు పొందారు. పల్లవులు సంగీత-నాట్యాలను వృద్ధి చేశారు. సిత్తన్నవాసల్ చిత్రాలు వాటి ఆధారంగా నాట్యప్రక్రియలని, కుడిమియామలై శాసనం సంగీతాభివృద్ధి ని తెలియచేస్తున్నాయి.

పల్లవులు, చాళుక్యులు ఇద్దరూ రాజులు, నిరంకుశ, సాంప్రదాయిక ధర్మమైన పాలకులు కలిగి ఉన్నా తమ తమ స్వాతంత్ర్యాలను కళా రంగాల్లో ప్రతిబింబించటం విశేషం.

# వాకాటకులు

దక్కను, మధ్య భారత ప్రాంతాల్లో శాతవాహనుల పతనం తరువాత బాదామీ చాళుక్యుల ఆవిర్భావానికి ముందు రాజ్యమేలిన ప్రధాన రాజవంశం వాకాటకులు. సమకాలీనులైన గుప్తుల ప్రాభవం వల్ల కొంత మరుగున పడ్డా రాజకీయంగా సాంస్కృతికంగా వాకాటకుల పాత్ర గణనీయమైంది.

## వాకాటకులు ఎవరు?

చరిత్రకారుల్లో వాకాటకులు ఎవరన్నదానిపై భిన్నాభిప్రాయాలున్నాయి.

1) డా॥ జయస్వాల్ ప్రకారం వీరు 'వాకాట' ప్రాంతం వారు, ఇది బుందేల్‌ఖండ్ లోని బిజ్నా- బగత్ గా ఆయన గుర్తించారు. పురాణాల్లో వింధ్యశక్తి 'కిలకిలాల'తో చేరి ఉన్నాడు, మూల్పోలా ఉన్న విదేశలుని 'నాగుల' తో కూడా సంబంధాలున్నట్లు పురాణాలు చెబుతున్నాయని తన వాదనను సమర్థిస్తున్నారు.
(కిలకిలాలు — విదేశీ తెగ బహుశా యవనులు)

2) కాని ఈ వాదనని అనేకమంది చరిత్రకారులు అంగీకరించక వాకాటకులు తూర్పు దక్కనుకు చెందిన వారై ఉండవచ్చని అన్నారు. దక్షిణ భారత రాజ్యాలలో వీరి శాసనాలు ఎక్కువగా ఉన్నాయి.

- శాతవాహనులు, ఇక్ష్వాకుల్లాగా వాకాటకులకు ఘనమైన తల్లితో కలిపిన పేర్లున్నాయి; వారు తమను 'హారితీపుత్రులు'గా కదంబులు మరియు చాళుక్యుల మాదిరిగా వర్ణించుకున్నారు.

- వాకాటకుల సంస్కృత, ప్రాకృత శాసనాలు పల్లవుల శాసనాలను పోలి ఉన్నాయి.
- అమరావతి లో దొరికిన క్రీ.శ. 3 వ శతాబ్దం నాటి ఒక శాసనంలో 'వాకాటక' పేరు ప్రస్తావించబడింది.
- వింధ్యశక్తి తో సంబంధాలున్న నాగులు విదిశ వారుగాక బనవాసి వారైయుండవచ్చు.

అందువల్ల ఈ వర్గం వారు వాకాటకుల ప్రాంతం తూర్పు దక్కను లోనిది గా తలచారు.

3) మరికొందరు చరిత్రకారులు వాకాటకులు 'విష్ణువృద్ధ గోత్రికులు' పైగా బాసిం శాసనంలోని వాకాటకరాజు పేరు 'బ్రాహ్మణ శాతవాహనరాజు గౌతమీపుత్ర' పేరే కావటం వల్ల వాకాటకులు బ్రాహ్మణులని వారు మాళ్వ నుంచి వచ్చారని తలచారు.

అయితే ఆర్.సి. మజుందార్ ప్రకారం వాకాటకుల వాస్తవ జన్మస్థలం మధ్యప్రదేశ్ లోనే అనగా వారి శాసనాలు అత్యధికంగా దొరికిన ప్రాంతం లోనే ఉండి ఉంటుందని చెప్పారు. ఇప్పుడు అనేకమంది దీనే హేతుబద్ధం గా తలుస్తున్నారు.

<u>వాకాటకుల కాలం</u>

వీరు తమ రాజపత్రాల్లో నాణేల వివరాల్లో తమ పాలనా సంవత్సరాల్లో తెల్పటం చే కాలనిర్ణయానికి

కొంతగా ఉపయోగపడవు. అయితే ఇతర ఆధారాల ద్వారా వీరి కాలాన్ని కూడా వేయవచ్చు. వింధ్యశక్తి కొడుకు ఒకటవ ప్రవరసేన మధ్యభారతం జయించిన వైనంగా పురాణాలు చెబుతున్నాయి, దీన్ని గుప్తుల రాకపూర్వానికి ఉండు చెప్పాలి అంటే క్రీ.శ. 320. అందువల్ల వింధ్యశక్తి క్రీ.శ. 3వ శతాబ్ది చివరి భాగం లోని (క్రీ.శ. 270 - 300) వాడై ఉంటాడు. ఇతని మనుమడు పృథ్వీసేన చంద్రగుప్త II కు (క్రీ.శ. 380-415) సమకాలికుడై యుండటం దీన్ని ధృవపరుస్తుంది. అజంతా శాసనాలను తీసుకొని వింధ్యశక్తి ని క్రీ.శ. 3వ శతాబ్దం చివరలో ఉంచారు. ఇటీవల వాకాటకుల ప్రస్తావన విష్ణుకుండినుల శాసనాల్లో ఉంది, దాన్ని బట్టి మాధవవర్మ II (385 - 425 A.D.) వాకాటక రాకుమార్తెను పెళ్ళాడాడు. అందువల్ల వాకాటకులు క్రీ.శ. 3వ శతాబ్ది last quarter భాగం లో చివరి/నాలుగో పాదం లో తలెత్తి దాదాపు క్రీ.శ. 6వ శతాబ్ది మధ్యభాగం వరకూ పాలించి ఉంటారని చెప్పవచ్చు.

## రాజకీయ చరిత్ర:

**వింధ్యశక్తి:** ఇతడు వాకాటకుల మూలపురుషుడు. వరాహదేవుని శిలాశాసనం ఇతని విక్రమ పరాక్రమాల్ని, యుద్ధ విజయాల్ని పొగిడింది. 'పురిక' రాజధానిగా బేరారు ను అధికారం పొంది మెల్లగా మాళ్వా వరకూ రాజ్యాన్ని విస్తరించాడు. వైదిక యజ్ఞాలను శాతవాహనుల తర్వాత పునరుద్ధరించాడు.

**ప్రవరసేనుడు:** వింధ్యశక్తి కుమారుడు. వాకాటక రాజ్య నిజస్థాపకుడు ఇతడేనంటారు.

మధ్యభారతాన్ని పాలిస్తున్న భారశివ రాజు భవనాగుని కుమార్తెను తన కొడుకు గౌతమీపుత్రునికి ఇచ్చి వివాహం చేశాడు.
ఈ వైవాహిక సంబంధం వల్ల వాకాటక రాజ్యం బాగా విస్తరించింది. యుద్ధాలు, వివాహబంధాల ద్వారా రాజ్యాన్ని ఉత్తరాన బుందేల్‌ఖండ్ నుండి దక్షిణాన హైదరాబాదు వరకు విస్తరింపజేశాడు. 'సామ్రాట్' బిరుదు ధరించిన ఏకైక వాకాటక రాజు ఇతడే. తన విజయపరంపరకు గుర్తుగా నాలుగు అశ్వమేధ, ఒక వాజపేయ యాగాన్ని చేశాడని తెలుస్తుంది. పురాణాలు ఇతడు 60 వర్షాలు సుదీర్ఘకాలం పాలించాడని చెబుతాయి.

బుందేల్‌ఖండ్
↕
హైదరాబాదు

ఇతని మరణానంతరం నలుగురు కొడుకులు క్రీ.శ. 340 ప్రాంతంలో రాజ్యాన్ని నాలుగు భాగాలుగా పంచుకొని పాలించారని అర్థమౌతుంది. వీటిలో నందివర్ధన, వత్సగుల్మ శాఖలకు మాత్రమే చారిత్రక ఆధారాలు లభ్యమౌతున్నాయి.

నందివర్ధన శాఖ :

రుద్రసేన I : ఇతడు నందివర్ధన శాఖ స్థాపకుడు. ప్రవరసేనుని అనంతరం 'పురిక' లో అతని మనుమడైన రుద్రసేన I రాజయ్యాడు. ఇతని రాజ్యవిస్తీర్ణం గురించి ఆధారాలు లభ్యం కాలేదు.

రాజ్యవిభజన తర్వాత బలహీనమైన రాజ్యాన్ని మాతామహుడు భవనాగ సాయంతో తిరిగి రాజ్యాన్ని బలోపేతం చేశాడు. + సముద్రగుప్తుడు తన

త్రైకూటకులతో వాకాటకులతో యుద్ధం చేయవలసిరావడం ఆసక్తిదాయకం. బహుశా ఇతను శత్రువుల్ని గెలవటంలో వీరు సాయపడగలరని వదిలి ఉండవచ్చు.

<u>పృథ్వీషేణ I</u> :

తండ్రి తర్వాత రాజై వివేకంగా గుప్తుల సామ్రాజ్య వాదం లో చిక్కుకోక తన రాజ్యాన్ని స్థిరపర్చుకున్నాడు. [illegible] ఉదాత్తుడు, ఉత్తముడైన ఇతడు ప్రజలను కాచి, సుఖ సంతోషాల్ని అందించినట్లు తెలుస్తుంది. ఇతని పాలన చివరలో చంద్రగుప్త II ఇతని సాయంతో మాళ్వా శక క్షత్రపుల్ని ఓడించాడు. ఈ రాజకీయ బంధాన్ని రాజకుమారుడు రుద్రసేన II కు తన కూతురు ప్రభావతి గుప్త ను ఇచ్చి వివాహం చేయటం ద్వారా బలపరిచాడు. రాజకీయంగా ఈ వివాహం చాలా ప్రాధాన్యత కలిగినది. పృథ్వీషేణ తన పూర్వీకుల వలె శైవుడు. ఇతడు రాజధాని 'పురిక' నుండి 'నందివర్ధనం' (ఆధునిక నగర్ధాన, నాగపూర్ దగ్గర) కు మార్చాడు.

<u>రుద్రసేన II</u> :

భార్య ప్రభావం చేత ఇతడు వైష్ణవుడిగా మారాడు. తండ్రి తర్వాత రాజై కేవలం ఐదు వర్షాలు పాలించి అకాల మరణం పొందాడు. ఇద్దరు మగపిల్లలు చిన్నవారు గాన ప్రభావతి వారి సంరక్షకురాలి గా రాజ్యమేలింది. కొందరు చరిత్రకారులు ప్రభావతిగుప్త అందించిన అండతోనే చంద్రగుప్త II

గుజరాత్, కథియవాడ్ ప్రాంతాలను స్వాధీనం చేసుకున్నాడని అంటారు. ఏదేమైనా క్రీ.శ. 395-410 ప్రాంతంలో ప్రభావతి పాలన చేసినంత కాలం గుప్తులతో దగ్గర సంబంధాలు (అనుసాగాయని చెప్పవచ్చు) పెరిగాయని చెప్పవచ్చు.

రుద్రసేన II మొదటికొడుకు చనిపోవడం తో చిన్నకొడుకు దామోదరసేన ప్రవరసేన పేరుతో రాజయ్యాడు.

**ప్రవరసేన II : (క్రీ.శ. 410-455)**

ఇతనికి చెందిన దాదాపు 12 రాగిశాసనాలు దొరికాయి. ఇతడు మొత్తం బేరారు (Berar) ను దక్షిణ ప్రాంతం తప్ప పాలించాడు. ఇతడు 'ప్రవరపుర' (ఆధునిక పౌనార, వార్ధా జిల్లా) ను నూతన రాజధానిగా చేశాడు. తన కుమారుడు నరేంద్రసేనుడికి కుంతల రాకుమారి, అజ్జితభట్టారిక, కదంబ రాజు కాకుత్సవర్మ కూతురు తో వివాహం జరిపించాడు.

**నరేంద్రసేన : (క్రీ.శ. 455-465)**

ఇతని సార్వభౌమత్వాన్ని కోసల, మేఖల, మాళ్వా రాజులు గౌరవించారని అధికారిక పత్రాలు తెల్పుతున్నాయి. క్రీ.శ. 5వ శతాబ్ది ద్వితీయార్థంలో గుప్తులు తమ దూర ప్రాంతాలపై పట్టుకోల్పోవడం వలన ఇది నిజమే అయివుండవచ్చు. ఇతని పాలనలో వాకాటక రాజ్యం పై నల రాజు, భవదత్తవర్మ దాడిచేసి

నందివర్ధన ను కొంతకాలం ఆక్రమించాడు. కాని నరేంద్రసేన వారిని అడ్డుకోవడమే గాక నలరాజ్యం లో కొంత భాగం కూడా ఆక్రమించాడు. అయితే నలరాజు అతని దండెత్తాడు.

**పృథ్వీసేన II :**

నరేంద్రుని తరువాత రాజైనాడు. ఇతడు నలరాజు భవదత్తవర్మ తో, వత్సగుల్మ హరిసేనుని తో, త్రైకూటక రాజు దహ్రసేనుని తో యుద్ధాలు చేసి రాజ్యాన్ని రక్షించుకున్నట్లు తెలుస్తుంది.

కాని వాకాటకుల ప్రధాన శాఖ కు ఇతడే చివరి పాలకుడు. ఇతని తర్వాత హరిసేనుడు ఉత్తర విదర్భ ను కలుపుకొని దాన్ని వత్సగుల్మ శాఖ లో కలిపేశాడు. (x)

**వత్సగుల్మ శాఖ :**

సర్వసేనుడు క్రీ.శ. 340 ప్రాంతంలో వత్సగుల్మ శాఖ ను స్థాపించాడు. ఇతని వారసుడు వింధ్యసేనుడు, నాలుగు దశాబ్దాల పాటు రాజ్యపాలన చేశాడు. ఇతని రాజ్యంలో బేరారు, దక్షిణప్రాంతం, హైదరాబాద్ ఉత్తర ప్రాంతం, ఇంకా పరిసర ప్రాంతాలు చేరి ఉన్నాయి. కుంతల కు చెందిన కాదంబ రాజు ను వింధ్యసేనుడు ఓడించినట్లు తెలుస్తున్నది. ఇతని తరువాత ప్రవరసేన II 15 ఏళ్లు పాలించాడు. తర్వాత రాజైన దేవసేనుడు విలాస ప్రియుడైనప్పటికీ సమర్థుడైన హస్తిభోజుడనే మంత్రి రాజ్యాన్ని కాపాడాడు. ఇతని తరువాత హరిసేనుడు వాకాటక నందివర్ధన శాఖ ను కలిపివేసుకొనడమే గాక కుంతల,

కళింగ, కొంకణ, ఆంధ్ర ప్రాంతాలను జయించాడు. వారణాసినుండి రాజ్యం ఉత్తరాన మాల్వ నుంచి దక్షిణాన మహారాష్ట్ర వరకూ తూర్పున బంగాళాఖాతం నుంచి పశ్చిమాన అరేబియా వరకూ విస్తరించింది.

అతని మరణానంతరం రాజ్య ప్రభావం క్షీణించింది. వాకాటకుల పతనానికి సుస్పష్టమైన కారణాలు కన్పించటం లేదు. మధ్యదేశ ప్రాంతాన్ని నలరాజులు, దక్షిణ మహారాష్ట్రను కదంబులు, ఉత్తర మహారాష్ట్రను కాలచూరి రాజులు స్వాధీనం చేసుకొని ఉండవచ్చు. బాదామి చాళుక్యులు వచ్చే నాటికి (క్రీ.శ. 550) వాకాటకులు పూర్తిగా అంతరించారు.
(※) 66

"దాదాపు రెండు శతాబ్దాలకు పైగా వైభవోపేతమైన వాకాటక వంశ ప్రధాన శాఖ ఈ విధంగా అంతరించింది. ఇది అనేకమంది నాయకులైన, మంచి పాలకులైన, మతం - విద్యలను ఉదారంగా ఆదరించిన ఘనమైన పాలకులను అందించింది."

— వి.వి. మిరాషి

## సాంస్కృతిక సేవ:

వాకాటకులు గుప్తుల యుగం యొక్క గొప్ప ప్రాముఖ్యత గల మత, సాంస్కృతిక కార్యకలాపాలకు పూనుకొన్నారు. తొలి వాకాటక రాజులు వైదిక యాగాలు చేసిరి (※) అనంతర రాజులు శైవ, వైష్ణవముల పైన భక్తి కలిగి ఉండేవారు

మెలాచ్య ఆదరించారు. అయితే జైన, బౌద్ధాలను పీడించలేదు. వీరి సామంతుల ఆదరణలో వీరి రాజ్యంలో జైన, బౌద్ధాలు కూడా వర్ధిల్లాయి. ఒకరిద్దరు రాజులు తప్ప వీరు ప్రధానంగా శివభక్తులు.

సంస్కృతం క్రమంగా రాజభాషగా ఎదిగింది. ~~ప్రాకృతస్థానాన్ని స్థానభ్రంశం చెందించింది.~~ కౌముదీమహోత్సవ, భావశతక కావ్యాలు ఈ యుగం లోనివే నంటారు.

వాకాటక రాజులు అనేక మంది కవి, పండితులను పోషించటమే గాక కొందరు స్వయంగా కవులు కూడా. రెండో ప్రవరసేనుడు మహారాష్ట్ర ప్రాకృత భాషలో 'సేతు బంధనం' రచించాడు. అనంతర కాలంలో వచ్చిన దండి, బాణ కవులు సైతం మెచ్చుకున్నారు. వత్సగుల్మ శాఖను ప్రారంభించిన సర్వసేనుడు 'హరివిజయం' అనే ప్రాకృత మహాకావ్యం రచించాడు.

నాచ్నా, కుఠారా, టిగావా లోని దేవాలయాలు వాకాటకులు నిర్మించినవేనని కొందరు చరిత్రకారులంటారు.

వాకాటకులు ప్రధానంగా చిత్రకళను ప్రోత్సహించారు. అజంతా లోని 13, 16 గుహలు వీరి మంత్రులైన హస్తిభోజ, వరహదేవ ల ఆదరణలో రూపొందినవే. 17, 19 గుహలు కూడా వీరి ఆదరణ ఫలితమేనంటారు. 'మూర్ఛ చెందిన రాకుమారి' అనే ప్రాచీన కుడ్యచిత్రం వాకాటకుల కాలంలో చిత్రకళ అద్భుత అత్యున్నతస్థాయి కి సంకేతం. 16 వ గుహలో 'ధర్మచక్రప్రవర్తన' రూపంలో ఉన్న పెద్ద బుద్ధుని విగ్రహం ఉంది.

ఈ విధంగా వాకాటకులు ఉత్తర భారతాన నాగులకు గుప్తులకు మధ్య ఖాళీని పూరించారు. సాంస్కృతికంగా బ్రాహ్మణిక భావాలు, (ప్రాంతీయతలు) సాంఘిక వ్యవస్థలు దక్షిణాదికి చేరడానికి వారధులుగా నిల్చారు.

(※) క్రీ.శ. 4 - 6 శతాబ్దాల మధ్య బ్రాహ్మణమతం పునరుజ్జీవనానికి వాకాటక రాజుల ప్రోత్సాహమే ప్రధాన కారణం. ఇద్దరు ముగ్గురు వైష్ణవ రాజులు తప్ప మిగిలిన వారంతా గొప్ప శైవ భక్తులు. అశ్వమేధయాగం వంటి ఎన్నో యాగాలు వీరు నిర్వహించారు. పండితులైన బ్రాహ్మణులకు అనేక భూదానాలు, గ్రామదానాలు చేసినట్లు ఆధారాలు లభ్యమయ్యాయి.



# సముద్రగుప్తుని దండయాత్రలు

"భారతదేశంలో జన్మించిన సమర్థులైన
సైనిక యోధులలో ప్రముఖుడు"

— వి.ఎ. స్మిత్

సుప్రసిద్ధ గుప్తవంశంలో మొదటి చంద్రగుప్తుని చే వారసునిగా ప్రకటించబడి క్రీ.శ. 325 ప్రాంతంలో సింహాసనానికి వచ్చినవాడు సముద్రగుప్తుడు. ఇతని ఆస్థానకవి హరిసేనుడు విరచించిన అలహాబాదు అశోక స్తంభం పై నున్న 'ప్రయాగప్రశస్తి' సముద్రగుప్తుని దిగ్విజయయాత్రల్ని వర్ణించింది.

కాలక్రమం:

కొందరు చరిత్రకారులు సముద్రగుప్తుడు ఆర్యావర్తనంలోని దండయాత్రలన్నీ ఒకేసారి చేశాడని తలచారు. కాని మరికొందరు ప్రయాగప్రశస్తి అతని దండయాత్రల్ని కాల క్రమంలో ఉదిస్తుందని, అందువల్ల ఉత్తర భారతంలో రెండుసార్లు దండయాత్రలు జరిపాడని అంటారు. 'ప్రశస్తి' మొదట ముగ్గురు ఆర్యావర్త రాజుల్ని పేర్కొని, తర్వాత అతని దక్షిణ దిగ్విజయాలు చెప్పి ఆ తర్వాత మళ్లీ తొమ్మిది మంది ఆర్యావర్త రాజుల్ని చెప్పింది.

అలహాబాదు ప్రశస్తి ప్రకారం సముద్రగుప్తుని దండయాత్రల్ని క్రింది విధంగా వివరించవచ్చు.

1) తొలి ఆర్యావర్త దండయాత్ర :

సముద్రగుప్తుడు 'కచ' తో వారసత్వయుద్ధం చేసి రాజైనట్లు [తెలుస్తుంది] కొందరు చరిత్రకారులు భావిస్తున్నారు. దీన్ని అదనుగా తీసుకుని కొందరు రాజులు వారి ప్రాబల్యాన్ని ఏర్పాటు యత్నించి ఉండవచ్చు. అంతట సముద్రగుప్తుడు వీరందర్నీ — అహిచ్ఛత్ర అచ్యుతుని, మధుర నాగసేనుని, పద్మావతి రాజు గణపతినాగుని సమూలంగా నాశనం చేశాడు. తూర్పు పంజాబు, ఢిల్లీ ప్రాంతం లోని కోట వంశ రాజును పట్టుకున్నాడు. తర్వాత 'పుష్ప' (బహుశా కన్యాకుబ్జ) నగరం లో సేద దీరాడు.

ఈ విధంగా ఉత్తర భారతం లో తన ప్రాబల్యాన్ని స్థిర పర్చుకుని దక్షిణయాత్ర చేసి ఉంటాడు.

2) దక్షిణ దిగ్విజయ యాత్రలు :

హరిసేనుడు దక్షిణాన సముద్రగుప్తుడే జయించిన రాజుల జాబితా ఇచ్చాడు. వీటి గుర్తింపులో చరిత్రకారుల్లో భిన్నాభిప్రాయాలున్నాయి.

| రాజు | ఆతని రాజ్యం | అధికారులు ఆమోదించిన ఆధునిక ప్రాంతం |
| --- | --- | --- |
| మహేంద్ర | కోసల | మధ్యప్రదేశ్ లోని తూర్పు, దక్షిణ ప్రాంతాలు |

| | | |
|---|---|---|
| వ్యాఘ్రరాజ | మహాకాంతార | గోండ్వానా Jeypore forest Orissa |
| మంటరాజ | కొరాల | ఉబుల్త, చంద జిల్లా |
| మహేంద్ర | పిష్టపుర | తూర్పుగోదావరి లోని పిష్టపురమ్/పిఠాపురం |
| స్వామిదత్త | కొట్టూర | కొట్టూర, వైజాగ్ జిల్లా కొండ పాదాల వద్ద |
| దమన | ఎరండపల్లి | శ్రీకాకుళం జిల్లా లోని ఆముదాల వలస (లేదా) విశాఖ జిల్లా లోని ఎరండపల్లి |
| విష్ణుగోప | కంచి | కంచి |
| నీలరాజ | అవముక్త | కంచి సమీపంలో చిత్తూరాంతం |
| హస్తివర్మ | వేంగి | తూర్పుగోదావరి జిల్లా |
| ఉగ్రసేన | పలక్క | పలక్కడ, నెల్లూరు జిల్లా |
| కుబేర | దేవరాష్ట్ర | విశాఖ జిల్లా ఎలమంచిలి ప్రాంతం. |
| ధనంజయ | కుశస్థలపుర | ఉత్తర ఆర్కాడు లోని కుట్టలూర ప్రాంతం. |

## సముద్రగుప్తుని దక్షిణ దండయాత్రా మార్గం :

ఫ్లీట్, స్మిత్ వంటి తొలినాటి చరిత్రకారులు ఎరండపల్లి ను ఖాందేష్ లోని ఎరండోల్ తోనూ, దేవరాష్ట్ర ను మహారాష్ట్ర తోనూ సమానంగా గుర్తించి

సముద్రగుప్తుడు కంచి నుండి పశ్చిమతీరం వెంబడి తిరుగు ప్రయాణం చేశాడన్నారు. కాని ఈ సూచనాధారం ను బట్టి పిష్టపుర దేవరాష్ట్ర రాజ్యం లో భాగమని తెలియడం చే దేవరాష్ట్ర విశాఖ ప్రాంతమనే రుజువౌతుంది. అదీగాక తిరుగు ప్రయాణం లో దాడి చేసినట్లయితే దక్షిణాగ్ర భాగం (కంచి) తర్వాత పేర్కొనబడి ఉండాల్సింది, కాని అలా లేదు. అందువల్ల వీరితో ఏకీభవించలేము.

కొందరు కొత్తూర ను కోయంబత్తూర లని కొత్తూర-పొల్లాచి గా పలక్క ను కేరళ పాలఘాట్ గా తెలిపి సముద్రగుప్తుడు కంచి దాటి జైత్రయాత్ర చేశాడన్నారు. ఇంకొందరు చరిత్రకారులు అసలు కంచి వరకే వెళ్ళలేదన్నారు. ఏదైనా ఈ దండయాత్ర మార్గం విషయం లో ఏకాభిప్రాయం కుదరలేదు.

3) మలి ఆర్యావర్త దండయాత్ర:

సముద్రగుప్తుడు దక్షిణయాత్రలో ఉండగా ఉత్తరాన కొందరు రాజులు గుప్తాధికారాన్ని ధిక్కారం చేసేందుకు సమాఖ్యగా ఏర్పడ్డారు. వీరిలో మతిల, నాగదత్త, చంద్రవర్మన్, గణపతినాగ, నాగసేన, అచ్యుతనంది, బలవర్మ మొ॥ వారు రుద్రదేవుని నాయకత్వాన (వాకాటక రుద్రసేనునిగా తెలుస్తున్నారు.) ఏర్పడ్డారు. సముద్రగుప్తుడు దక్షిణాది నుండి తిరిగి రాగానే రక్తపాత యుద్ధంలో రుద్రదేవుని వధించి సమాఖ్యని చెల్లాచెదురు చేశాడు, ఆర్యావర్త కు తిరుగులేని అధిపతి అయ్యాడు. N.N. ఘోష్ ఈ యుద్ధం కౌశాంబి లో జరిగిందని తెలిపారు.

4) <u>ఆటవిక రాజ్యాలు</u> :

ఆర్యావర్త సమాప్తి విజయం తర్వాత 18 ఆటవిక రాజ్యాలను సముద్రగుప్తుడు సేవకులుగా మార్చినాడని ప్రశస్తి పేర్కొంది. ఇవి ఉత్తరప్రదేశ్ లోని ఘాజీపూర్ జిల్లా కు మధ్యప్రదేశ్ లోని జబల్పూర్ కు మధ్యగల ప్రాంతంలో ఉన్నట్లు తెలుస్తుంది.

5) <u>సరిహద్దు రాజ్యాలు</u>:

సముద్రగుప్తుని నిరంతర విజయయాత్రలు తెలుసుకుని అనేక సరిహద్దు రాజ్యాలు అతని ఆధిపత్యమును శిరసావహించి అతని సామంతులుగా ఉండుటకు ఇష్టపూర్వకంగా అంగీకరించాయి. అవి -

సమతట ( తామ్రలిప్త & తూర్పు ప్రాంతం)

దావక ( అస్సాం లోని దబాక )

కామరూప ( గౌహతి ప్రాంతం)

నేపాల

కార్తృపురం ( గర్హ్వాల్ మరియు రోహిల్ ఖండ్ ప్రాంతాలందలి హిమాలయ రాజ్యాలు)

6) <u>తెగల ప్రజలు</u> :

సముద్రగుప్తుని రాజ్యానికి దక్షిణ, పశ్చిమ సరిహద్దుల్లో ఉండే అనేక గణరాజ్యాల తెగలు అతని సైనిక సామర్థ్యానికి భీతిల్లి ఇష్టపూర్వకంగా

లాంగిపాయాయుని 'ప్రశస్తి' వివరిస్తుంది. వారు

అర్జునాయనులు (పాత భరత్‌పూర్, అల్వార్ రాష్ట్రాలు)

యౌధేయులు (తూర్పు పంజాబు)

మద్రకులు (రావి, చీనాబ నదుల మధ్యప్రాంతం)

మాళవులు (మాళ్వ)

అభీరులు (పశ్చిమ రాజపుటానా)

ప్రార్జునులు (మధ్యప్రదేశ్‌లోని నర్సింగపూర్ జిల్లా)

సనకానీకులు (తూర్పు మాళ్వా)

కాకులు (సాంచి దగ్గర)

ఖరపరికులు (మధ్యభారత్) గా వర్ణించబడ్డారు.

7) <u>విదేశ రాజ్యాలు:</u>

సముద్రగుప్తుని విజయాలు విన్న విదేశీ రాజులు అతని నుండి తమ ప్రాంతాల్ని వారు ఏలడానికి చార్టర్ల మంజూరుకై కానుకలు పంపి వేడుకొన్నట్లు ప్రశస్తి ద్వారా తెలుస్తుంది. కాబూల్ నేత కుషాణ రాజు దైవపుత్ర షాహి షాహానుషాహి; పశ్చిమ భారత శకులు, సింహళ రాజు; మొ|| వారు ఈ కోవకు చెందినట్లు రాయబడింది. 'ఇతర ద్వీపాలు' అన్న పదం బహుశా మలయా, జావా, సుమాత్రా ఇతర ఇండియన ద్వీపసముదాయం లోని ద్వీపాలను వర్తిస్తుందని భావిస్తారు.

## సముద్రగుప్తుని సామ్రాజ్యవిస్తరణ :

సముద్రగుప్తుని ప్రశస్తి పాఠం లో చెప్పిన ఆగ్నేయప్రాంతం తప్ప మొత్తం బెంగాలు నుండి పశ్చిమాన కర్నాల్ వరకు ; ఉత్తరాన హిమాలయపాదాల నుండి దక్షిణాన నర్మదానది వరకుభూభాగం చేరి ఉండేది.

## సముద్రగుప్తుని దండయాత్రా వ్యూహం (or) విధానం :

సముద్రగుప్తుని దండయాత్ర పరిశీలిస్తే నాలుగు రకాల విధానాలు అవలంబించినట్లు తెలుస్తుంది.

1) ఆర్యావర్తం లోని రాజుల్ని సమూలంగా నాశనం చేశాడు - ప్రసభోద్ధరణోద్వృత్త

2) దక్షిణాపథ రాజుల్ని పట్టుకొని - 'గ్రహణ' వెంటనే వదిలేశాడు - 'మోక్ష' తర్వాత వారి రాజ్యాల్ని తిరిగి ఇచ్చాడు - 'అనుగ్రహం'.

3) అటవిక రాజుల్ని సేవకులు గా మార్చాడు - పరిచారికీకృత

సరిహద్దు రాజుల్ని అన్ని రకాల పన్నులు చెల్లించేలా (సర్వకర దాన) తన ఆజ్ఞల్ని అనుసరించేలా (ఆజ్ఞాకరణ) వ్యక్తిగత ప్రణామాలు చెల్లించేలా (ప్రణామాగమన) చేశాడు.

4) ఇక విదేశీ రాజులు 'ఆత్మ నివేదన' చేసుకుని 'కన్యోపాయనదాన' మొదలైన కానుకలు ఇచ్చి సముద్రగుప్తుని నుండి 'గరుత్మద అంక స్వవిషయ భుక్తి శాసన యాచన' చేశారని వర్ణించబడింది.

## గోయల్ చరిత్రకారుని ప్రకారం

సముద్రగుప్తుని దండయాత్ర ప్రణాళికను రెండు రకాలు ప్రభావితం చేశాయి.

1) భౌగోళిక - రాజకీయాంశాలు
2) సాంఘిక - మత విషయాలు.

## సముద్రగుప్తుని దండయాత్రల ఆరంభంలో

పద్మావతి రాజవంశస్థులైన నాగులు అధికారం చెలాయిస్తున్నారు, మధుర వంటి శక్తిమంతులెవరూ లేరు. నాగులకు గుప్తుల వలే సామ్రాజ్యాన్ని నిర్మించగల శక్తి ఉంది. ఇద్దరూ బ్రాహ్మణమత పునరుద్ధరణ లో సంబంధం కలవారే. నాగులు వాకాటకులతో వివాహ బంధం ద్వారా బలపడితే గుప్తులు లిచ్ఛవులతో వివాహం ద్వారా బలపడ్డారు. అందువల్ల సామ్రాజ్యాన్నిగాం చెయ్యాలంటే సముద్రగుప్తుడు నాగులనంతం చేయక తప్పదు. గోయల్ చెప్పే మరో కారణం మత నమ్మకాలు. గుప్తులు పరమ భాగవతులు కాగా వారి శత్రువుల్లో అనేకులు ముఖ్యంగా నాగులు, వాకాటకులు వీర శైవులు. అందుకే

సముద్రగుప్తుడు సంపాదించాడు. ఇది ఆయన సామ్రాజ్య కేంద్రభాగం (core) అయ్యింది. దీన్ని భద్రంగా రక్షించుకోడం కోసం చుట్టూ సామంత రాజ్యాల వలయాన్ని (ఆటవిక రాజ్యాలు మొదలైనవి కలిపి) ఏర్పరిచాడు. ఈ రాజ్యాల పట్ల సముద్రగుప్తుడు కొంత ఉదారంగా వ్యవహరించడానికి కింది కారణాలు చెప్పవచ్చు.

- ఆటవిక రాజ్యాల జాతి, సాంఘిక-రాజకీయ ఆచారాలు, ఆర్థిక వ్యవస్థ మొదలైనవి గంగా లోయ నుండి భిన్నమైనవి.
- అందువల్ల వీటిని పూర్తిగా సామ్రాజ్యంలో కలిపేస్తే అనేక సమస్యలు తలెత్తుతాయి.
- ప్రత్యంత దేశ సరిహద్దు రాజరిక రాజ్యాలు పూర్తిగా ఆర్య నాగరికతలోకి ఇంకా చేరలేదు.
- ఈ రాజ్యాలు అధికంగా అస్సాం బెంగాలు, బ్రహ్మపుత్ర లోయ, మార్వార్, దిగువ సింధు, బుందేల్ ఖండ్ అడవి ప్రాంతాలకి చెందినవి. ఇవన్నీ ఆక్రమించడానికి భౌగోళికంగా కష్టమైనవి, ఇక అదుపులో ఉంచడానికి మరింత కష్టమైనవి.

అందువల్ల సముద్రగుప్తుడు ఈ రాజ్యాల పాలన వ్యవస్థను భంగం చేయకుండా వాటిని గుప్తుల ప్రభావం కిందికి తెచ్చాడు. కాని ఈ వర్గంలో కూడా కొన్ని రాజ్యాలలో ఆయన పక్షీయులను పాలకులుగా నియమించినట్లు కన్పిస్తుంది. కామరూప లో వర్మ వంశ రాజపాలకుని 'పుష్యవర్మ' ను సముద్రగుప్తుడే నియమించినట్లు తెలుస్తుంది. ఇతడు ఈ గౌరవానికి కృతజ్ఞతగా తన కొడుకు, కొడలు కు చక్రవర్తి సముద్రగుప్త, చక్రవర్తిని

ల వేస్తూ పెట్టాడు. అలాగే దక్కను లో కూడా రాజవంశ ఏర్పాటుకు సముద్రగుప్త సాయం చేశాడు.

[శ్రీలంక బౌద్ధ సంప్రదాయం రక్తబంధు దాడి వల్ల కళింగ రాజు మూర్తి హేమమాల బుద్ధుని దంత ధాతు తో రాజ్యం విడిచి పారిపోయిందని చెప్తుంది. గోయల్ ఈ రక్తబంధు ని సముద్రగుప్తు గా లేదా అతని సేనానుల్లో ఒకరు గా గుర్తించారు.]

దక్షిణాపథ రాజ్యాల్ని సముద్రగుప్త జయించి విడిచి పెట్టే విధానాన్ని అవలంబించాడు. ఆర్.డి. బెనర్జీ ఈ దండయాత్ర ని అశ్వమేధయాగం జరపడానికి నిర్వహించి ఉంటాడని తెలిపారు. జయస్వాల్ పండితుడు దక్షిణం లో సముద్రగుప్తుని ప్రత్యేక లక్ష్యం గుప్తుల రాజ్యానికి ప్రమాదంగా నిల్చిన పల్లవ సైన్యం అని భావించారు. అయితే గోయల్ మాత్రం దక్షిణ రాజ్యాల ధనసంపదల పై కాంక్షయే దండయాత్ర కి పురికొల్పిందని తెలిపారు. సముద్రగుప్తుడు సమాచార సంబంధాలు అంతగా లేని ఆ రాజ్యాల్ని అంతటి సుదూర ప్రాంతాల్ని శాశ్వతంగా తాను పాలించడం ఆచరణసాధ్యం కాదని వివేకంగా తెలిసి ఉంటాడు. అందువల్ల సంపదను దోచుకున్నాక ఆయా రాజుల్ని తిరిగి ప్రతిష్ఠించి ఉంటాడు.

(దక్షిణ దండయాత్ర కు గల కారణాలు)

(4) సముద్రగుప్తుని వాయువ్య విధానం చాలా వరకు ప్రపంచ పరిస్థితుల వలన రూపొందింది. గాంధార నేతే కిదార కుషాణులు క్రీ.శ. 359 ప్రాంతంలో ససానియన్లలో

మారేందుకు సముద్రగుప్తుని సాయం కోరాడు. సముద్రగుప్త సామ్రాజ్య సరిహద్దులు రక్షించేందుకు, వ్యాపార మార్గాలు కాపాడేందుకు వాయువ్యం లో తన ప్రభావం విస్తరింప చేయాలనుకున్నాడు. ఫలితం గా కిదర కుషాణ్ లు సాయం పంపాడు. అతడు సామంతరికాన్ని అంగీకరించాడు. బహుశా దైవపుత్ర షాహి మరియు షాహానుషాహి పదాలు వీరిని సూచించేవే అయుండాలి.

వతార్ధ్రయణానంతరం, తొలిగుప్తుల కాలంలో సిలోన్, పసిఫిక్ దీవులతో భారత వాణిజ్యం బాగా పెరిగింది. ఇండియన్‌ద్వీపసముదాయం తో సంబంధాలను వర్తకులు గొప్పగా చూసేవారు. తూర్పుతీరంలో తన అదుపు లోకి తెచ్చుకున్న ఓడరేవుల ఈ దీవులతో వ్యాపారం చేసే తన వర్తకులకు (5) రక్షణ కల్పించ నిశ్చయించి ఉంటాడు, ఈ సందర్భంలోనే సిలోన్, ఇతర ద్వీపాలను సముద్రగుప్త సేవించి ఉంటారు.

## సముద్రగుప్త సామ్రాజ్యతత్వం :

భారతదేశం అందించిన గొప్ప యోధులలో సముద్రగుప్తుడు ఒకడు, విన్సెంట్ స్మిత్ ఆయన్ని ఇండియన్ నెపోలియన్ గా కీర్తించాడు.

కాని సముద్రగుప్తుని సామ్రాజ్యతత్వం విలక్షణమైన భారతీయుల స్వభావం కలిగినది. అతడు తన సైనిక శక్తి పరిమితులు, సామ్రాజ్య అధికార పరిమితులు గుర్తించిన వివేకి, ఉత్తమనాయకుడు, అతడు ఆక్రమణలని కేవలం ఆక్రమణల కోసమే చేయలేదు.

అతడు కరడుగట్టిన సామ్రాజ్యకాంక్షాపరుడు కాడు, తెలివైన జయశాలి. ఉత్తరాది రాజ్యాలు తన ఉనికికి ప్రమాదంగా పరిణమించాయి గాన వాటిని సమూలంగా అంతం చేశాడు. దక్షిణాది రాజ్యాల విషయంలో గ్రహణ మోక్ష, అనుగ్రహ విధానం అవలంబించాడు. అతడు కేవలం జయించిన రాజును పునఃప్రతిష్ఠించటమే గాక అతని సంపదను కూడా తిరిగి ఇచ్చివేశాడు. ఇది 'లాభవిజయ' (ధనం కై ఆక్రమించటం) మరియు 'అసురవిజయ' లకు వ్యతిరేకంగా ప్రాచీనులు చెప్పే 'ధర్మవిజయ' వంటిది. అందువల్ల సముద్రగుప్త విధానాలను దిగ్విజయ మరియు ధర్మవిజయ అంటారు.

సముద్రగుప్తుడు సరిహద్దు రాజ్యాలను, విదేశీ రాజులను వెంటనే స్నేహహస్తం అందించాడు.

నెపోలియన్ వాటర్లూ యుద్ధంలో ఓటమి చెంది శత్రువులకు బందీగా చిక్కాడు కాని సముద్రగుప్తుడు ఓటమిని ఎరుగని ధీరుడు గావున నెపోలియన్ ను మించిన ఘనుడు అనుట సమంజసము.

సముద్రగుప్తుని వ్యక్తిత్వం → read from Guide.

# చంద్రగుప్త II విక్రమాదిత్య

"బహుశ భారతదేశము విక్రమాదిత్యుని
కాలములో పాలింపబడినట్లు మరెప్పుడును
పాలింపబడలేదు"

— వి. ఎ. స్మిత్

సముద్రగుప్తుని అనంతరం క్రీ.శ. 380 ప్రాంతంలో గుప్తుల సింహాసనాన్ని అధిష్ఠించినవాడే చంద్రగుప్త II. శాసనాల ద్వారా ఇతడిని సముద్రగుప్తుడు తన వారసునిగా ఎంపిక చేసినట్లు తెలుస్తుంది.

కాని చంద్రగుప్త II సింహాసనాధిష్ఠానం పై కొంత వివాదం ఉంది. విశాఖదత్తుని 'దేవి చంద్రగుప్తం' ద్వారా గుప్తరాజు 'రామగుప్తుడు' శకులకు భయపడి తన భార్య 'ధృవాదేవి'ని అప్పగించటానికి ఒప్పుకున్నాడు. ఇది సహించని అతని తమ్ముడు చంద్రగుప్త II ధృవాదేవి వేషంలో శకరాజ్యం వెళ్లి అక్కడ శకరాజును హతమార్చాడు. బాణుని 'హర్షచరిత' రాజశేఖరుని 'కావ్యమీమాంస' సంజన, కాంబే మరియు సాంగ్లి రాగిఫలకాలు (- ఇవి రాష్ట్రకూటులవి) వీటన్నింటి ద్వారా చంద్రగుప్త II తన సోదరుడు రామగుప్తుని హతమార్చి అతని రాజ్యంతో పాటు రాణిని కూడా చేపట్టాడని తెలుస్తుంది. ఇటీవలి

కాలంలో విదిశ - ఎరాన ప్రాంతాల్లో దొరికిన రాగినాణేలపై
రామగుప్తుని పేరుండడం ఈ సమస్యకు కొత్త ఊతాన్ని
ఇచ్చింది. ఈ అంశంపై పరిశోధన చేసిన గోయల్ ప్రకారం -
సముద్రగుప్తుని మరణానంతరం అతని చిన్నకొడుకు తూర్పుమాళ్వా
తప్ప మిగతా సామ్రాజ్యమంతా అధికారాన్ని నెలకొల్పగలిగాడని
పెద్దకొడుకు రామగుప్త తూర్పుమాళ్వాలో స్వాతంత్ర్యం ప్రకటించు
కున్నాడు. అయితే అతను శకులనుండి నిరంతరం భయాన్ని
ఎదుర్కోవాల్సి వచ్చింది. చంద్రగుప్త II ఈ పరిస్థితిని
అదునుగా తీసుకుని గుప్తసామ్రాజ్య భద్రత పేరుతో తూర్పుమాళ్వా
ను ఆక్రమించాడు. ఈ క్రమంలో రామగుప్త చంపబడగా
అతని భార్య చంద్రగుప్త II భార్య అయింది.

చంద్రగుప్త II కొడుకు గోవిందగుప్త తల్లిగా
వైశాలి seal మీద ధ్రువాదేవి పేరు ఉంది. ఇది పై కథలకు
చారిత్రక బలం చేకూరుస్తుంది.

అయితే H.C. రాయచౌదరి వంటివారు
ఈ అభిప్రాయాన్ని అంగీకరించలేదు. చంద్రగుప్త II తండ్రి చేతనే
ఎంపిక చేయబడ్డాడు అనడానికి ఆధారాలున్నాయి, వారసత్వ
యుద్ధం జరిగిందని చెప్పలేము.

రాజైన అర్హాలత చంద్రగుప్త II తన
తండ్రి వలె సామ్రాజ్య విస్తరణా విధానాన్ని అనుసరించాడు,
అయితే రాజ్యాన్ని సుస్థిర పరచటంలోనూ అతడు విజయం
సాధించాడు.

సామ్రాజ్య పశ్చిమదిశలో మధుర &
పశ్చిమాన ఉన్న ఆటవిక రాజ్యాలు క్రమంగా సామ్రాజ్యంలో
కలిపివేయబడ్డాయి. బయానా ప్రాంతంలో దొరికిన
1821 బంగారు నాణాలలో దాదాపు 980 నాణాలు
చంద్రగుప్త II విడుదల చేసినవే. ఇది ఈ ప్రాంతంలో
చంద్రగుప్త II కు ఉన్న బలాన్ని తెలుపుతుంది.

<u>వివాహ సంబంధాలు</u> :

చంద్రగుప్త II అనేక ప్రాచీన రాజుల వలె
వివాహ బంధాల ద్వారా తన ప్రాబల్యాన్ని పెంపొందించు
కున్నాడు.

1) మొదట తాను నాగరాకుమార్తె 'కుబేరనాగ' ను
వివాహమాడి ఆర్యావర్తములో నాగపాలకుల సహాయ
సంపత్తులు పొందాడు.

2) తన కూతురు ప్రభావతీగుప్త ను వాకాటక రాజైన
రెండవ రుద్రసేనుని కిచ్చి వివాహం చేసెను.

" గుజరాతు, సౌరాష్ట్రులలోని శక క్షత్రపులపై
దాడి చేసే ఉత్తర పాలకునికి గొప్ప
సహాయం చేయగల వ్యూహాత్మక

భౌగోళిక ప్రాంతం లో వాకాటక మహారాజు
ఉన్నాడు ”

అన్య స్రోత మాటలు చంద్రగుప్త II
ఈ వివాహం చేయుటం లో దాగిన వివేకాన్ని తెల్పుతాయి.

3) కదంబ వంశ కాకుత్స వర్మ కుమార్తెను తన కుమారున
కిచ్చి వివాహం చేసి తన ప్రాబల్యాను మైసూరు వరకు
విస్తరించెను.

## శకులపై విజయం :

చంద్రగుప్త II పాలన కాలం లో అతిముఖ్యమైన ఘటన ఇదే. భారత రాజుల కు ప్రమాదంగా పరిణమించిన శకులపై దాడిచేసి క్రీ.శ. 388 - 399 ల మధ్య జరిగిన యుద్ధం లో శకరాజు రుద్రసింహ III ను హతమార్చి శక రాజ్యాన్ని గుప్తసామ్రాజ్యం లో విలీనం చేశాడు. ఈ యుద్ధంలో వాకాటకుల సాయం అమూల్యమైనది.

ఈ యుద్ధ ఫలితంగా పశ్చిమవాడ లేదా సౌరాష్ట్ర మరియు ఉత్తర గుజరాతు ప్రాంతాలు గుప్తుల వశమయ్యాయి. అంతకన్నా ముఖ్యమైనది పశ్చిమ దేశాలతో వ్యాపారసంబంధాలు చేసే పశ్చిమతీరం అధీనమయ్యింది. అత్యంత లాభదాయకమైన సముద్రవ్యాపారం గుప్తరాజ్యానికి లభించింది.

శకులపై చంద్రగుప్త II విజయాలు నిరూపించేందుకు కింది సాక్ష్యాలను చెప్పవచ్చు.

ఈ కాలం లో వెండి ముద్రించబడిన శకనాణేలు దొరకడం

లేదు. అంతకు ముందు గల నాలుగు వందల సంవత్సరాలుగా నిరాటంకం గా ముద్రించబడిన శక నాణేలు ఈ కాలం తర్వాత ముద్రించబడకపోవడం గమనించదగింది.

- చంద్రగుప్తుని కాలం నుంచి గుప్తులు ఈ ప్రాంతం లో శక-పద్ధతి వెండి నాణాలను ముద్రించారు. గుప్తులు కేవలం వారి విలక్షణ చిహ్నాలను మాత్రమే చేర్చారు, లేకపోతే ఇవి అప్పటివరకూ ఉన్న శక నాణాల మాదిరిగానే ఉన్నాయి. శక రాజ్యాన్ని చంద్రగుప్త II జయించాడనటానికి ఇది ప్రబల ఆధారం.

- చంద్రగుప్త II కు గల బిరుదులు 'శకారి' 'సాహసాంక' శకులపై విజయం తర్వాత ధరించినవేనంటారు. శకులకు అరి (శత్రువు) కాబట్టి శకారి అయ్యాడు.

- చంద్రగుప్త II ముద్రించిన ఒక బంగారునాణెం మీద అతడు సింహాన్ని చంపుతున్నట్లు ఉంది — సింహ విక్రమ, ఇది గుజరాతు పై అతని అధికారానికి చిహ్నమని కొందరు అంటారు.

- మాళవ లో చంద్రగుప్త II తన అధికారులతో కలిసి దీర్ఘకాలం ఉన్నట్లు శాసనాలు తెల్పుతున్నాయి. అవి (1) అతని యుద్ధ మంత్రి వీరసేనుని ఉదయగిరి గుండల శాసనం (2) ఉదయగిరి గుండల్లోనే సనకానిక మహారాజ శాసనం, సామంతుడు (3) సైనికాధికారి అమరకార్దవుని సాంచి శాసనం. శకులపై దాడికి సన్నద్ధమవ్వడాన్ని ఇవి సూచిస్తాయి.

- సాహిత్య గ్రంథాల్లో రామగుప్త సన్నివేశానికి సంబంధించి

చంద్రగుప్త II తరువాతా చేసినట్లు చెప్పబడిన యుద్ధాలు ఈ విజయాలకి ప్రతిధ్వనులుగా నిర్మించ బడినవే.

## మెహరౌలి స్తంభం - చంద్రగుప్త II :

ఈ స్తంభం పై నున్న 'చంద్ర' ఎవరనే దానిపై చరిత్రకారుల్లో భిన్నాభిప్రాయాలున్నాయి. అయితే ప్రస్తుతం ఈ 'చంద్ర' చంద్రగుప్త II అని అనేకమంది ఆమోదించారు.

దీని ప్రకారం చంద్ర తూర్పు బెంగాలు పై దిగ్విజయం పొందాడు. అయితే సముద్రగుప్త అంతకు ముందే ఈ ప్రాంతాన్ని సామంత సరిహద్దు రాజ్యంగా మార్చి ఉండడం చే ఈ దండయాత్ర కి కారణాలపై భిన్నాభిప్రాయాలు తలెత్తాయి. వంగ రాజు గుప్తుల సార్వభౌమత్వానికి వ్యతిరేకంగా తిరుగుబాటు చేయడమో లేదా చంద్రగుప్త II కి దాన్ని ప్రత్యక్ష పాలన లోకి తేవాలన్న సామ్రాజ్యకాంక్ష గాని కారణాలై ఉంటాయి. ఈ విజయం లో వంగ రాజ్యం గుప్తుల ప్రత్యక్ష పాలన లోకి తేబడింది. క్రీ.శ. 6 వ శతాబ్దం లో ఈ ప్రాంతం గుప్తుల రాజు చే పాలించబడేదన్న విషయం దీన్ని సమర్థిస్తుంది.

మెహరౌలి స్తంభ శాసనం 'చంద్ర' యుద్ధం లో సప్త సింధు ను దాటి వాహ్లీకులను జయించినట్లు చెప్పబడింది. వాహ్లీక ను బాల్క్ / బాల్ఖ (బాక్ట్రియా) గా గుర్తించారు. దీనికి కూడా వాహ్లీకుల లేదా కుషాణ రాజు తిరుగుబాటు లేదా చంద్రగుప్త II సామ్రాజ్యకాంక్షే కారణమై ఉంటాయి.

ఏదేమయినా అతని విజయసేనలు వింధ్యపర్వతాలను దాటి వాయువ్య ప్రాంతాన్ని జయించాడు, 'చంద్ర' పేరుగల శాసనాల తరవాత నాణాలు దొరకడం చేత ఈ వాయువ్య సరిహద్దుపై అతని ఆధిపత్యం రుజువౌతుంది.

ఘనత :

Read from Guide.

# గుప్తుల పతనానికి గల కారణాలు

క్రీ.శ. 4 వ శతాబ్దంలో మహావీరులైన సముద్రగుప్త, చంద్రగుప్త II లచే రూపొందిన గుప్త సామ్రాజ్య సాధనలు క్రమంగా కుమార, స్కంధ గుప్తుల కాలంలో వెలుగు వారి వీరి వారసుల కాలంలో నేలకూలెను. ఇట్టి గుప్తుల పతనానికి అనేక కారణాలు కలవు.

1) హూణుల దండయాత్రలు :

కుమారగుప్త I కాలం నుంచి వాయువ్య సరిహద్దు మధ్య ఆసియా లేక హూణుల చేత (ప్ర)మాద భరితమైంది. హూణులు వాయువ్య, పశ్చిమ, ఉత్తర భారతాల్లో విజయవంతంగా ముందుకు సాగుతున్నారు. అయితే కుమారగుప్త I కొడుకు స్కంధగుప్తుని శౌర్యసాహసాల వల్ల తాత్కాలికంగా ముప్పు తప్పింది. స్కంధగుప్తుని అనంతరం గుప్తరాజులు బలహీనులై వారిని అడ్డగించలేకపోయారు. దీంతో హూణరాజు తోరమాణుడు పశ్చిమ, మధ్య భారతాల్లో పాగావేశాడు. ఆయన కొడుకు మిహిరకులుడు హూణరాజ్యాన్ని మరింత విస్తరించాడు. ఈ విధంగా హూణుల దండయాత్రలు ముఖ్యంగా వాయువ్య ప్రాంతంలో, గుప్త సామ్రాజ్యానికి గొడ్డలిపెట్టులా పరిణమించాయి.

2) లోప భూయిష్ఠమైన సామ్రాజ్య నిర్మాణం :

గుప్తుల పతనం బహుశా వారి సామ్రాజ్యం వ్యవస్థీకరించబడిన పద్ధతి కి నివారించలేని

ఘోషాల్ వారి డి.ఎన్. ఝా అభిప్రాయం. గుప్తుల ప్రభుత్వ
పాలన లో ప్రధానంగా బెంగాల్, బీహార్, ఉత్తర ప్రదేశ్ లు
మాత్రమే ఉన్నాయి. వారి రాజ్యం లో అధిక భాగం సామంతుల
కింద ఉంది. మధ్య భారతం లోని పరివ్రాజకులు, ఉచ్ఛకల్పులు
వీరూ సముద్రగుప్తుని చే జయించి విడువబడిన ఎందరో రాజులు.
గుప్తుల కాలం లో ప్రముఖ సామంతులు 'వల్లభి లోని మైత్రకులు',
'స్థానేశ్వరం లోని వర్ధనులు', 'కనౌజ్ లోని మౌఖరీలు' మరియు
'మగధ లోని అనంతర గుప్తులు', 'బెంగాల్ లోని చంద్ర వంశీయులు'
అవసానం చెందినప్పుడు ఈ సామంతులు వెంటనే
స్వాతంత్ర్యం ప్రకటించుకుని గుప్తసామ్రాజ్య నష్టాలు
చేశారు. క్రీ.శ. 530 ప్రాంతం లో మాల్వా లో
యశోధర్మ స్వాతంత్ర్యం ప్రకటించుకుని గుప్తులతో పోరాడి
ఇ కూడా నిర్మూలించాడు. వెంటనే ఇతని ఉదాహరణను
అనేక ఇతర సామంతులు అనుసరించారు.

మందసోర్ శాసనం

3) సైనిక లోపాలు :

గుప్తరాజులు విశాలమైన స్థిర (సిద్ధ) సైన్యాన్ని
పోషించినట్లు కనబడదు. వారు అధికంగా సామంతుల
అందించే సైన్యం మీద ఆధారపడేవారు. అదీగాక గుప్త
ప్రభుత్వం గజ, అశ్వదళాలపై సర్వాధిపత్యం కలిగి
లేదు. అవి కూడా సామంతుల సైన్యం లో ఉండేవి.
కొందరు చరిత్రకారులు గుప్తుల నగర జీవితం లోని
విలాసత్వం సైనికులకి అబ్బిందని అందువల్ల

చివరికాలంలో అంతగా విజయాలు పొందలేకపోయారని అంటారు.

4) ఉద్యోగ వ్యవస్థలో లోపాలు :

గుప్తులు మౌర్యుల వలె విశాల ఉద్యోగబృందంతో పాలనను తమ ఆధీనంలో ఉంచుకునే ఆస్కారం చేయలేదు. ముఖ్య ఉద్యోగులందరినీ రాజే నియమించేవాడు, కాని అనేక పదవులు ఒకే చోట కేంద్రీకరించబడేవి. ఉదాహరణకు అలహాబాదు ప్రశస్తి రాసిన హరిషేణుడు అనేక ముఖ్య పదవులు అలంకరించాడు. అలాగే కొన్ని ప్రభుత్వోద్యోగాలు వారసత్వం చేయబడటంతో పాలనపై రాజు నియంత్రణ మందగించింది.

5) భూదానాలు - విచ్ఛిన్నకర వికేంద్రీకరణ :

గుప్తుల కాలంలో మునుపటి కంటే భూదానాలు బాగా పెరిగాయి. దీనితో పాటు ఈ భూదానగ్రహీతలకు భూమిశిస్తు వసూలుతో పాటు అనేక పాలనా, న్యాయపరమైన హక్కులు కూడా లభించేవి. రాజసేనలు వారి భూముల్లో ప్రవేశించకుండా మినహాయింపు లభించింది. ఫలితంగా భూదానగ్రహీతలు చాలా వరకు స్వతంత్రంగా అనుభవించేవారు. వీరు క్రమంగా తమను సామంతులుగా ప్రకటించుకోవడం, వీలు చిక్కినప్పుడు స్వాతంత్ర్యం ప్రకటించుకోవడం చేశారు.

6) కింది తరగతుల్లో పెరిగిన అసంతృప్తి :

గుప్తులు చేసిన భూదానాల వల్ల

క్రమంగా దాన గ్రహీతలకు భూమి మీద గల అందరి రైతులపై కూడా హక్కు ఏర్పడింది. అదేగాక ఆ బ్రాహ్మణ ప్రముఖ దానగ్రహీతలు శిస్తులకు లోబడి ఉండాల్సిందిగా ఆజ్ఞాపించేవారు. దానగ్రహీతలకు పన్ను విధించే హక్కు ఉండేది. పైగా గుప్తుల కాలంలో నిర్బంధ చాకిరి 'వెట్టి' బాగా పెరిగింది. భూస్వాముల క్రమానుగతశ్రేణి పెరిగి అధిక భూస్వామ్య [illegible] వచ్చింది. ఈ అధిక భూస్వామ్య, ఇతర సంతాలు, వెట్టి కింది వర్గాల వారిని మునుపెన్నడూ లేనంతగా అణచివేశాయి.

దీనికి తోడు నాటికే బలపడుతున్న బ్రాహ్మణ మతం ఫలితంగా కింది వర్గాల వారు సాంఘికంగా కూడా తీవ్ర అవమానాలు ఎదుర్కోవాల్సి వచ్చింది. ఇవన్నీ ప్రజల్లో అసంతృప్తి, ఆగ్రహం రగిలించాయి.

7) దిగజారిన ఆర్థిక పరిస్థితులు:

భూదానాలతో పాటు ఆదాయ వనరులు కూడా దానం చేయడం వల్ల రాజ్యం పెద్దమొత్తంలో నష్టపోయింది. చివరి గుప్తుల కాలానికి రోమన్ సామ్రాజ్య పతనం మూలాన విదేశీ వాణిజ్యం దెబ్బతిని రాజ్యం వర్తకవాణిజ్యాల వల్ల మునుపటిలా ఆదాయం కోల్పోయింది. గుజరాతు నుండి పట్టు వర్తక శ్రేణి పట్టు నేతవారి శ్రేణి వలస పోవడం వల్ల

ప్రతిబింబిస్తుంది. హూణుల దండయాత్రల వల్ల నిరంతర యుద్ధాల కారణంగా ఈ విధంగా కూడా రాజ్య కోశాగారం వట్టి పోయింది. స్కందగుప్తుని కాలంలో, ఆ తర్వాత బంగారు నాణేలలో కల్తీ పెరగడం మరియు క్రమంగా బంగారు నాణేలు వేయకపోవడం నాటి క్షీణమైన ఆర్థిక స్థితి ని తెల్పుతాయి. ఇలాంటి ఆర్థిక స్థితి వల్ల చివరి గుప్తులు సమర్థవంతమైన సైన్యాన్ని పోషించలేకపోయారు.

8) రాజకుటుంబం - వివాదాలు :

బహుభార్యాత్వం వలన సహజంగానే కాలక్రమంలో రాజకుటుంబం విస్తృతమౌతుంది. 'పెద్దకొడుకు రాజవ్వడం' లాంటి వారసత్వ సూత్రాలేవీ గుప్తులు పాటించలేదు. ప్రస్తుత రాజులు సమర్థుడైన కొడుకును [struck-out] వారసునిగా ప్రకటించడం చేసేవారు. అలా ప్రకటించినా కచ, రామగుప్త సన్నివేశాలు వారసత్వ ఘర్షణ ను సూచిస్తున్నాయి. సరైన వారసత్వ సూత్రం లేకపోవడమన్నది చివరి గుప్తుల కాలం లో తీవ్ర అంతర్గత ఘర్షణలకు దారి తీసి చివరికి వెంట వెంటనే బుధగుప్త, చంద్రగుప్త III, విక్రమాదిత్య, వైన్యగుప్త, ద్వాదశాదిత్య రాజులందరూ స్వల్పకాల పాలకులయ్యారు. ఇలాంటి రక్తపాత అంతర్గత రాజకీయ స్థితి లో హూణులు చేసిన దండయాత్రలు సామ్రాజ్యానికి చావుదెబ్బ గా పరిణమించాయి.

9) చివరి గుప్తుల మతవిధానం :

కుమారగుప్తుడు I తన వృద్ధాప్యం లో బౌద్ధమతం స్వీకరించాడు. చివరి గుప్తులు బౌద్ధాన్ని ఆదరించి అనుసరించిన కారణం, అహింసా విధానాన్ని గుప్త సామ్రాజ్య పతనానికి దారి

విధానాలు పాటించడం గా

డాయని 'A History of the Imperial Guptas'
లో S.R. గోయల్ అభి(ప్రా)యపడ్డారు. [గుప్తరాజు
బాలాదిత్యుడు మత కారణాల వలన మిహిరకులుని తో యుద్ధం
చేయలేకపోవడం తో అతని సామంతులు మిహిరకులుని ఓడించారు.
కాని, తర్వాత అక్కమేరకు బాలాదిత్యుడు మిహిరకులుని విడిచి
పెట్టాల్సివచ్చిందని హ్యుయాన్‌త్సాంగ్ రచనల వలన తెలుస్తుంది.] X

10) బలహీన (అసమర్థ) వారసులు :

స్కంధగుప్తుని తర్వాత అతని ధైర్య సాహసాలు గల గుప్తరాజు కన్పించడు. సమర్థులు కాని వారసులు క్రమంగా పాలకులవడం వలన కేంద్రం బలహీనపడింది. ఇది సామంతులకు మంచి అవకాశం గా పరిణమించింది. J.N. సర్కార్

11) చంద్రగుప్త II వారసులు అతని పశ్చిమసరిహద్దు మీద దృష్టి నిల్పటమనే విధానం యొక్క ప్రాముఖ్యతను గుర్తించలేక పోయారు. ఫలితంగా వారిలో కొందరు పాటలీపుత్రం లోనే ఉండి సమయం వృధా చేయడం వల్ల శత్రువులు సులభంగా జొరబడసాగారు.

12) సరిహద్దు రాజ్యాలతో క్షీణించిన సంబంధాలు :

ఒకప్పుడు వాకాటకుల అండదండలతో చంద్రగుప్త II విశాల సామ్రాజ్యమును స్థాపించాడు. కాని అతని వారసులు వాకాటకులతో అదే సంబంధాలను కొనసాగించ లేకపోయారు. ముఖ్యంగా హూణుల దండయాత్రలప్పుడు వారి సహాయం లభించకపోవటం దురదృష్టం. తర్వాత కాలంలో వాకాటక రాజు నరేంద్రసేన గుప్త సామ్రాజ్యం లో అంతర్భాగమైన

కోసల, వలభిల రాజ్యాలను కలుపుకొని ఆక్రమించాను.

కుమారగుప్త II కాలంలో ఆంధ్రులు, చాళుక్యులు, గౌడులు గుప్తరాజ్యం పై దండయాత్రలు చేశారు అంటారు.

(ఈ విధంగా*) అత్యున్నతమైన విజయాలతో, ఉదార పాలనతో, సాంస్కృతిక రంగ వికాసంతో విరాజిల్లిన గుప్తుల సామ్రాజ్యం(*) అనేక అంతర్గత, బాహ్యగత కారణాల చేత క్రీ.శ. 6 వ శతాబ్దం చివరికల్లా అంతమయ్యింది.

* "గుప్త సామ్రాజ్య పతనమునకు కారకులు హూణులు కారు, వారి శక్తిమంతులైన, స్వార్థపరులైన సామంతులే"

— ఆర్.సి. మజుందార్

"హూణ దండయాత్రలు గుప్త సామ్రాజ్య పతనమునకు దోహదమొనర్చి అనేక స్వాతంత్ర్య రాజ్యముల ఆవిర్భావమునకు దోహదమయ్యెను."

— స్మిత్

13) అవిధేయులైన అధికారులు :

గుప్త సామ్రాజ్యం యొక్క ఫ్యూడల్ నిర్మాణం హూణులు దాన్ని ఆక్రమించుకోవడాన్ని సులువు చేసింది. హూణులు స్థానిక అధికారుల్ని, రాజుల్ని తమ పక్షం లోకి సులభంగా మళ్లించగలిగారు. పంజాబు నుండి తోరమాణుడు గుప్తరాజ్యం పై దాడి

చేసినప్పుడు 'వీరగుప్త' అనే గుప్తుల ఉద్యోగి హూణుల పక్షం చేరినట్లు తెలుస్తుంది. అలాగే తోరమానుడు మాల్వా ప్రాంతాన్ని ఆక్రమించే సమయంలో 'ధాన్యవిష్ణు' అనే గుప్తుల ఉన్నతాధికారి గుప్తచక్రవర్తి ని వదిలేసి హూణపక్షం చేరాడు. తోరమానుడు దాదాపు మొత్తం గంగాలోయ అంతా ఆక్రమించడం లో ప్రకాశాదిత్యుడు సాయం చేసినట్లు తెలుస్తుంది.

* మొదటి కుమారగుప్తుని కాలంలో పుష్యమిత్రుల దాడులు జరిగి రాజ్యానికి తీరని నష్టం కలిగింది.

(14)

* చివరి గుప్తుల కాలం లో రాజధాని ఉజ్జయిని నుంచి పాటలీపుత్రా కి మార్చడం వల్ల పశ్చిమ ప్రాంతాలను రక్షించలేక హూణులు సులభంగా చేరడానికి చొచ్చుకొని రావడానికి వీలు కలిగింది.

* మిహిరకులుడు గుప్తరాజ్యం పై దండెత్తినప్పుడు గుప్తచక్రవర్తి బాలాదిత్యుడు తన సభికులతో "నేను వాళ్ళతో యుద్ధం చేయలేను, నేను చిత్తడినేల పొదల్లో దాక్కుంటాను"

'I cannot fight with them, I conceal my poor person among the bushes of morass"

—Huen Tsang

కానీ బాలాదిత్యుడు మిహిరకులుని ఖైదీగా పట్టుకొని తన తల్లి ఆదేశానుసారం విడిచిపెట్టినట్లు కూడా హ్యూయాన్ త్సాంగ్ పేర్కొనెను. ఇలా హ్యూ.త్సాం. రచనల్లో విశ్లేషిస్తే కడపటి గుప్త రాజుల బౌద్ధమత వ్యాప్తి అనేది ఆ విధంగా గుప్తుల పతనానికి పరోక్షంగా కారణమనవచ్చు.

## ఆగ్నేయాసియా దేశాల తో భారతీయ ప్రాచీన సాంస్కృతిక సంబంధాలు

Add this to Telugu Academi

కాంబోడియా, అన్నాం లాంటి రెండు రాజ్యాలేగాక ఇండో-చైనా ద్వీపకల్పం లో క్రీ.శ. తొలి 5 శతాబ్దాలలో ఎన్నో ఇతర హిందూ రాజ్యాలు వున్నాయి. బర్మా సాంప్రదాయం ప్రకారం హిందూ వలసదార్లు ఉత్తర, దక్షిణ బర్మాలో క్రీ.పూ. మే రాజ్యాలు స్థాపించారని తెలుస్తుంది. క్రీ.శ. తొలి శతాబ్దాలలో 'శ్రీక్షేత్ర' ముఖ్య హిందూ రాజ్యం.

సియాం లోని 'ద్వారవతి' హిందూరాజ్యం మరొక ప్రముఖరాజ్యం. ద్వీపకల్పం అంతర్భాగంలో హిందూసంస్కృతి వ్యాపించడానికి ఇది కేంద్రంగా పనిచేసింది. ద్వీపకల్పం దక్షిణాగ్రం లో క్రీ.శ. 2వ శతాబ్దం లో 'లాంగ కియాసు' అనే హిందూరాజ్య మున్నదని చైనాకథనలు తెల్పుతున్నాయి.

మలయా ద్వీపకల్పంతో భారతీయులకు దగ్గరి సంబంధాలు ఉన్నాయి. సుంగై బటు పహట్ (కెడా శిఖరం) వద్ద హిందూదేవాలయం, రాతిశిల్పాల శిథిలాలు దొరికాయి. కెడా వద్ద దొరికిన బౌద్ధాలయ శిథిలాన్ని క్రీ.శ. 4 లేదా 5 వ శతాబ్దం నాటిగా చెప్పవచ్చు - అక్కడ దొరికిన సంస్కృత శాసన ఆధారంగా. తకువా పా ప్రాంతం లో కూడా ఆలయ శిథిలాలు ఉన్నాయి. బాండన భూతల తీరం వెంబడి తూర్పువైపుంలో క్రీ.శ. 4-5 శతాబ్దాల నాటి జనావాసాలు ఉన్నాయి. ఈ దేశం లో దొరికిన వివిధ శతాబ్దాల నాటి లిపిలో సంస్కృత శాసనాలు క్రీ.శ. 4-5 శతాబ్దాల నాటి లిపిలో ఉండి ఆ కాలానికి ఉత్తర, పశ్చిమ, తూర్పు భాగాల్లో మలయా

ద్వీపకల్పంలో భారతీయ వలసలు ఏర్పడినట్లు నిరూపిస్తున్నాయి.
ఈ వలసలు ఉత్తర, దక్షిణ భారతీయులిరువురూ
నెలకొల్పారని తెలుస్తుంది.

అకోళ్ల (తమలూ పా) భారతీయ వర్తకులకు,
వలసదార్లకు ప్రధాన బసగా ఉండేది. ఈ రేవు నుంచి
కొందరు విశాల మైదానం లాంటి పర్వతశ్రేణుల్ని దాటి ఆవలి
తీరం చేరేవారు. ఈ రేవు నుంచి వర్తకులు భూమి లేదా
జల మార్గం ద్వారా సయాం, కాంబోడియా, మరియు అన్నాం
లకు చేరుకునేవారు. ఈ ద్వీపకల్పాంతర మార్గం వలస
(trans-peninsular route) భారతీయ జనావాసాల
శిథిలాల ద్వారా తెలుస్తుంది. బహుశా ఇది మలక్కా straits
లాంటి సుదీర్ఘ, ప్రమాదభరిత సముద్రయానాన్ని వద్దను
కునేవారికి అనుసరించడానికి వీలుగా ఉండేది. కాని
తూర్పు సముద్రయానమే అధిక ప్రాచుర్యంలో ఉండేది, ఎందుకంటే
వర్తకులు ఓడలు మారడానికి మొగ్గుచూపేవారు కాదు.
పైగా సముద్రయానం ద్వారా జావా, దక్షిణ సుమత్రాలకు
తొందరగా దగ్గర దారిని చేరవచ్చు. ఏమైనా మొత్తం మీద
(*) భారతీయ వలస సామ్రాజ్యానికి (ఆగ్నేయాసియాని) ఈ
మలయా ద్వీపకల్పం ప్రధాన ద్వారం (main gate)
గా తోడ్పడింది.

ఇండోనేసియాలో క్రీ.శ. ఐదు శతాబ్దాల్లో
ఈ దేశాల్లో హిందూరాజ్యాలు వెలిశాయి. Java & Borneo

తూర్పు ఇండియా దీవులు గాని, ఇండో చైనా ద్వీపకల్పం లో గాని అవతరించిన ఏ హిందూ రాజ్యాలు భారతదేశం లోని రాజ్యమో, రాజులో కాని తమ రాజకీయ అధికారాన్ని వ్యాప్తి చెందించాలని ఏర్పాటు చేసినవి కావు. ప్రాచీన భారతం లో భారత రాజులు పథకం ప్రకారం ఇక్కడ సామ్రాజ్యాల కోసం సైనిక దళాలు పంపినట్లు ఏ ఆధారాలు లేవు. అవి కేవలం వ్యక్తుల సాహసం వల్ల ఏర్పడినవి. తమ ఉన్నత సంస్కృతి, సైనిక నైపుణ్యాలు, అధిక సామర్థ్యాల కారణం గా స్థానిక ఆదిమ ప్రజలపై తమ అధికారాన్ని నెలకొల్పడంలో విజయవంతమైన కొందరి కృషి కి ఫలితాలుగా మాత్రమే ఈ రాజ్యాలు ఆవిర్భవించాయి.

ఏ భారతీయ రాజ్యాల నుంచి ఈ వలసదార్లు వెళ్ళి అక్కడ వలసలు స్థాపించారో ఆ భారతరాజ్యాలు వీని వలన రాజకీయంగా లబ్ధి పొందినట్లు ఎక్కడా కన్పించదు. ఈ వలసల్ని స్థాపించిన రాజవంశాలు అసలు భారతీయ రాజ వంశాలతో ఏవైనా క్రమ సంబంధాలని కలిగి ఉన్నాయా అన్నది సందేహాస్పదంగా ఉంది. సముద్రగుప్తుడు 'ఇతర ద్వీపాలు' కూడా సింహళం తో పాటు ఆత్మనివేదన చేసుకుని తమ ప్రాంతాల్ని పాలించుకొనడానికి గుప్త చక్రవర్తి చార్టర్లు పొందినట్లు చెప్పుకున్నా అందులో నిజమెంతో

తూర్పు ఇండియా దీవుల్లో గాని, ఇండోచైనా ద్వీపకల్పంలో గాని అవతరించిన హిందూ రాజ్యాలు భారతదేశంలోని రాజ్యమో, రాజ్యాలో కావాలని తమ రాజకీయ అధికారాన్ని వ్యాప్తి చెందించాలని ఏర్పాటు చేసినవి కావు. ప్రాచీన భారతంలో భారత రాజ్యాలు పథకం ప్రకారం ఇక్కడ సామ్రాజ్యాల కోసం సైనిక దళాలు పంపినట్లు ఏ ఆధారాలూ లేవు. అవి కేవలం వ్యక్తుల సాహసం వల్ల ఏర్పడినవి. తమ ఉన్నత సంస్కృతి, సైనిక కౌశల్యాలు, అధిక సామర్థ్యాల కారణంగా స్థానిక ఆదిమ ప్రజలపై తమ అధికారాన్ని నెలకొల్పడంలో విజయవంతమైన అందరి కృషికి ఫలితాలుగా మాత్రమే ఈ రాజ్యాలు ఆవిర్భవించాయి.

ఏ భారతీయ రాజ్యాల నుంచి ఈ వలసదార్లు వెళ్ళి అక్కడ వలసలు స్థాపించారో ఆ భారతరాజ్యాలు వీటి వలన రాజకీయంగా లబ్ధి పొందినట్లు ఎక్కడా కన్పించదు. ఈ వలసల్ని స్థాపించిన రాజవంశాలు అసలు భారతీయ రాజ వంశాలతో ఏవైనా క్రమ సంబంధాలని కలిగివుండేవారా అన్నది సందేహాస్పదంగా ఉంది. సముద్రగుప్తుడు 'ఇతర ద్వీపాలు' కూడా ఇతరులతో పాటు ఆత్మనివేదన చేసుకుని తమ ప్రాంతాల్ని పాలించుకోడానికి గుప్త చక్రవర్తి చార్టర్లు పొందినట్లు చెప్తున్నా అందులో నిజమెంతో

చెప్పలేము. ఒకవేళ నిజమే అయినా మొదట ఏదో ఒకటి రెండు ద్వీపాలకే అది పరిమితమై ఉంటుంది.

కాని ఈ దేశాల్లో భారతీయ వలసలు స్థాపించబడటం వల్ల ఏర్పడిన అతి ముఖ్య ప్రయోజనం ఈ ప్రాంతాలకి హిందూ సంస్కృతి, నాగరికతలు వ్యాపించడమే.

ముగింపు:

భారతదేశం ఏ విధంగానయితే విదేశీ ప్రభావాలకి లోనయినను తన సొంత వ్యక్తిత్వాన్ని నిలబెట్టుకుని, అభివృద్ధి పరచుకుందో అదేవిధంగా ఆగ్నేయాసియా లోని ప్రాంతాలన్నీ భారతీయ అంశాల్లో తమ స్థానిక అంశాలని మేళవించి వాటి విలక్షణ సొంత సంస్కృతులని వృద్ధి పరచుకున్నాయి.

కారణాలు: Causes for Indian Cultural expansion

క్రీ.శ. తొలి శతాబ్దాలలో భారతదేశంలో సముద్ర వాణిజ్యం వెల్లివిరిసింది, ముఖ్యంగా ఆగ్నేయాసియా దేశాలతో ఈ వర్తక వాణిజ్యాలు విస్తారంగా విరివిగా సాగేవి. ఈ కార్యకలాపాల ఆరంభాలు చాలా పూర్వానికి చెందినవే అయినా క్రీ.శ. 200-550 ప్రాంతం లోని కార్యకలాపాల వివరాలకు విరివిగా ఆధారాలున్నాయి.

భారతీయ సాహిత్యం ముఖ్యంగా బౌద్ధ, జైన గ్రంథాల్లోని నీతి కథల్లో వర్తకులు వ్యాపార నిమిత్తం (1) తూర్పు కి సముద్రయానం చేయడం గురించి తరచూ చెబుతుంటాయి. వాటిలో చెప్పబడిన పేర్లు గుర్తించటం

అంతగా స్పష్టపడకపోయినా భారతదేశ తూర్పు తీరం - ఆగ్నేయాసియా దేశాల తీరాల మధ్య వర్తకం అద్భుత లాభాలతో వర్తకులను నిరంతరం ఉర్రూతలూగించేదని మాత్రం తెలుస్తుంది. ఈ ప్రాంతాలకు పెట్టిన పేర్లలో - సువర్ణభూమి, సువర్ణద్వీప ఈ భావం ప్రతిబింబిస్తుంది.

క్రీ.శ. 2వ శతాబ్దంలోనే ఈ వర్తక సంబంధాలు సువర్ణద్వీపాలుగా ఆయా ప్రాంతాల్లో భారతీయులు స్థిరపడడానికి జనావాసాలు ఏర్పర్చడానికి దారితీసింది. ఆ తర్వాత క్రమంగా ఆ ప్రాంతాల్లో భారతీయులు తమ రాజకీయ అధికారాన్ని కూడా ఏర్పరచడం జరిగింది.

అశోకుని వ్యక్తిగత చొరవ వల్ల బౌద్ధమతం వ్యాప్తం చేయడానికి అనేకమంది బౌద్ధ సన్యాసులు దేశం (2) వెలుపల తమ ప్రచారాలు ఆరంభించారు. ఈ మతప్రచార కాంక్ష తర్వాతి కాలంలో కొనసాగి, బలపడి అనేకమంది ఆగ్నేయాసియా దేశాలకు చేరడానికి కారణమైంది. తర్వాతి కాలంలో శైవ, వైష్ణవ శాఖల ప్రచారం కోసం కూడా ఈ ప్రాంతాలకు కొందరు ఎందరో ఆచార్యులు చేరినట్లు తెలుస్తుంది.

(3) భారతదేశంలోని రాజ్యాలలో వారసత్వ యుద్ధాలలో ఓటమి పొందిన కొందరు రాకుమారులు

ఈ ప్రాంతాల్లో రాజ్యాలు స్థాపించి తమ కాంక్ష నెరవేర్చుకొని
వారిని ఆగ్నేయాసియా ద్వీపాలకు చేరుకునే వారని తెలుస్తుంది.

# గుప్తుల పరిపాలన

ప్రాచీన భారతదేశంలో మౌర్యుల తర్వాత విశాల సామ్రాజ్యాన్ని పాలించిన గుప్తులు అనేకమంది సామంతుల ద్వారా పాలించినా తమ ప్రత్యక్ష పాలనా ప్రాంతాల్లో అనేకరకాలుగా విలక్షణ పరిపాలనను ఏర్పాటు చేసుకున్నారు.

1) రాజరిక స్వభావము:

గుప్త రాజులు 'పరమభట్టారక', 'పరమదైవత' 'చక్రవర్తి' వంటి బిరుదులు ధరించేవారు. అలహాబాదు ప్రశస్తిలో సముద్రగుప్తుని ధనద, వరుణ, ఇంద్ర మరియు అంతక దైవాలతో సమానుడని చెప్పబడింది. రాజు దైవాంశసంభూతుడిగా భావించబడ్డా నిరంకుశుడు కాడు. స్కంధగుప్త భితరి స్తంభశాసనంలో 'భూమిని జయించాడు, అపరిమిత ప్రజల పట్ల దయతో ఉన్నాడు, తన కీర్తి రోజురోజుకూ పెరుగుతున్నా గర్వపడలేదు, అహంకారం చెందలేదు' అని ఉండటం రాజు తండ్రిలా ఉండాలి అనేదాన్ని సూచిస్తుంది.

రాజ్య పాలన, కార్యనిర్వహణ, న్యాయపాలనలకు అతడే సర్వాధికుడు. సర్వసైన్యాధ్యక్షుడు, యుద్ధంలో సైన్యాన్ని ముందుండి నడిపించాల్సినవాడు. బ్రాహ్మణుల్ని, పండితుల్ని గౌరవించాలి. ఉన్నతాధికారుల్ని నియమించాలి.

రాజు ముఖ్య కర్తవ్యం 'వర్ణ ధర్మాన్ని' రక్షించటం గా భావించేవారు.

తమ సార్వభౌమత్వాన్ని అంగీకరించిన సామంతరాజులు నిరంకుశంగా ఉండవచ్చు, వారి అంతర్గత పాలనలో గుప్తరాజు జోక్యం చేసుకోడు.

2) <u>మంత్రిమండలి</u> - <u>ఉద్యోగులు</u> :

గుప్తుల శాసనాల ద్వారా అధికార క్రమాన్ని స్పష్టంగా తెలియడం లేదు. అయితే మంత్రిమండలి ఒకటి ఉండేదని నిస్సందేహంగా చెప్పవచ్చు. అన్ని ముఖ్య విషయాలలో రాజు తన అధికారులను లిఖిత రూపంలో ఆజ్ఞాపించేవాడు.

బహుశా మంత్రి పదవి వారసత్వమని చెప్పవచ్చు. ఉదయగిరి శాసనంలో యుద్ధవ్యవహారాల మంత్రి వీరసేన శాబ ఈ పదవిని వారసత్వంగా నిర్వహిస్తున్నాడని పేర్కొనబడింది.

మహా ప్రతీహార - రాజభవన రక్షకుల అధిపతి, ప్రతీహార - ఉత్సవాల నిర్వాహకుడు, దూతక - బహుమానాలు/ దానాల్ని అమలుపర్చేవాడు వంటి ఉద్యోగులు ఉండేవారు.

పౌర, సైనిక పదవులు సాధారణంగా ఒకవ్యక్తి నిర్వహించేవాడు. ఉదాహరణకు హరిసేనుడు 'సంధివిగ్రహిక' (యుద్ధ-శాంతి మంత్రి) గాను మరియు 'కుమారామాత్య' గాను ఉండేవాడు, అదే సమయంలో 'మహాదండనాయక' గాను ఉండేవాడు. (రక్షక భటులాధిపతి మరియు క్రిమినల్ జడ్జి) గాను ఉండేవాడు.

పౌర, సైనిక సేవలకు గానూ అధికారులకు
[illegible] జీతాలిచ్చినా అప్పుడప్పుడు భూందానాలు
కూడా ఇచ్చేవారు.

గుప్తరాజులు సామంతుల ద్వారా అధిక
భాగాన్ని పాలించడం చేత వారికి మౌర్యుల వలెనే
విస్తృత ఉద్యోగ బృందం లేదు, వారు అనేక పదవుల్ని
ఒకరికే ఇవ్వడం వలన కూడా ఉద్యోగుల సంఖ్య అంతగా
పెరగలేదు.

3) పాలనా విభాగాలు:

గుప్త సామ్రాజ్యం పాలనా సౌకర్యం కొరకు
'భుక్తి' లేదా 'భాగ' లేదా 'దేశ' లుగా విభజింపబడింది.
వీటికి రాజకుమారులే పాలకులుగా ఉండేవారు; 'కుమారా
మాత్యులు' భుక్తి స్థాయిలో ఉండే అధికారులు, వీరు
కేంద్రానికి భుక్తికి వారధులుగా పనిచేసేవారు.

(భుక్తి అనేక 'విషయాలు'గా, విషయం
'వీధులు'గా వీధి 'పేథక' లేదా 'సంతకాలు'గా విభజింప
బడేవి.)

భుక్తి అనేక విషయాలుగా విభజింపబడేది, ⓧ
దీనికి 'విషయపతి' అధిపతి. విషయం లో ఒక భాగాన్ని
'వీధి' అనేవారు, [దీనికి ⓧ 'ఆయుక్తక' అధ్యక్షుడు]. కొన్ని గ్రామాల
సముదాయం పేథక లేదా సంతక. గ్రామం లోని భాగాన్ని పస్త
లేదా అగ్రహార అనేవారు.

గ్రామపాలకుడు 'గ్రామిక', గ్రామపాలనలో
గ్రామ పెద్దలు 'మహత్తమ' లేదా 'మహత్తక' కూడా

పాలించుతుండేవారు.

బెంగాలు లోని గుప్తుల శాసనం ద్వారా విషయపతి 'అధికరణ' అనే స్థానిక సంస్థ ద్వారా పాలించేవాడని తెలుస్తుంది. ఈ అధికరణ లో అనేక విభాగాలకు ప్రాతినిధ్యం ఉండేది.

ఉదా: నగరశ్రేష్ఠి - నగర వర్తకుల అధిపతి
ప్రథమ కులిక - వృత్తికారుల నాయకుడు
పుస్తపాల - రికార్డుల ఉద్యోగి మొదలైన వారు.

4) న్యాయపాలన:

గుప్తుల కాలంలో స్మృతి శాస్త్రగ్రంథాలు వివిధంగా వెలువడ్డాయి. పౌర, నేర (Civil and Criminal law) చట్టాలు ఈ కాలం లోనే వేరువేరు గా ప్రత్యేకీకరించబడ్డాయి.

రాజు అత్యున్నత న్యాయాధికారుడు, అతనికి ప్రధాన న్యాయమూర్తి గా 'మహాదండనాయక' ఉండేవాడు. ప్రావిన్సుల్లో ఉపారికులు, జిల్లాల్లో విషయపతులు గ్రామాల్లో గ్రామపెద్దలు న్యాయవిచారణ చేసేవారు.

ఫాహియాన్ రచనల వల్ల శిక్షలు ఉదారంగా ఉండేవని, తీవ్ర నేరాలకు మాత్రమే అంగఛేదన శిక్ష ఉండేదని తెలుస్తుంది. అతను రాజ్యం లో నేరాలు, దోపిడీలు తక్కువేనని రాశాడు.

5) సైనిక పాలన:

గుప్తులు మొదట్లో మంచి సైన్యాన్ని

పాలించారు. సామంతుల నుండి యుద్ధసమయంలో సైనిక సహాకారం అందేది.

రాజే సర్వసైన్యాధ్యక్షుడు. అయితే సంధివిగ్రహిక మంత్రిగా వ్యవహరించేవాడు. ఇతని కింద ఇంకా అనేకమంది అధికారులు - మహాబలాధికృత, పీలుపతి (గజబల అధిపతి) అశ్వపతి, నరపతి మొ॥ ఉండేవారు. 'రణభాండాగారిక' యుద్ధావసరాల ఖర్చులు చూసేవాడు. దాడి, రక్షణ రెండురకాల ఆయుధాలు విరివిగా వాడేవారు.

6) రెవెన్యూ పాలన :

రాజ్యానికి భూమిశిస్తు ప్రధాన ఆదాయం.

సముద్రగుప్తుని కాలంలో నియమితుడైన ఈ అధికారి 'అక్షపటలాధికృత' అనే పదవి నిర్వహించేవాడు. శాఖా గ్రంథాల్లో అన్ని రకాల గణాంకాల్ని, పత్రాల్ని నమోదుచేయడం, రాజ్య బకాయిల్ని వసూలు చేయడం, మోసాల్ని అరికట్టడం, మోసాలు చేసిన వారి వద్ద నుంచి శిక్షగా పరిహారం వసూలు చేయడం మొ॥నవి ఈ అధికారి విధులు.

'పుస్తపాల' అనే అధికారహోదా కార్యకలాపాల్ని/ లావాదేవీలను గ్రంథస్థం చేసేందుకు విచారణ చేయడానికి ఉద్దేశించబడింది.

గుప్తులు భూమిని సర్వే చేయడానికి, కొలవడానికి మరియు భూమిశిస్తు వసూలు కు ప్రత్యేక శాఖ విభాగాన్ని ఏర్పాటు చేశారు.

కాళిదాసు రచనలు, నారదస్మృతి మొ॥ వంటిలో $\frac{1}{6}$ వ వంతు రాజుకు (state) భూమిశిస్తుగా చెల్లించాలని చెప్పారు.

భూమిశిస్తు గాక వృత్తాలు, సుంకాలు మొ॥ వాటి మీద 'ఉపరికార' or 'ఉపరిక్తరి' అనే శిస్తును ఒక నగరం నుండి మరొక నగరానికి తీసుకెళ్ళేప్పుడు విధించేవారు. వర్తకుల సంఘాలు విక్రేత వాణిజ్య పన్ను 'మల్య' కట్టాలి, లేకపోతే వారి వాణిజ్యహక్కులను రద్దు చేసి అసలు శిస్తు కు ఎనిమిది రెట్లు శిస్తు విధించేవారు.

రాజులకు వెట్టిచాకిరి 'విష్టి' పొందేందుకు, 'బలి' అదనపు కానుకలు పొందేందుకు హక్కు ఉంది. రాజభూములు మరియు అడవుల నుండి వచ్చే ఆదాయం రాజు వ్యక్తిగత ఆదాయంగా పరిగణించేవారు.

రాజ భాండాగారానికి నిధులు, గనులు, ఉప్పు తయారీ మొ॥ వాటిపై హక్కు ఉంది.

గుప్తుల పాలన స్వభావాన్ని గూర్చి వివరిస్తూ ఆర్.ఎన్. సాల్టోర్, వారి పాలన ఆనందదాయకమైంది, ఉదారమైంది అని చెప్పారు. అది నియంతృత్వం కాదు, రాజు మంత్రులతో, అధికారులతో అధికారం పంచుకునేవాడు; అనేక కేంద్రాల్లో అధికారం బదలాయించబడింది. ప్రజాసంక్షేమం, మానవత్వాల మీద ఆధారపడిన జ్ఞానవంతమైన పాలన వారిది. గుప్తుల పాలన ప్రజలకు విదేశీ దాడుల నుండి అంతర్గత పరిపాలన నుండి రక్షణ, భద్రతలను అందించింది ఎ.ఎస్. ఆల్టేకర్ పండితుడు అభిప్రాయపడ్డాడు.

## Additional points

* గుప్తులు పెద్దకొడుకు చక్రవర్తి కావడం వంటి నిర్దిష్ట వారసత్వ సూత్రమేదీ అనుసరించినట్లుగా కనబడదు. చక్రవర్తి సమర్థుడైన కొడుకును వారసుడిగా ప్రకటించే విధానం కన్పిస్తుంది.

## * Changes in Political Organisation *

— వెయ్యేళ్ళ పాటు భారత రాజకీయాల్లో ముఖ్యభాగంగా ఉన్న గణరాజ్యాలకి గుప్తసామ్రాజ్య ఆవిర్భావంతో చావుదెబ్బ తగిలింది. బయట నుంచి విదేశీ దాడులు, అంతర్గతంగా సామ్రాజ్యాల వృద్ధి గణరాజ్యాల అంతానికి ప్రధాన కారణాలు.

— రాజు ప్రజల్ని రక్షిస్తాడు కాబట్టి ప్రజల నుండి శిస్తు పొందడానికి అర్హుడు అనే భావాన్ని గౌరవించినా దాన్ని అంతగా పట్టించుకోలేదు. పైగా కాత్యాయనుడు రాజు భూమికి యజమాని కాబట్టి శిస్తు పొందడానికి వాటా ఉందని చెప్పాడు. ఈ భావన రాజ్యానికి ఫ్యూడల్ స్వభావాన్ని కలిగిస్తుంది. భూదానాలు చేసే వీలును కల్పిస్తుంది. అయితే శాసనాల భూదానం వల్ల ప్రభావితమయ్యే ప్రజల్ని సంప్రదించటం, వారికి తెలియబరచటం చేసేవారు.

— మునుపటి కాలంతో పోలిస్తే గుప్తుల చక్రవర్తి అధికార పరిమితులకు లోనైనట్లు తెలుస్తుంది.

. న్యాయ వ్యాఖ్యాతలుగా బ్రాహ్మణులు

- వర్తక శ్రేణుల సంప్రదాయాల్ని గౌరవించాలి
- భూదానాలు పొందినవారు, సామంతులు మరియు అధికారాలు కలిగి ఉండేవారు - వీరి తో సఖ్యతగా ఉండాలి.
- అనేక పదవులు ఒక్కడే నిర్వహిస్తున్న పక్షం లో అందులోనూ ఆటవి అధికారం వారసత్వమైతే అట్టి ప్రభుత్వోద్యోగులు .... వీరందరూ చక్రవర్తి అధికారం పై అడ్డుకట్టలే.

— గుప్తుల కాలంలో కుమారామాత్య, సంధి విగ్రహిక పేర్లు కొత్త గా కన్పిస్తాయి.

కుమారామాత్యులు ఉన్నత హోదాల్లో నియమింప బడేందుకు అర్హతగల ఉద్యోగులు (chief cadre). వీరు 'కుమారామాత్యాధికరణ' అనే క్రమ పదవి నిర్వర్తించేవారు.

గుప్తుల కాలంలో యుద్ధాలు పెరగడం వలన కాబోలు, యుద్ధవ్యవహారాల మంత్రి గా 'సంధివిగ్రహిక' ఏర్పడి ఉంటాడు.

— ఉద్యోగుల నియామకం లో కులము, కుటుంబము ముఖ్యంగా పరిగణించేవారు.

— ఉద్యోగుల పదవి వారసత్వం కావడం, క్రమంగా జీతాలు బదులు భూములు కేటాయించబడటం వలన మౌర్యుల కాలం కంటే ఉద్యోగులు చాలా సులభంగా స్వార్థపరత్వం నెరపవచ్చు.

— గుప్తుల సైన్యం లో అశ్వకదళాల & ప్రాధాన్యత బాగా పెరిగింది. ఇది గుప్తుల నాణేలు, శాసనాల ద్వారా తెలుస్తుంది. వారి నాణాల్లో అశ్వపతి, మహాశ్వపతి,

భటాశ్వపతి మొ॥ పేర్లు కన్పిస్తున్నాయి.

— కౌటిల్యుడు అర్థశాస్త్రం లో పేర్కొన్న శిస్తుల జాబితాలో గుప్తుల శాసనాల్లో కన్పించే శిస్తుల కంటే చాలా ఎక్కువ ఉన్నాయి. బహుశా గుప్తుల కాలంలో శిస్తుల భారం తక్కువ ఉండవచ్చుని ఇది తెల్పుతుంది. భూమిశిస్తు కూడా పంట లో $\frac{1}{6}$ వ వంతుగానే కన్పిస్తుంది. గుప్తుల కాలంలో అత్యవసర పన్నులేవీ విధించినట్లు తెలియలేదు. గుప్తులు మౌర్యుల్లాగా విస్తృత ఉద్యోగ బృందాన్ని నిర్వహించలేదు కాబట్టి వారికి అధిక సుంకాల అవసరం కూడా కన్పించదు.

— సామంతులు భూమిశిస్తు ధాన్యరూపంలో చెల్లించేవారు
→ ఔద్రంగిక అనే అధికారి వసూలు చేసేవాడు.

ధనిక రైతులు ధనరూపంలో చెల్లించేవారు →
హిరణ్యసముదాయిక.

— ప్రతి 'విషయం' (జిల్లా) లో అవసరమైతే పౌరపాలనకి సాయం చేయడానికి సైనిక బలగాలు ఉండేవి.

— భుక్తి (ఉపారిక)
↓
విషయం (విషయపతి – అధికరణ – అష్టకులాధికరణ
↓
వీధి
↓
గ్రామం — అష్టకులాధికరణ

— గుప్తుల కాలంలో 3,4 శతాబ్దాల ప్రాంతంలో తెలియని ప్రభావం మొ॥ ప్రవేశపెట్టబడ్డాయి. అందువల్ల ఈ సాంఘిక అలజడి కారణంగా రాజ్యం యొక్క లిఖిత వ్యవస్థ బాగా అవసరమై ఉంటుంది. ఈ కాలంలో శాంతిభద్రతలకై అనేక పదవులు ఏర్పడ్డాయి. 'దండనాయక' 'దండిక' 'దండపాశిక' మొ॥వి. వీరందరూ పోలీసు మరియు మెజిస్ట్రేటియల్ విధులు నిర్వహించేవారు.

— క్రీ.శ. 5వ శతాబ్దం వరకు భూదానాలు చేసిన ప్రాంతం లో గనుల మీద రాజాధికారం, నేరస్థుల్ని శిక్షించటం మొ॥ రాజ్య సార్వభౌమాధికారాలు గుప్తచక్రవర్తి వద్దనే ఉండేవి, కాని ఆ తర్వాత కాలంలో వీటిని కూడా బదలాయించడం జరిగింది.

— క్రమంగా కప్పం కట్టి, ప్రణామాలు సమర్పించేందుకు అంగీకరించిన జయించబడిన రాజుల్ని తిరిగి వారి స్థానంలో ప్రతిష్ఠించడం అనే గుప్తరాజుల విధానం వల్ల ఘర్షణల రాజకీయాలు వృద్ధి చెందాయి. (లొబడిన రాజులు) (భూస్వాములు) చక్రవర్తి పట్ల నిర్వర్తించాల్సిన విధులు అలహాబాదు స్తంభ శాసనంలో స్పష్టంగా చెప్పబడ్డాయి.

లొబడిన రాజులను 'సామంత' అనే పదం సముద్రగుప్తుని కాలంలో వాడబడలేదు. శాంతివర్మ (క్రీ.శ. 455-70) కాలం లోని పల్లవ శాసనం లో 'సామంత చూడామణి' అనే పదబంధ ప్రయోగం

ద్వారా 'సామంత' పదాన్ని లొంగిన రాజుకు ప్రయోగించడం
దక్షిణ భారతంలో క్రీ.శ. 5 వ శతాబ్దం తర్వాత నుంచి
జరిగేది తెలుస్తుంది. ఉత్తర భారతంలో ఈ పదం ఇదే
అర్థంలో బెంగాలు శాసనంలో, మౌఖరి అనంతవర్మ వేయించిన
బరాబర కొండగుహా శాసనంలోనూ కన్పిస్తుంది. అనంతవర్మ
తన తండ్రిని 'సామంత చూడామణి' గా పేర్కొన్నాడు.
క్రమంగా సామంత పదాన్ని ఓడించిన / ఓడించబడిన
రాజులకే గాక రాజోద్యోగులకు కూడా వాడటం జరిగింది.
కాలచూరి-చేది శకం లో రాయబడిన ఈ శాసనాల ద్వారా
క్రీ.శ. 597, 8 తర్వాత నుంచి రాజులు మరియు సామంతులు
ఉపాధులు మరియు కుమారామాత్యుల స్థానాన్ని పొందడం
కన్పిస్తుంది.

## గుప్తుల పాలన & మౌర్యుల పాలన మధ్య భేదాలు

1) గుప్త చక్రవర్తి మౌర్య చక్రవర్తి అంతటి విస్తృతాధికారాలు చెలాయించలేదు.

2) గుప్తుల సైన్యం, ఉద్యోగి బృందం, సుంకాల లేదా శిస్తువిధానం మౌర్యుల అంతటి విస్తృతమైనవి కావు.

3) గుప్తులు గ్రామీణ మరియు పట్టణ ప్రాంతాలలో మొదటిసారి పద్ధతికల ప్రాంతీయ మరియు స్థానిక పరిపాలనను ఆరంభించారు. దీంతో భూమి మరియు సైనిక మరియు వృత్తిపరమైన ఆస్తులు ముడిపడి

ఉన్నాయి.

ఈ యుగం లో గ్రామపరిపాలన (అసన్నత్వగా) విస్తారంగా అత్యంత ప్రాధాన్యాన్ని సంతరించుకోవడం గమనిస్తాం. ఉద్యోగి బృందాన్ని తగ్గించివేయడానికి దీన్ని సహజ పరిణామంగా పరిగణించవచ్చు.

4) స్థానిక పాలన లో నగర-భద్రతల పరిరక్షణ, న్యాయపాలన [illegible] మౌర్యుల కాలం కంటే చాలా ఉన్నతంగా వ్యవస్థీకరించబడ్డాయి.

మొత్తం మీద గుప్తుల కాలంలో పాలనలో విలక్షణ ఫ్యూడల్ లక్షణాలు మనం గమనించవచ్చు, తర్వాతి కాలంలో పూర్తి ఫ్యూడల్ నిర్మాణానికి ఇవి బాటలు పరిచాయి.

5) మౌర్య చక్రవర్తుల లేని విధంగా గుప్త చక్రవర్తులు (ఆర్భాటంగా) 'మహారాజాధిరాజ' 'పరమేశ్వర' వంటి బిరుదులు ధరించారు. అనేక సామంతరాజులపై తమ ఆధిపత్యాన్ని సూచించేలా వారు ఈ బిరుదులు ధరించి ఉంటారు. కొందరు ధాపర ఈ కాలం లో ఇలాంటి బిరుదుల్ని ధరించడం 'ఫ్యూడల్' గా ఉండి ఉంటుందని అభిప్రాయపడ్డారు. ఉదా. ఒరిస్సా & బెంగాల్ బౌద్ధ రాజులు భౌమకార వంశస్థుల తమను 'పరమోపాసక' గా అభివర్ణించుకున్నారు. వీరితో పాటు రాజు లు 'హోదా' కల్పించేందుకు గాను బ్రాహ్మణులకి 'మహాదానాలు' చేసేవారు, వైదిక బ్రాహ్మణుల్ని ప్రోత్సహించి యాగాలు చేసేవారు.

* స్థానిక పాలనా సంస్థలే విధాన సంబంధమైన లేదా సన్నివేశ సంబంధమైన నిర్ణయాలను తామే తీసుకునేవి. కేంద్ర అధికారం యొక్క విధానాలతో సంబంధం లేని నిర్ణయాల్ని వీళ్లే తీసుకునే వారు.

* ప్రతిరోజు నిరంతరం రాజ్యంలోని ప్రజల, పాలనా వివరాలు తెలుసుకొనేవాడు. కాని గుప్త చక్రవర్తులు ఈ వివరాల్ని అధికంగా కుమారామాత్యులు, ఆయుక్త వంటి ఉద్యోగులకి వదిలివేయడం కన్పిస్తుంది. అధికారులు బహుశా ఎక్కువ పదవులు చేపట్టి గుప్తుల పాలన ఎక్కువగా వికేంద్రీకరించబడినట్లు కన్పిస్తుంది.

* గుప్తుల కాలంలో నగర పాలనలో కన్పించే సంఘాలు, మెగస్తనీసు - కౌటిల్యుడు చెప్పిన నగరపాలక సంస్థలు భిన్నమైనవి. మౌర్యుల కాలంలో ప్రభుత్వమే వాటిని నియమించేది, కాని గుప్తుల కాలంలో ఇవి స్థానిక ప్రతినిధులతో ఏర్పడేవి.

* మౌర్య ప్రభుత్వం ప్రధానంగా అమలులో ఉన్న ఆర్థికవ్యవస్థనుంచి ఆదాయం వసూళ్ల పట్ల దృష్టి పెట్టింది. లేదా రైతుల వ్యవసాయాన్ని ప్రభుత్వ శాస్త్రంతో ప్రాప్తి చేసేందుకు ఉపక్రమించింది.

కాని గుప్తుల ప్రభుత్వం, దాని సమకాలికులు వ్యవసాయ ఆర్థిక వ్యవస్థని పునర్నిర్మించేందుకు ఆరంభయత్నాలు చేశారు. దీని ఫలితం గానే భూదానాలు పొందిన వ్యక్తులు కొత్తగా ప్రాంతాల్లో వ్యవసాయం ప్రోత్సహించాలని కోరుకునేవారు. కొత్త గ్రామాల్ని ఏర్పరచడం కంటే ఉన్న వర్గాలనే

[illegible] [illegible] పై అధిక ఆసక్తి కనబరిచారు. [illegible]
చేయడం ద్వారా భూదానాలు చేయడమే రాజరిక మద్దతుకు
ఎక్కువ సమర్థమైంది గా భావించడం, భూదానాన్ని
'మహాదానం' గా తలచడం ద్వారా ప్రోత్సహించారు.
రాజు యొక్క పెట్టుబడి సారవంతమైన భూముల సాగును
వృద్ధి చేయడానికి, బంజరు భూముల్లో జనావాసాల్ని ప్రోత్సహించ
డానికి ఉద్దేశించ బడినవి.

క్రమంగా ప్రభుత్వం వ్యవసాయ జనావాసాల్ని
ఏర్పరచడం పై ప్రాధాన్యత తగ్గి భూదానాలు పొందిన వారు
ఆ భారం తీసుకోవాలని తలచడం పెరిగింది.

* వర్తకుల వాణిజ్య వృద్ధి కేవలం బాటసారుల, కూలీలకు మాత్రమే
పరిమితమైంది, వీరిని పర్యవేక్షించడానికి ఒక అధికారి ఉండేవాడు.
కాని గుప్తుల వాణిజ్య వృద్ధి అగ్రహారాల పాలకులకి విస్తరించ
డమే గాక అగ్రహారాల పనులను కూడా వృద్ధి కిందకి తేవడం జరిగింది.

# పల్లవులు ఎవరు ?

దాదాపు క్రీ.శ. 600 ప్రాంతంలో కలభ్రులనోడించి కంచి రాజధానిగా దక్షిణ భారతంలో వెలుగుచూసిన ప్రముఖ రాజవంశీయులే పల్లవులు.

పల్లవుల జన్మం, జన్మస్థలం గురించి చాలా సిద్ధాంతాలున్నాయి.

1) లూయిస్ రైస్ పర్షియన్లలో ఒక శాఖ అయిన పహ్లావుల వారసులే పల్లవులని అంటాడు. 'పహ్లావ' 'పల్లవ' శబ్ద సామ్యం ఇతని వాదనకు ఆధారం. 'పహ్లావ' యొక్క సంస్కృతీకరణ రూపమే పల్లవ అని ఇతని ఉద్దేశం.

2) శ్రీనివాస అయ్యంగార్ పల్లవులు నాగ వంశీయులంటారు. 'మణిమేఖలై' లో చోళ-నాగ సంబంధం ఫలితంగా తొండైయారు జన్మించినట్లు ఉంది. కదంబ కాకుత్సవర్మ వేయించిన తాళగుండ శాసనం లో నాగులతో సంబంధం పల్లవుల పుట్టుకకు దారి తీసిందని ఉండడం దీన్ని బలపరుస్తుంది.

3) కె.పి. జయస్వాల్ పల్లవులు వాకాటకుల్లో ఒక శాఖ అని భావించారు.

4) సత్యనాథయ్యర్ అనేక గ్రామాలు, స్థానికంగా ఉన్న పులినాడు, పులియూర్, మొ॥ తొండైమండలం లోని పేర్ల ఆధారంగా పల్లవులు పుళిందులని అభిప్రాయపడ్డారు.

5) కె. ఎ. నీలకంఠ శాస్త్రి, ఆర్. గోపాలన్, సి. మీనాక్షి

మొదలగు వారు పల్లవులు ఆంధ్రులు అంటారు. పల్లవుల తొలి శాసనాలు తూర్పు ఆంధ్రప్రదేశ్ లో దొరకడం, వారి తొలి సంబంధాలన్నీ ఆంధ్ర ప్రాంతంతోనే ఉండడం, మొదలగు ఆధారాలు. బహుశా వారు మొదట శాతవాహనుల సామంతులుగా ఉండి కంచిని రాజధానిగా స్వతంత్రులై ఉంటారని అన్నారు.

6) ఆర్. రాఘవ అయ్యంగార్, ఎస్. కృష్ణస్వామి అయ్యంగార్

పల్లవులు తమిళులంటారు. మణిమేఖలై లో తిరుమంగై ఆళ్వార్ వారిని పల్లవులని తమిళ పేరుతో 'తొండైయార్' అని పిలుస్తారు.

ఏదేమైనా పల్లవులు ఎవరన్నది ఇంకా వివాదాస్పదంగానే ఉన్నది.

## చాళుక్యుల పాలన

చాళుక్యుల పాలన నాటి ప్రభుత్వాల సాధారణ లక్షణాలు కలిగి ఉంది. రాచరిక ప్రభుత్వం ఉండేది. రాచరికం సాధారణంగా వారసత్వమే. పెద్దకొడుకు సాధారణంగా రాజయ్యేవాడు. ఈ సూత్రం పాటించనప్పుడు వారసత్వయుద్ధం జరిగేది. వారసుడు బాలుడు కావడం తో సింహాసనాన్ని ఆక్రమించాలని అతని సంరక్షకుడు యత్నించడం చాళుక్యుల చరిత్ర లో జరిగింది. పెద్దకొడుకును 'యువరాజు' గా వ్యవహరించేవారు. మంచి చదువు, యుద్ధవిద్యల్లో యువరాజు, రాకుమారులకు శిక్షణ ఇవ్వటంలో చాలా జాగ్రత్తలు తీసుకునేవారు. దేశపాలన లో రాణులు అప్పుడప్పుడు మంచి ఆసక్తి చూపేవారు. రాజు ఆడంబరంగా ధరించే 'మహారాజాధిరాజ' 'పరమేశ్వర' 'పరమభట్టారక' మొ॥ బిరుదులు ధరించేవాడు.

రాజు తన అధిక సమయాన్ని రాజకార్యనిర్వహణలో గడిపేవాడు. రాకుమారులు, మంత్రులు, రాజబంధువులు మొ॥ వారితో నిండిన వైభవోపేతమైన ఆస్థానాన్ని రాజు నిర్వహించేవాడు. తన వద్దకి వచ్చిన విజ్ఞాపనలకి బదులుగా ఆజ్ఞలు జారీచేసేవాడు, ఇవి లిఖించబడి 'రాజశాసనం' గా పిలువబడేవి.

సిద్ధాంతంలో రాజు నిరంకుశాధికారి. కాని ఆచరణలో దీన్ని మార్చే కొన్ని అవకాశాలుండేవి. పాలన బాధ్యతలు నిర్వహించే రాజకుటుంబ సభ్యులకు కొంత విధానాల్లో ప్రభావితం చేయగల ప్రతిపత్తి ఉండేది. ప్రజల అభిప్రాయాలు సాంఘిక, ఆర్థిక, మతాచారాల్లో మార్పులు రాజు చేసేది కాదు, తన వద్ద ప్రజావిజ్ఞాపనలు వచ్చిన వివాదాల సందర్భాల్లో తప్ప ఇలాంటి విషయాల్లో జోక్యం చేసుకునేవాడు కాదు.

ప్రజల స్వాతంత్ర్య వ్యవహారాల్ని స్థాన, కులం, వృత్తి, మత మొదలైన
వాటి ఆధారంగా ఏర్పడిన (స్వచ్ఛంద) స్వతంత్ర సంఘాలు చూసేవి.
ఈ సంఘాలు సాధారణంగా ప్రాచీన ఆచార సంప్రదాయాలు
పాటించేవి. రాజు ముఖ్యవిధి ప్రజల్ని వివిధ బయటి,
లోపలి ప్రమాదాలనుంచి రక్షించడం గా ఉండేది. రాజ్యం లోని
సామంతులు కూడా రాజు అధికారానికి లోబడి ఉన్నవాళ్ళే.

రాజు ఆ సామంతుడి పదవుల్లో 'మహా సంధి
విగ్రహిక' అనేది చాళుక్య శాసనాల్లో తరచూ కన్పించే పదం.
ఇతడు విదేశాంగ మంత్రి. చాళుక్యులకి ముగ్గురు ప్రధానమైన
సైనికాధికారులు – 'బలాధికృత', 'దండనాయక', మరియు
'మహాప్రచండ దండనాయక' ఉండేవారు. అమాత్యులు
రాజ్య ఆదాయ విషయాలు చూసేవారు.

చాళుక్య సామ్రాజ్యం లో రెండు భాగాలుండేవి.
రాజు ప్రత్యక్ష పాలన లో ఉండేవి, తక్కినవి సామంతులచే
పాలింపబడేవి. సామంతుల హోదా, హక్కులు ఒకరి నుండి
ఒకరికి మారుతుండేవి. చాళుక్యుల రాజ్యం లో అనేకమంది
సామంతులు ఉండడం బట్టి వారు కలిగిన రాజ్యాల్లో రాజు
వారి సార్వభౌమత్వాన్ని అంగీకరిస్తే వారిని ప్రతిష్ఠించే విధానం
కొంతవరకూ అవలంబించి ఉంటారని అనిపిస్తుంది. ఈ రాజులు
సామంతులు, మహాసామంతులు గా చెప్పుకునేవారు. యుద్ధాలప్పుడు
సైనిక సాయం, కప్పం చెల్లించటం, ప్రణామాలు సమర్పించటం
– మొ॥ నిర్వహించి సామంతులు అంతర్గతంగా మంచి

స్వేచ్ఛను పొందేవారు. సామంతుల విధేయతలను పొందేందుకు చాళుక్య రాజు ప్రతినిధి వారి రాజ్యాల్లో ఉండేవారు.

చాళుక్యుల సామ్రాజ్యం పాలనా సౌలభ్యం కోసం ప్రాంతీయంగా విభజింపబడింది. 'రాష్ట్ర', 'విషయాలు' రెండు రకాల విభాగాలుగా ఉన్నాయి, ఒకటి రెండోదాని కంటే పెద్దది. రాష్ట్రపతులు సాధారణంగా ప్రాంతాలకు పాలకులుగా ఉండేవారు. విషయాలకు అధిపతి విషయపతి. భోగపతి అధ్యక్షతన 'భుక్తి' అనే స్థానిక విభాగాలు ఉండేవి. గ్రామం పాలన లో అత్యల్ప విభాగం. 'గ్రామభోగి' లేదా 'గవుండాలు' గ్రామాలకు అధిపతులుగా ఉండేవారు. వీరు రాజు చేత నియమింపబడేవారు. వీరు accountants 'కరణాలు' మరియు అధికారుల నుండి సాయం పొందేవారు. రాజ అధికార్లు తరచూ దఫ్తర్ల బంధించేందుకు, ఉప్పు లెక్కించేందుకు మరియు వారి కోసం గ్రామాన్ని తరచూ సందర్శించేవారు.

గ్రామాలు, నగరాలు ప్రత్యేక స్థానిక సంస్థలతో పాలింపబడేవి. అయితే వీటిపై (ప్)భూస్వామ్యాధికారుల ప్రభావం అధికంగా ఉండేది. చాళుక్యుల స్థానిక పాలనలో పట్టణాల స్థానిక పాలన లో ఉన్నత వర్తకుల కలుగజేసుకునేట్లు ఇప్పించారు.

రాజ్యానికి భూమిశిస్తు ప్రధాన ఆదాయం.
ప్రజలు అనేక ప్రత్యక్ష, పరోక్ష పన్నులు చెల్లించేవారు. ఇళ్ళు, వృత్తులు కూడా పన్నులకు గురి అయ్యేవి. మార్కెట్టు బజారులు, టోలుసుంకాలు వర్తకుల నుంచి వసూలు చేసేవారు. నేరస్థులపై విధించే జరిమానాలు రాజ్యానికి మరో మంచి ఆదాయం. ప్రజలు అధికంగా పన్నులకు గురయ్యారని చెప్పవచ్చు. భూమిశిస్తు ధాన్యరూపం లో

వసూలు చేసేవారు. సైన్యం, ప్రభుత్వోద్యోగులకు జీతాలు, ప్రజాకార్యక్రమాలు, మత దానాలు మొ॥నవి ప్రధాన ఖర్చులు.

## చాళుక్యుల సాహిత్యం :

ఐహోలు శాసనం కాళిదాసును అనుసరిస్తూ రచించబడిన రవికీర్తి యొక్క గొప్ప సాహిత్య సృష్టి. మరో గొప్ప సంస్కృత ప్రతిభాశిల్పం విజయాంక, తనను ఆమె "నీల సరస్వతి"గా చెప్పుకుంది. సాహిత్యంలో ఆమె కాళిదాసుకు మాత్రమే ద్వితీయురాలు. పులకేశి II కుమారుడైన చంద్రాదిత్యుని భార్య విజయ-భట్టారిక యే విజయాంక అని కొందరు చరిత్రకారుల అభిప్రాయం. పూజ్యపాద సంస్కృతంలో వైద్యశాస్త్రం పై 'కల్యాణకారక' గ్రంథం రచించాడు. కన్నడ భాష బాగా వర్ధిల్లింది. శ్రీవర్ధదేవ అనే తుంబులూరాచార్య, ఇతడు 'తత్వార్థమహాశాస్త్రం' మీద 96,000 శ్లోకాలతో 'చూడామణి' అనే పేరుతో రాసిన వ్యాఖ్యానం కన్నడంలో అద్భుత సాహిత్య రత్నం గా పేర్కొనబడింది. మరో గొప్ప కవి శ్యామకుండాచార్య. వీరిద్దరూ జైనులే. అగ్రహారాలు విద్యాకేంద్రాలు గా విలసిల్లేవి.

# రెండవ పులకేశి వరకు చాళుక్యుల చరిత్ర

underlines చదివితే చాలు

<u>చాళుక్యులు వాకాటకుల శిథిలాలపై తమ రాజ్యాన్ని నెలకొల్పారు.</u> బాదామి నుంచి మొదలిడి వారు ఉత్తరాదిన నడిచి నాసిక్ దాకా పశ్చిమ ప్రాంతాలు, ఎగువ గోదావరి ప్రాంతాలు ఆక్రమించారు, ఇవి ముందు వాకాటకుల అధీనంలో ఉండేవి. క్రీ.శ. 6 వ శతాబ్దంలో చాళుక్యులు ప్రాధాన్యం సంపాదించారు.

<u>చాళుక్యుల</u> <u>పుట్టుక</u>:

చాళుక్యుల పుట్టుక చెప్పడానికి అనేక సిద్ధాంతాలున్నాయి.

1) కొందరు వారు <u>విదేశీయులన్నారు</u>. 'చాళుక్య' 'సెల్యూకియ' పదాల సామ్యం ద్వారా వారు సెల్యూసిడ్లని అన్నారు. చాళుక్యులకు పల్లవులకు మధ్య జరిగిన యుద్ధాలు, వీరి ప్రకారం, సెల్యూసిడ్ మరియు అర్సిడ (పార్థియన్లు) లకు టైగ్రిస్-యూఫ్రటీస్ నదీ తీరాలపై జరిగిన యుద్ధాలకి దక్షిణ భారతంలో కొనసాగింపే. ఇది పల్లవులు పార్థియన్లని నమ్మిన వాదంపై ఆధారపడింది.

2) కొందరు చాళుక్యులు <u>స్వదేశీయులే</u> అన్నారు. బిల్హణుని 'విక్రమాంకదేవచరిత' లో చాళుక్యులు చంద్రవంశీయులని అయోధ్య వాసులని చెప్పబడింది. 'చాళుక్య' పదాన్ని అతడు చలుక (దోసిలి) రూపాంతరం అన్నాడు. కలియుగంలో మతభ్రష్టుల్ని అంతం చేసే వీరుల్ని పుట్టించమని ఇంద్రుడు వేడగా బ్రహ్మ సంధ్య వార్చుతూ చాళుక్యులను దోసిలి నించి జన్మనిచ్చాడని అందులో ఉంది. కాని చాళుక్య సంస్కృత పదమే కాదని ఈ వాదన తిరస్కరించబడింది.

3) కొందరు చాళుక్యులు 'గూర్జరులు'గా చెప్పారు.

4) సత్యనాథయ్యర్ వారిని స్థానికులుగా గుర్తించారు.

5) కొందరు చరిత్రకారులు చాళుక్యులు స్థానిక కేనరీస్ ప్రజలేనని

క్షత్రియ వాదాన్ని శివానందమూర్తి అంటారు.

6) హ్యుయాన్‌త్సాంగ్ చాళుక్యరాజు క్షత్రియుడని పేర్కొన్నాడు.

7) మరికొందరు చాళుక్యులు ఒరిస్సాకు చెందిన సూలికులేనని లేదా

సూలీకలు అని అంటారు. కాని సూలీకలకు చాళుక్యులకు

ఏ సంబంధమూ లేదు.

ప్రస్తుతం అనేకమంది పండితులు చాళుక్యులు

గూర్జరుల్లో ఒక శాఖ అనే భావిస్తున్నారు.

## చాళుక్యుల నిజ వంశ స్థాపకుడు పులకేశి I :

(క్రీ.శ. 535 – 566)

రణరాగ, పులకేశి I తండ్రి క్రీ.శ. 6 వ శతాబ్ది

తొలినాళ్ళలో పాలించినట్లు తెలుస్తుంది. పులకేశి అనగా పులి వెంట్రుకలు

కలవాడు లేదా గొప్ప సింహం. క్రీ.శ. 543–44 లో పులకేశి I

బాదామి లో గిరిదుర్గాన్ని నిర్మించి దాన్ని తన రాజధాని చేసుకున్నాడు.

ఇతడు మహారాజ, సత్యాశ్రయ, రణవిక్రమ మొ॥ బిరుదులు ధరించాడు.

'శ్రీ పృథ్వీవల్లభ' గా కీర్తించబడ్డాడు. హిరణ్యగర్భ మహాదాన,

అశ్వమేధ యాగాలు చేసి తన సార్వభౌమత్వాన్ని చాటాడు.

ఇతనికి మనుస్మృతి, రామాయణ, భారతాలపై మంచి అవగాహన

ఉంది.

## కీర్తివర్మ I : (క్రీ.శ. 566 - 98)

పులకేశి I కొడుకు, వారసుడైన ఇతడు గొప్ప విజేత. మహాకూట స్తంభ శాసనంలో మంగళేశుని ఇతడు అంగ, వంగ, కళింగ, మగధ, కేరళ, పాండ్య, చోళియ, ద్రమిల మొ॥ వారిని జయించినట్లు చెప్పాడు. ఇది సంప్రదాయ దిగ్విజయ వర్ణనలోని అతిశయ పొగడ్త మాత్రమే ననిపిస్తుంది. విజయాల కోసం ఇతడు నలులు, మౌర్యులు, కదంబులను ఓడించినట్లు చెప్పింది. నలులు దక్షిణ లో బస్తర్ మొ॥ ప్రాంతాల్ని; మౌర్యులు కొంకణ ప్రాంతాల్ని; కదంబులు ఉత్తర కెనరా ప్రాంతాల్ని పాలిస్తుండేవారు. ఈ విజయాలు చాళుక్య రాజ్య విస్తరణకు తోడ్పడ్డాయి. కొంకణ ను జయించడం తో చాళుక్యులకి గోవా లోని ప్రముఖ ప్రాంతాలపై ఆధిపత్యం దక్కింది. ఇతని చొరవ తో మంగళేశుడు బాదామి లో వైష్ణవాలయాన్ని కట్టించాడు.

క్రీ.శ. 597-98 లో కీర్తివర్మ I మరణ సమయంలో పులకేశి II బాలుడు కావటాన కీర్తివర్మ I సోదరుడైన మంగళేశుడే ప్రభుత్వపాలన స్వీకరించాడు. మంగళేశ సామ్రాజ్య విస్తరణ ఉద్దేశంతో గుజరాతు, ఖాందేష్, మాళ్వాలను ఏలుతున్న కాలచూరి రాజు బుద్ధరాజు ను ఓడించాడు. ఈ విజయం భూమిని ఇవ్వకపోయినా మంచి సంపదలనిచ్చింది. కాలచూరిలు పతనం పొందలేదు. మంగళేశ Mangalesa కొంకణ లోని చాళుక్య గవర్నరు స్వామిరాజు తిరుగుబాటు చేయగా అతన్ని హతమార్చి అతని రాజధాని రేవతీద్వీప ను ఆక్రమించాడు.

మంగళేశుడు తన పాలన చివరలో తన

కొడుకుని రాజుగా చేయదలచడంతో న్యాయబద్ధ వారసుడైన పులకేశి II తన సైనిక సామర్థ్యాలతో కొన్ని మద్దతుదార్ల సాయంతో మంగళేశుని యుద్ధంలో హతమార్చి తనను రాజుగా క్రీ.శ. 609-10 లో ప్రకటించుకున్నాడు.

మంగళేశుడు గొప్ప విష్ణుభక్తుడు, అతని పాండిత్యాన్ని పాలనా సామర్థ్యాన్ని చాళుక్యుల శాసనాలు పొగుడుతున్నాయి.

## పులకేశి II (క్రీ.శ. 610 - 642)

చాళుక్యులందరిలో అగ్రగణ్యుడితడే, ప్రాచీన భారత గొప్ప రాజుల్లో ఒకనిగా చెప్పవచ్చు. అంతర్యుద్ధంతో చాళుక్య సామ్రాజ్య పునాదులు సడలించబడి, అన్నివైపులా శత్రువులు విజృంభించిన అల్లకల్లోల పరిస్థితుల్లో ఇతడు రాజయ్యాడు. కాని అద్భుతమైన శక్తిసామర్థ్యాలు గలవాడై తన రాజ్యాన్ని శత్రువుల నించి కాపాడటమే గాక దానిని దక్షిణాన శక్తివంతమైన రాజ్యంగా ఉంచి, గుజరాత్‌ల్లో శాఖలు స్థాపించగలిగినంత స్థాయికి తీసుకెళ్లాడు.

పులకేశి II విజయాలు అతని ఆస్థానకవి రవికీర్తి రచించిన 'ఐహోలు శాసనం' లో ఉన్నాయి.

- ఒక సైనికాధికారి అప్పాయిక తిరుగుబాటును భీమరథి నదికి ఉత్తరాన జరిగిన యుద్ధంలో అణిచివేశాడు. గోవిందను (అప్పాయిక వర్గం వాడు) లోబరచుకున్నాడు.
- కదంబుల రాజధాని బనవాసి ని ఆక్రమించాడు.
- దక్షిణ కెనరాలోని అలూపులు, తలకాడ్ లోని గాంగులు తన సార్వభౌమాధిపత్యాన్ని గుర్తించేలా చేశాడు. దుర్వినీత,

గాంగల రాజు తన కుమార్తెను పులకేశి కిచ్చి వివాహం చేశాడు.

- పశ్చిమ సముద్రానికి లక్ష్మి గా చెప్పబడే ఎలిఫెంటా దీవుల్లోని మౌర్యుల రాజధాని 'పురి' ని లొబరచుకున్నాడు. దీని కోసం పులకేశి వందల పడవలను వాడినట్లుగా తెలుస్తుంది.
- అందరిలోనే లాటలు, మాళవులు, మరియు గూర్జరులు అతని అధిపత్యాన్ని ఇష్టపూర్వకంగా అంగీకరించి హర్షుని నుంచి తమకు రక్షణ కల్పించమని కోరారు.

ఈ విజయాలన్నింటి వలన పులకేశి II కి మూడు మహారాష్ట్రుల భూభాగం లభించిందని, అందులో 99,000 గ్రామాలు ఉండేవని శాసనం చెప్తుంది. హ్యుయాన్‌త్సాంగ్ చాళుక్య రాజ్యాన్ని 'మహారాష్ట్ర' గా పేర్కొన్నాడు. ఇక్కడ చెప్పబడిన మూడు రాజ్యాలు బహుశా మహారాష్ట్ర, కర్ణాటక మరియు కొంకణ.

హర్షుని పై విజయం :

రెండవ పులకేశి విజయాల్లో ఇది అత్యుత్కృష్టమైంది. కీలత్ ఈ యుద్ధం క్రీ.శ. 620 లో జరిగిందన్నారు. ఈ యుద్ధానికి హర్షుని ఆక్రమణకారి విధానమే కారణమై ఉండవచ్చు. యుద్ధం జరిగిన ప్రాంతంపై చరిత్రకారుల్లో ఏకాభిప్రాయం లేదు. నర్మదకి ఉత్తరాన జరిగిందని తెలుస్తున్నారు. హర్షునిపై విజయసూచకంగానే పులకేశి II 'పరమేశ్వర' బిరుదు ధరించాడని శాసనంలో ఉంది. ఈ యుద్ధంలో హర్షుడు ఘోర ఓటమి పొందడం జరగలేదని కేవలం నిలువరించబడ్డాడని

పులకేశి II వారసులు ఈ విజయాన్ని కొనసాగించి అభివర్ధించారని శాసనాః చరిత్రకారులు కొందరు భావిస్తున్నారు.

బనవాసి, అలుపలు, మాళవాలు, గుర్జరులు చాళుక్యుల రక్షణలోకి వెళ్ళడం వారసుని కెప్పగట్టే ఉంటుంది.

<u>తూర్పు దక్కను లో ఆధిపత్యం :</u>

వారసుని పై విజయానంతరం పులకేశి II తూర్పు దక్కను పై తన దృష్టి సారించాడు. తన సోదరుడు విష్ణువర్ధనుడిని రాజధాని కి రక్షకుని గా ఉంచి తాను <u>తూర్పుదక్కను లో విస్తృత దండయాత్ర చేశాడు.</u>

- <u>దక్షిణ కోసల, కళింగ అతని వశమయ్యాయి.</u>
- <u>పిష్టపుర ను దాడిచేసి ఆక్రమించాడు.</u>
- కునాల (<u>కొల్లేరు) సరస్సు లోని ద్వీపం ను కూడా కొల్లాయుద్ధం తర్వాత జయించాడు.</u>
- <u>విష్ణుకుండినుల అధికారం అణచబడింది.</u>

<u>ఈ విజయాల తర్వాత 'విష్ణువర్ధనుని' ఈ ప్రాంత చాళుక్య రాజప్రతినిధి గా నియమించాడు. అతడు తర్వాత</u> (పులకేశి II) <u>అనుమతి తో స్వతంత్ర తూర్పుచాళుక్య వంశాన్ని స్థాపించాడు.</u>

<u>పల్లవుల తో ఘర్షణ :</u>

ఈ కాలంలో పల్లవులు విష్ణుకుండినుల రాజ్యానికి రక్షణగా వుంటుండేవారు. విహారాలు నాశనం

పల్లవ రాజు, చాళుక్య సేనలు తన ప్రతిష్ఠను దిగజార్చడంతో కంచి గోడల వెనుక అదృశ్యమయ్యాడని తెల్పుతుంది. ఈ పల్లవ రాజు మహేంద్రవర్మ I గా చెప్పవచ్చు. విస్తరిస్తున్న 'ఐహొలు' అధికారం, శక్తి పులకేశి II ని అసూయ కలిగించి ఉండవచ్చు. పల్లవ రాజు పై విజయం ద్వారా పులకేశి II వారి రాజ్య ఉత్తర ప్రాంతాలు పొందాడు. అయితే పల్లవుల 'కసక్కుడి ఫలకం' లో మహేంద్రవర్మ I 'పుల్లలూరు' వద్ద అనేక మంది శత్రువుల్ని నిర్మూలించినట్లు గా ఉంది. కొందరు పుల్లలూరు వద్ద ఓడించ బడింది పులకేశి II యే నని అంటారు. కాని ఇతరవంశీయులు ఈ శాసనం ముఖ్య శత్రువులు గురించి మాట్లాడుతుంటే కాని 'శత్రువు' గురించి కాదు పులకేశి II ఓటమి పొందలేదని అంటారు. అదీగాక ఓటమి పొందినట్లయితే (నట్లు అంగీకరిస్తే) పులకేశి II కావేరి ని దాటి ముందుకెళ్ళడం, చోళ, పాండ్య, కేరళులతో అతని స్నేహసంబంధాల్ని ఏర్పరచటం కష్టమౌతుంది. చాళుక్యుల దండయాత్ర పల్లవుల శక్తి ని తాత్కాలికం గా బలహీన పర్చింది.

క్రీ.శ. 630 నాటి 'లోహనేర దాన శాసనం' లో పులకేశి II తూర్పు, పశ్చిమ సముద్రాధిపతి గా వర్ణించ బడటం అరేబియా, బంగాళా ఖాతాల మధ్యగల భూప్రాంతం పై అతని ఆధిపత్యాన్ని సూచిస్తుంది.

రెండవ పులకేశి కీర్తిప్రతిష్టలు భారతదేశ సరిహద్దులు దాటి వ్యాపించాయి. 'తబరి' అనే ముస్లిం

చరిత్రకారుల ప్రకారం పర్షియా రాజు రెండవ ఖుస్రూ చాళుక్య రాజు నుంచి క్రీ.శ. 625-26 లలో రాయబారిని అందుకున్నాడు. అతడు చాళుక్య రాజు పేరు ప్రేమవాహ గా రాశాడు. దీన్ని పరమేశ < పరమేశ్వర గా విశ్లేషించారు. పులకేశి II రెండో పేరు ఇదే కాబట్టి అతని చెప్పిన చాళుక్య రాజు పులకేశి II యేనని చెప్పవచ్చు. అజంతా లోని ఒక చిత్రపటంలో పులకేశి II కు పర్షియన్ రాయబారి ఖుస్రూ సమాధానాన్ని అందించడం చిత్రించబడింది.

## రెండవ పులకేశి సామ్రాజ్య కాంక్ష, సృష్టి

విజయాల్ని సాధించిన తరువాత పల్లవుల పై రెండోసారి దాడి చేశాడు. ప్రాథమిక దశ గా పల్లవుల సామంతులైన బాణుల్ని ఓడించాడు. తర్వాత ముందుకు సాగి పల్లవుల రాజధానికి మరోసారి ప్రమాదం కలిగించాడు. కాని మహేంద్రవర్మ I వారసుడు 'నరసింహవర్మ I' పులకేశి II ని కంచి కి 32 కి.మీ. దూరంలో ఉన్న 'మణిమంగళ యుద్ధం' లో ఓడించాడు. ఈ విజయంతో ప్రోత్సహించబడి ప్రతీకారచర్య గా చాళుక్యుల రాజ్యం పై దండెత్తాడు. పులకేశి II ఓడించబడ్డాడు, బహుశా చంపబడి ఉండొచ్చు. బాదామి పల్లవుల చేత చిక్కింది. పల్లవుల శాసనాల ద్వారా నరసింహవర్మ I వల్లభుని (పులకేశి II) పై పలుమార్లు ఓటమిని చేసినట్లు అంటూ యుద్ధాలు 'పరియల', 'సురమర' మొ॥ ప్రాంతాల్లో
(కర్నూలు దగ్గర) (నెల్లూరు జిల్లా)

జరిగినట్లు చివరికి బాదామి పతనం చేయబడినట్లు తెల్పుతున్నాయి. ఈ బాదామి పై ఆధిపత్యానికి చిహ్నంగా పల్లవరాజు 'వాతాపికొండ' బిరుదు కూడా ధరించాడు. బాదామి లోని ఒక రాతిశాసనం బాదామి సింహవిష్ణు లేదా నరసింహవిష్ణు (నరసింహవర్మ I) ద్వారా జయించబడినట్లు తెల్పుతుంది.

పల్లవుల దాడి ఫలితంగా చాళుక్యరాజ్యం తీవ్ర అసందిగ్ధతలో రాజకీయ సంక్షోభానికి లోనయ్యింది. అనేక మంది సామంతులు స్వాతంత్ర్యం ప్రకటించుకున్నారు. పులకేశి కుమారుల మధ్య వారసత్వ యుద్ధం కూడా జరిగింది. క్రీ.శ. 642-655 ల మధ్య సింహాసనం ఖాళీగా ఉండవచ్చని నమ్మడానికి మనకు కారణాలు ఉన్నాయి. ఏమైనా చివరికి రెండో పులకేశి ప్రియపుత్రుడు విక్రమాదిత్య I (పులకేశి II కి అతని గంగ రాణి ద్వారా కలిగినవాడు) బాదామి ని పల్లవుల నుంచి విడిపించడం లో చాళుక్యసింహాసనాన్ని అధిరోహించటం లో విజయుడయ్యాడు.

హ్యుయాన్‌త్సాంగ్ సందర్శన :

రెండో పులకేశి కాలంలో చైనా యాత్రికుడు హ్యుయాన్‌త్సాంగ్ చాళుక్య రాజ్యం సందర్శించాడు. అతడు మహారాష్ట్రను గురించి ('మొహా-ల-చ') వివరంగా వివరించాడు. పులకేశి ని అతని ప్రజలు భక్తి విధేయతలతో ఆరాధించేవారని పేర్కొన్నాడు. పులకేశి II పథకాలు, చర్యలు

విస్తృతంగా వ్యాపించాయని అలాగే ఉదార చర్యలు సుదూర
ప్రాంతాల్లో కూడా ప్రభావితం చేయగలిగాయని తెల్పాడు.
చాళుక్య రాజ్యం లో భూమి క్రమంగా సాగు చేయబడేదని
వాతావరణం కూడా వేడిగా వేడి ఉండేది రాసాడు. ప్రజలు నిజాయితీపరులు,
గౌరవప్రదంగా ఉంటారు. అవసరం లో ఉన్నవారిని వెంటనే ఆదుకుంటారు.
మేలు చేసేవారికి మేలు, కీడు చేసేవారికి కీడు చేస్తారు. అవమానిస్తే
ప్రతీకారం తీర్చుకోడానికి ప్రాణం కూడా ఇచ్చేయరు. ప్రతీకారం
తీర్చుకోవాలను కుంటే శత్రువుకి ముందే హెచ్చరిస్తారు. యుద్ధంలో
లొంగిపోయిన వారు లొంగిపోతే చంపరు. ఓడిపోయిన సైనా-
-ధికారికి స్త్రీల దుస్తులు ఇచ్చి అద్దాయా అంటే చాలును
ఆత్మహత్య చేసేలా చేస్తారు. చాళుక్యుల రాజ్యంలో
భయోత్పాతం సృష్టించే యోధులు ఉండేవారు. వారు
ఎవరినైనా చంపినా రాజ్యాంగం వారికి శిక్షలు
వేయదు. ఇలాంటి యోధుల్ని, ఏనుగుల
బలగం ఉండటం చేతనే చాళుక్య రాజు ఇతరుల
వారిని అలక్ష్యంగా చూసేవాడు. ప్రజలకు విద్యాభ్యాసం
పట్ల కూడా మంచి ఆసక్తి ఉండేదని రాసాడు.

# గుప్తుల కాలం స్వర్ణయుగమా?

కొందరు భారతీయ చరిత్రకారులు గుప్తుల కాలాన్ని వారి పాలనని అలంకరించి కీర్తించి వారి యుగానికి 'స్వర్ణయుగం' గా పేరు పెట్టడం కన్పిస్తుంది. 'మరెన్నడూ జీవనం ఇంత ఆనందదాయకం గా లేదు' (life was never happier) లాంటి వ్యాఖ్యలు కూడా కొందరు చరిత్రకారులు చేశారు.

సాహిత్య, వాస్తు, కళా రంగాల్లో గుప్తుల కాలం స్వర్ణయుగం అయివుండవచ్చు గాని అన్ని రంగాల్లోనూ దాన్ని స్వర్ణయుగం అనడం వాస్తవ దూరం.

ఈ కాలం లోనే దేశం లో అనేక ప్రాంతాల్లో సెర్ఫడం (serfdom) మొదలై క్రమంగా రైతుల యొక్క ఆర్థిక లొంగుబాటు కు దారితీసింది / క్రమంగా రైతులను ఆర్థికంగా బందీలను చేసింది.

స్త్రీలు సంపదలో ఒక వస్తువుగా పరిగణించబడ్డారు. చిన్నతనంలో పురుషుల ఆధిపత్యం లో, రక్షణ లో మాత్రమే వారు జీవించాల్సి ఉండేది. కళ, సాహిత్యాల్లో వారు ఆదర్శనీయంగా చూపబడినా, స్త్రీ ని దేవతగా ఆరాధించటం అధికంగా ఉన్నా గాని వాస్తవ జీవనంలో మాత్రం ఆమె స్వేచ్ఛ లేని పంజరపు చిలుకే.

ఈ కాలంలో కుల విభజనలు, కులకట్టుబాట్లు మరింత కఠినంగా మునుపెన్నడూ లేనంత కఠినంగా

తయారయ్యాడు ..

చట్టం, న్యాయం కూడా ఉన్నత వర్గాలు, ఉన్నత కులాల వారికి అనుకూలంగా పక్షపాతంగా మారింది.

గుప్తుల కాలాన్ని గురించి చెబుతూ ఫాహియాన్ ప్రజలు సాధారణంగా ఆనందంగా జీవించేవారని రాశాడు. నిజమే! ఉన్నత వర్గాల వారు ఆనందంగా తృప్తిగానే జీవించేవారు. వారి సమకాలీన సాహిత్యం ద్వారా కూడా ఉన్నతవర్గాల వారి సౌకర్యవంతమైన జీవితాన్ని తెలుసుకోవచ్చు. కాని ఇది కింది వర్గాలకు వర్తించేది కాదు. ఆ చైనా యాత్రికుడే చండాలురు అనుభవించిన అమానుష అవమానాన్ని కూడా వెల్లడించడం గమనార్హం. ఈ కాలంలో అంటరాని వారు సాంఘికంగా మరింతగా దిగజారారు.

సాంఘిక అశాంతి, అలజడులు అనివార్యమైనవి. కాని వాటిని వర్ణధర్మం ప్రకారం విభజించబడిన సమాజాన్ని కొనసాగించేందుకు సాధనంగా వాడుకునేవారు.

"ఉన్నతవర్గాల వారికి చరిత్రలోని యుగాలన్నీ స్వర్ణమయమే, కాని సామాన్యులకి మాత్రం ఏదీ కాదు. సామాన్య ప్రజలకు వాస్తవమైన స్వర్ణయుగం గతంలో లేదు, భవిష్యత్తులో ఉంది"

— డి. ఎన్. ఝా

① Gupta Period as
Threshold period

— Rajan Romila Thapar Page : 323

② Significance of Gupta age
Sambasiva Rao Guide Page : 227.

③ Gupta age as classical age
Romila Thapar

# Chapter - 12

## Themes in Early Indian Cultural ~~History~~ :

## Languages

"ఒక భాష ఎంత వరకైతే మాట్లాడడం, రాయబడడం జరుగుతుందో అప్పటి వరకూ అది వృద్ధి చెందుతూ ఉంటుంది, భాషావృద్ధి యొక్క దిశ సాధారణం గా సారళ్యం వైపే సాగుతుంది"

— ఎ.ఎల్. భాషం

### సంస్కృత భాష :

సంస్కృతం ఫిన్నిష్, హంగేరియన్, ఎస్తోనియన్, టర్కిష్ మరియు బాస్క్ తప్ప మిగిలిన యూరోపియన్ భాషలతో దూరపు సంబంధం కలిగి ఉంది.

BT [సంస్కృతం దాని 'వైదిక' మరియు 'సంప్రదాయ' రూపాల్లో సాహిత్య సంప్రదాయాన్ని చాలా కాలం ప్రభావితం చేసింది. ఆర్యులు తమతో పాటు విలువైన, కచ్చితమైన, ఉత్తమ కావ్య సంప్రదాయాల భాషను తీసుకువచ్చారు. ఈ కావ్యాలను (బ్రాహ్మణులుగా మారిన పురోహిత కుటుంబాలు

రచయితలు, వారె వైదిక మతానికి రక్షకులు మరియు ఆచార్యులు!
వివిధ దేవతలకు ఈ కుటుంబాలు కూర్చిన స్తోత్రాలు వర్గాత్మకం
గా పదిలపర్చబడి తర్వాత 'ఋగ్వేదం' గా లిఖించబడ్డాయి.
వేదసాహిత్యం క్రీ.పూ. 1300 లో మొదలై క్రీ.పూ. 1000
ప్రాంతంలో పూర్తయ్యింది. క్రీ.పూ. 1000 తర్వాత స్తోత్రాలు
పాత కవిత్వ పద్ధతిలో రాయబడలేదు. తూర్పుప్రాంత
మండలాల ఆధారంగా వృద్ధి చెందిన స్తోత్రాల లో శాస్త్ర
కొత్తగా కల్పించే భాషలో విస్తృత గద్య సాహిత్యం ఆధ్యాత్మిక
అంశాలకు అంకితమైంది. ఈ గద్య సాహిత్యం కూడా
క్రొత్తగా మార్పుకమైంది. ఇది భాష విశిష్ట పదరూపాల
చూపుతుంది. క్రీ.పూ. 1000 – 800 మధ్య ఈ వృద్ధి
జరిగింది.] BT

తొలినాటి సంస్కృతం – 'ఋగ్వేదంలో ఉన్నరూపం'

ఈ 'సంప్రదాయ సంస్కృత రూపాల' మధ్య
సంబంధం 'హోమెరిక్' కు 'సంప్రదాయ గ్రీకు' మధ్య
సంబంధం లా ఉంటుంది.

సంస్కృత భాష దాని అన్ని దశల్లోనూ
అనేక రూపభేదాలు కలిగియుంది, కాని వేదాల్లోని అనేక రూపాలు
తర్వాత వినియోగం కోల్పోయాయి. సంస్కృత 'క్రియ'
చాలా సంక్లిష్టమై గ్రీకు లో మాదిరి పడుతుంది. క్రియ
లోని విభిన్నాల్లో కలిగిన స్వరాలు, ధోరణులు

అర్థాలు చాలా సంమిశ్రితంబద్ధాయి, వైదిక సామవాచకం
లో అర్థాల సంస్కృతం లో వలెనే ఎనిమిది సందర్భాలున్నాయి.
క్రియ, నామవాచకం రెండిటిలో రెండు సంఖ్యావాచకాలున్నాయి.

వేదిక / వైదిక సంస్కృతం యొక్క ముఖ్య
లక్షణం 'స్వర ధ్వనిక' (tonic accent). ప్రతి
ముఖ్య పదం లో ధ్వనిక గల శబ్దం ఉంటుంది, దీన్ని
ఒత్తి పలకాలనే ఏమీ లేదు కాని సంప్రదాయ క్రమం లాగా
అక్కడ 'స్వరస్థాయి' ని పెంచి పలుకుతారు. సంస్కృతంలోని
ఉన్న ఈ స్వర ధ్వని ప్రధానంగా భాషాంతరీయమాల
నుంచి వచ్చింది.

సంస్కృతం, దాన్నుంచి వచ్చిన భాషల్లో
'ఒత్తు వాల్లు' ఉంటాయి.

ఆధునిక కాలం లోనూ ఉన్న మరొ
వైదిక సంస్కృత శబ్ద లక్షణం తాలవ్యోత్పత్తైన
ట, ఠ, డ, ఢ, ణ లకు దంత్యోత్పత్తైన త, థ, ద, ధ, న లకు
మధ్య స్పష్టమైన భేదం ఉండడం. ఈ లక్షణం
ఇండో-యూరోపియన్ లక్షణం కాదు. స్థానికమైన ముండా-
ఆస్ట్రలాయిడ్ లేదా ద్రవిడియన్ భాషల నుండి ఇది
ప్రాచీన కాలం లోనే ఈ లక్షణాన్ని సంస్కృతం స్వీకరించింది.

సంస్కృత శబ్దాల్లో మరొ లక్షణం అ, ఆ
అచ్చుల ప్రాధాన్యత అధికంగా ఉండడం. వైదిక
సంస్కృతం విస్తృతమైన, ఉత్తమ అభివ్యక్తులను

వెల్లడించగల భాష.

ఋగ్వేదం రూపొందిన తర్వాత సంస్కృతం చెప్పుకోదగినంతగా వృద్ధి చెందింది. క్రీ.పూ. మొదటి సహస్రాబ్ది ఆఖరి శతాబ్దాల్లో పాత రూపభేదాలు సమసిపోయాయి. వ్యాకరణం ఇంకా క్లిష్టంగానే ఉన్నా చాలా సరళీకరించబడింది. తర్వాతర మూలాల్నుంచి కొత్త పదాలు చేర్చబడ్డాయి, అనేక పాత పదాలు మరుగైపోవడమో వాటి అర్థాలు మారిపోవడమో జరిగింది. ఈ పరిస్థితుల్లో పాత వేదాల వాస్తవ ఉచ్చారణ, అర్థాల గురించి సందేహాలు మొదలయ్యాయి. వేదాల్ని మిక్కిలి కచ్చితంగా చదివితేనే అద్భుత ఫలితాలను ఇవ్వగలవని తెలిపినట్లుగా ఫలితాలు రాకపోవడమే గాక తప్పు ఉచ్చారణ చేసిన వారు నాశనమౌతారని నమ్మబడేది. దాంతో వేదాల పవిత్రత కాపాడాల్సిన అవసరం వల్ల భారతదేశం శబ్ద, వ్యాకరణ శాస్త్రాలను వృద్ధి పరచింది.

అతి ప్రాచీన భారతీయ శబ్ద శాస్త్రగ్రంథం గా క్రీ.పూ. 5 వ శతాబ్దానికి చెందిన పురాతన వైదిక పదాల్ని వివరించే Yaska's 'నిరుక్త' ను చెప్పవచ్చు.

పాణిని గొప్ప వ్యాకరణగ్రంథం "అష్టాధ్యాయి" బహుశా క్రీ.పూ. 4 వ శతాబ్దంలో రాయబడింది. పాణిని లో సంస్కృత భాష విశిష్టతా దాని సాంప్రదాయ రూపాన్ని పొందింది, ఆ తర్వాత కాలంలో పదజాలంలో తప్ప భాషలో మార్పులు పెద్దగా రాలేదనే చెప్పాలి.

ఈ పాణినీయంలో సంస్కృత శబ్దాలు సుస్పష్టంగా విశ్లేషించబడ్డాయి, భాషాధ్యయనంలో ఇంత పరిణతి 19 వ శతాబ్దం దాకా మళ్ళీ కన్పించదు. ప్రాచీన భారతం యొక్క గొప్ప ఘనత అది సాధించిన 'వర్ణమాల' లో ఉంది. అచ్చులు ఆరంభంలోను వాటి తర్వాత హల్లులూ వస్తాయి. అవి కూడా వాటి 'ఉత్పత్తి స్థానాన్ని' బట్టి అద్భుతంగా వర్గీకరించబడ్డాయి. మూడు సహస్రాబ్దాల నుంచి వృద్ధి చెందిన గజిబిజి, గాలిబాలి రోమన్ వర్ణమాల కు ఇది పూర్తి వ్యతిరేకం. ( ) సంస్కృతం 'కనుగొన్న తర్వాత మాత్రమే (పాశ్చాత్యులు) యూరోప్ లో శబ్దశాస్త్రం వృద్ధి చెందింది.

పాణిని కి ముందు ఎందరో వ్యాకరణవేత్తల కృషి ఉండి ఉంటుంది. వారు పదాల ఆధారం గా 'మూలాన్ని' కనుగొనడం లో సఫలమయ్యారు. దాదాపు 2000 ఏకశబ్ద మూలాల్ని వర్గీకరించి వాటికి రూపభేదాలు, ఉపసర్గలు మొ॥ చేర్చటం ద్వారా భాష లోని అన్ని పదాలు వస్తాయని చెప్పారు. సూత్రపరం గా ఈ సిద్ధాంతము ఒప్పే అయినా ఆచరణ లో తలెత్తే మార్పుల్ని వారు గుర్తించలేకపోయారు.

పాణిని అష్టాధ్యాయి దాని ప్రత్యేక స్వభావం వల్ల పరిమిత కీర్తి పొందినా ప్రాచీన నాగరికతలు సాధించిన అత్యుత్తమ విజ్ఞాన శిఖరాల్లో ఇది ఒకటి

నిస్సందేహంగా చెప్పవచ్చు అంతేగాక 19 వ శతాబ్దం
ముందువరకు ప్రపంచం లో మరెక్కడా ఇంత సూక్ష్మ
వివరాలు గల వ్యాకరణ శాస్త్ర గ్రంథం కన్పించదు. ఇందులో
4000 లకు పైగా వ్యాకరణ సూత్రాలు ఉన్నాయి. సందర్భాలు,
ధాతువులు, పురుషాలు, కాలాలు మొ॥ వాని పేర్లకు బదులు
అక్షరాన్ని, శబ్దాన్ని పాణిని వాడాడు. పాణిని రచన
లోని అతి సంగ్రహత వలన ప్రాథమిక అధ్యయనం, సరైన
వ్యాఖ్యానం లేకుండా దాన్ని చదవడం చాలా కష్టం గా ఉంటుంది.
తర్వాత కాలంలో వచ్చిన భారతీయ వ్యాకరణాలన్నీ పాణిని
కి వ్యాఖ్యానాలే. అందులో ముఖ్యమైనవి పతంజలి
క్రీ.పూ. 2 వ శతాబ్దం లో రాసిన 'మహాభాష్యం' ;
జయాదిత్య మరియు వామనులు క్రీ.శ. 7 వ శతాబ్దం లో
రాసిన 'కాశిక వృత్తి'.

పాణిని తో సంస్కృత భాష స్థిరపర్చబడింది,
అతని నియమాలకి లోబడి మాత్రమే వృద్ధి చెందగల
పరిస్థితి నెలకొంది. చిన్న అంశాలపై కొందరు తప్ప పాణిని
సూత్రాల్ని విభేదించటానికి ఎవరూ సాహసించలేదు.
పాణిని కాలం, ఆ తర్వాత నుంచే భాష ను 'సంస్కృత'
(Perfected) లేదా refined) అని 'ప్రాకృతం' ని
(unrefined) వ్యావహారికమైనది గా పిలవడం జరిగింది.
ప్రాకృత భాష అంటే సహజం గా రూపొందిన ప్రజల
మాండలికాలు.

పాణిని సంస్కరణం వైదిక సంస్కరణం కన్నా సులువుగా ఉన్నప్పటికీ, ఇంకా మిక్కిలి క్లిష్టమైందే. సంధి సూత్రాల్లో ఈ క్లిష్టత స్పష్టంగా కనిపిస్తుంది. ఋగ్వేదం మీద సంధి విధాయాలో కృత్రిమంగా చేర్చిన సూత్రాలు కూడా ఎన్నో ఉన్నాయి. అందువల్ల పాఠకుడు తరచూ సరైన ఛందస్సు కోసం వాస్తవ పదాల విడదీయించాల్సి వస్తుంది.

పాణిని సంస్కరణల్ని ప్రామాణీకరించడంలో బహుశా వాయువ్య ప్రాంత భాష ను ఆధారం చేసుకుని ఉండవచ్చు. సంస్కరణల్ని వాడిన మొదటి ప్రముఖ రాజ వంశం ఉజ్జయిని శక వంశీయులు. రుద్రదమనుని 'గిర్నార్ శాసనం' అతి సంస్కృత శాసనం గా భావిస్తారు.

భాషా సౌలభ్యం వైపు వృద్ధి చెందడం సహజం. కాని పాణిని నియమాల వల్ల సంస్కరణం ఈ దిశగా పయనించలేకపోయింది. భూతకాలానికి చెందిన చిన్న చిన్న నియమాల్ని విస్మరించారు, కాని పాణిని రూపభేద నియమాలు మాత్రం పాటించాల్సి ఉండేది. రూపభేదాలతో లేకుండా వృద్ధి చెందగల ఏకైక మార్గం సమాసాల్ని నిర్మించడమే, ఈ సమాసాలు వాక్య భాగాలుగా మారేవి.

వైదిక, ఇతిహాస సాహిత్యం లో మిశ్రమ వాచకాలు లేదా సమాసాలు చాలా కనిపిస్తాయి, కాని అవన్నీ

రెండు, మూడు పదాలతో కూడినవే. కాని ఆల సంస్కృత గ్రంథాల్లో భారీ సమాసాలు కన్పిస్తాయి. ఈ విధమైన దీర్ఘ సమాసాల్ని వాడడం బహుశా ద్రావిడ భాషా వ్యవహార ప్రభావం వల్ల కావచ్చు. ప్రాచీన తమిళం లో కొద్ది రూపభేదాలు ఉండి, పదాలు స్పష్టమైన సంబంధ సూచికలు లేకుండానే మాలిక గా అమర్చబడడం కన్పిస్తుంది.

దీర్ఘ సమాసాల వాడుక పెరగడం లో సంస్కృతం లో దీర్ఘ వాక్యాలపై కూడా మక్కువ పెరిగింది. క్రీ.శ. 7 వ శతాబ్ది లో రాసిన బాణ, సుబంధుల రచనల్లో రెండు, మూడు పేజీలు పొడేలా ఒకే వాక్యం ఉంటుంది. వీరి రాసం తాలి చమత్కారాల్ని వాడి సంస్కృతాన్ని ప్రపంచంలోకెల్లా అత్యంత అలంకృత, కృత్రిమ భాషల్లో ఒకటిగా చేశారు.

కాళిదాసు కు సమకాలికుడు గా చెప్పబడే అమరసింహుడు 'అమరకోశం' అనే నిఘంటువు రాశాడు.

సంప్రదాయ సంస్కృతం బహుశా సామాన్యులు ఎప్పుడూ మాట్లాడి ఉండరు, అలాగని అది ఎన్నడూ పూర్తి మృతభాష గా లేదు. మత, రాజకీయ అధికార భాష గా ఉన్నత వర్గాల వారు సంస్కృతాన్ని చదవడం, రాయడం చేసేవారు. బహుశా సాధారణ ప్రజలకి అది కొంత అర్థమవుతూ ఉండొచ్చు. యావద్భారతానికీ

భాషాప్రపంచాన అందించిన భాష సంస్కృతమే.

## ప్రాకృత భాష మరియు పాలి :

ఋగ్వేదం రచించబడే నాటికే అందలి భాష పురాతనమైపోయింది. సాధారణ ఆర్యతెగ ప్రజలు సరళమైన సంప్రదాయ సంస్కృతానికి దగ్గరగా ఉండే భాష మాట్లాడేవారు. వేదాల్లోనే మాండలిక భేదాలకు ఆధారాలున్నాయి. బుద్ధుని కాలానికి సామాన్యులు సంస్కృతం కంటే చాలా సరళమైన భాషలు మాట్లాడే వారు. ఇవే ప్రాకృతాలు, వీనిలో అనేక మాండలికాలు ఉండేవి.

ప్రాచీన భారతం లోని రోజువారి భాషలు సంప్రదాయేతర మతసాహిత్యం ద్వారా నేటికీ పదిలంగా ఉన్నాయి. అశోకుని శాసనాలు, సంస్కృత నాటకాల్లోని స్త్రీ, నీచ పాత్రల సంభాషణల్లో నియత ప్రాకృతం యొక్క వివిధ మాండలికాలు వాడబడ్డాయి. కొన్ని లౌకిక రచనలు కూడా ప్రాకృతం లో ఉన్నాయి.

ప్రాకృతాలు శబ్దం లోనూ వ్యాకరణం లోనూ కూడా సంస్కృతం కంటే సరళమైనవి. ద్విత్వ హల్లులు, నాసికాక్షరం మొదలు ఉండే సంయుక్తాలు వంటివి తప్ప హల్లుల సమూహాన్ని తీవ్రంగా తగ్గించి వేశారు. పదాల చివరి హల్లులు పోయాయి, కొన్ని మాండలికాల్లో పదమధ్య ఏక హల్లులు వదిలేశారు. 'మాగధి' మాండలికం లో 'ర' క్రమంగా 'ల' గా మారింది ఫలితంగా 'రాజ' బదులు మాగధిలో 'లాజ' ఉంటుంది. నామవాచకం, క్రియల రూపభేదాలు

చాలా వరకు తగ్గించబడ్డాయి.

ఆటి ప్రాకృతాల్లో ముఖ్యమైనది 'పాళి'. స్థవిరవాద బౌద్ధులకు ఇది ప్రధాన భాష అయ్యింది. బుద్ధుడు బహుశా 'మాగధి' లో బోధించి ఉండవచ్చు, కాని ఆయన సూత్రాలు దేశమంతా వ్యాపించిన తరువాత స్థానిక మాండలిక రూపాలు పొందాయి. స్థవిరవాదులు ఎంచుకున్న భాష బహుశా సాంచి, ఉజ్జయిని ప్రాంతాల్లో మాట్లాడేది అయివుండొచ్చు. పాళి భాష లో సంప్రదాయ సంస్కృతం కన్నా వైదిక సంస్కృతం లోనే పోలికలు కన్పిస్తాయి.

'మాగధి' మౌర్యుల రాజభాష. అశోకుని శాసనాలు స్థానిక మాండలికాలలో ప్రభావితమైనవీ అవి మాగధి లోనే ఉన్నాయి. తర్వాతి కాలంలో పశ్చిమ ప్రాకృతాల ప్రభావం లో "అర్ధమాగధి" వృద్ధి చెందింది. ఇది జైనులకి పవిత్ర భాషయ్యె ఎంతో జైనసాహిత్యం అర్ధమాగధి లోనే వెలువడింది.

శౌరసేని ప్రాకృతం ఆధునిక ఉత్తరప్రదేశ్ పశ్చిమ ప్రాంతం లో మాట్లాడేవారు. మహారాష్ట్రి వాయువ్య దక్షిణ లో మాట్లాడబడేది. శౌరసేని ని ప్రత్యేకించి నాటకాల్లో స్త్రీ, గౌరవనీయమైన కింది వర్గాల పాత్రల మాటలకి వాడేవారు. మహారాష్ట్రి సాహిత్య భాష, ముఖ్యంగా గేయపాటలకి ప్రసిద్ధమైంది. ఇవికాక అనేక ప్రాంతీయాలకి

ఇంకా ఎన్నో ప్రాకృతాలు ఉండేవి.

గుప్తుల కాలంలో ప్రాకృతాలు ప్రామాణికంగా పొందాయి. ప్రాంతీయ భాషలు అప్పటికే వాటిని మించి వృద్ధి చెందాయి. పాణిని సంస్కృతానికి ఏం చేశాడో అదే మరెందరో ప్రాకృతాలకు చేశారు. ప్రాకృతాలకు వాస్తవంగా మాట్లాడబడుతున్న / వ్యవహారం లో ఉన్న భాషలకు మధ్య సామ్యం అంతరించసాగింది. నాటక కర్తలు మొదట [ ] మొదట సంస్కృతం లో ఊహించేవారు వానికి అనువాద వ్యాకరణ సూత్రాల లోపాలు లేనిగ [ప్రాకృత మాటలు రాయాల్సివచ్చినట్టు] రాయడం చేసేవారు.

## ద్రావిడ భాషలు :

ద్రావిడ భాషలన్నింటిలో 'తమిళం' అతిప్రాచీనమైంది. తక్కిన వాటిలో కన్నడ, తెలుగు, మలయాళం ముఖ్యమైనవి.

కొంతమంది పండితులు ద్రవిడ భాషలు ఫిన్నో - ఉగ్రియన భాషా సమూహం లో దూరపు సంబంధాలు కలిగి ఉన్నట్లు భావించారు. కాని ద్రవిడ భాషలు విలక్షణ స్వభావం గల స్వతంత్ర భాషా కుటుంబంగా భావించడానికే అధికమంది అంగీకరిస్తారు.

ద్రవిడ భాషల శబ్ద విధానం లాలిత్య వాక్కుల సంపద కలిగింది, ఇది ఈ భాషలకు

గరగరలాడే మారుతీరు ఉంటుంది. సంస్కృతం లో ఏ
ఐ, ఔ అచ్చుల ద్వారా ఈ భాగాలు ఉత్తరాది భాషల
పూర్తి భిన్నంగా ఉంటాయి. సంస్కృతం లాగానే ద్రావిడ భాషలకు
క్లిష్టమైన శ్రవ్య సంయుక్తాలు ఉంటాయి. ఇండో-ఆర్యన్
భాషల్లో లేనే ఒత్తు వర్ణాలను ద్రావిడ భాషలు గుర్తించవు.
తమిళం యొక్క విలక్షణ శబ్ద సూత్రాల ద్వారా సంస్కృత
'భూమి' తమిళం లో 'పూమి' గా మారుతుంది.

తొలి తమిళ సాహిత్యం లో తులనాత్మకంగా
తక్కువ సంస్కృత పదాలు ఆదానాలుగా కన్పిస్తాయి, ఇవి
కూడా తమిళ శబ్దవిధానం లో మార్పులు ఉంటాయి/
మార్పు చెంది కన్పిస్తాయి. ఆర్య ప్రభావం పెరగడం లో సంస్కృత
ఆదాన పదాలు కూడా పెరిగి కన్పిస్తాయి. తెలుగు, కన్నడం లాంటి
ఉత్తరాన మార్పు బడటం చేత సహజంగానే సంస్కృతం చేత
మరింత ఎక్కువగా ప్రభావితం అయ్యాయి.

# లిపి

హరప్పా ప్రజల లిపి కనుగొనబడలేదు. హరప్పా కాలం నుంచి (క్రీ.పూ. 1550) క్రీ.పూ. 3వ శతాబ్దం మధ్య దాకా భారతీయ లిపి ఆధారాలేవీ దొరకలేదు. అశోక శాసనాల లోని లిపి పరిణతి వలన రెండు మూడు శతాబ్దాల ముందు నుంచే లిపి పరిణామం చెందుతూ ఉందని చెప్పవచ్చు.

అశోక శాసనాల్లో ప్రధానం గా రెండు లిపులు వాడారు. వాయువ్యాన తప్ప మిగిలిన భారతమంతా వాడబడిన లిపి 'బ్రాహ్మి'. ఈ లిపి పుట్టుక గురించి రెండు సిద్ధాంతాలున్నాయి.

1) అనేకమంది భారతీయ పండితులు ఇది హరప్పా లిపి నుంచి ఏర్పడిందన్నారు.
2) అనేక విదేశీ పండితులు, కొంతమంది భారతీయులు ఇది సెమిటిక్ లిపి నుంచి ఏర్పడిందని తలచారు.

పైపైన బ్రాహ్మికి ప్రాచీన-ఉత్తర సెమిటిక్ లిపులకి దగ్గర సామ్యం అధికం గా కన్పిస్తుంది. బ్రాహ్మి లిపి లో ఒకటి రెండింటి కంటెం ఎక్కువ అక్షరాలు మాత్రమే ఉంటాయి. హరప్పా లిపి లో 270 దాకా చిహ్నాలున్నాయి. కాగా సెమిటిక్ లిపుల్లో కేవలం 22 అక్షరాలే ఉన్నాయి. అలాగని బ్రాహ్మి, సెమిటిక్ లిపుల సామ్యం నిర్దిష్ట మైనదని వచ్చేంత బలం గా ఏమీ లేవు. ఇది అపరిణామాల

సమస్యగానే చెప్పాలి.

బ్రాహ్మీ సాధారణంగా యూరోపియన లిపుల మాదిరే ఎడమ నుండి కుడి కి చదువుతారు. కాని సెమెటిక్ లిపులు కుడి నుండి ఎడమకు చదువుతారు. ఆంధ్రలోని ఎర్రగుడి శాసనం, ఎరాన లోని ప్రాచీన నాణెం, ప్రాచీన సింహళ శాసనం లపై బ్రాహ్మీ కుడి నుండి ఎడమ కి చదివేలా ఉంది. ఇది బ్రాహ్మీ వాస్తవంగా చదవబడిన తీరు ని సూచిస్తుంది. కాని ఇది దాని పుట్టుక కి ఆధారం కాదు, ఎందుకంటే, హారప్పా లిపి కూడా కుడి నుండి ఎడమకే చదువుతారని తెలుస్తుంది.

బ్రాహ్మీ పుట్టుక ఏదయినాగాని ఆది భారతీయ భాషా శబ్దాలకి ఎంత(గా అలవాటు పడిందంటే) వైజ్ఞానికంగా కుదిరిందంటే దాని వృద్ధి లో కొంతైనా కావాలని (deliberately) చేసినట్లు తోస్తుంది. ఇది వర్తకుల వర్ణమాల గా మొదలై ఉండవచ్చు గాని వైదిక శబ్దశాస్త్ర పరిజ్ఞానం గల పండితుల కృషి ఫలితంగానే నేటి రూపం లోని బ్రాహ్మీ వృద్ధి చెందింది. అశోకుని కాలానికి, దాని వృద్ధి సంపూర్ణంగా జరగక పోయినా, బ్రాహ్మీయే ప్రపంచం మొత్తం లో అత్యంత శాస్త్రీయ మైన లిపి అని తెలుస్తుంది.

సెమిటిక్ లిపుల్లో అచ్చుల్లో మార్పులు సూచించడానికి పదారంభంలో చిన్న చిహ్నాలు వాడతారు. కాని భారతీయులు పరిశీలన ప్రదర్శిస్తూ అచ్చుల్లో మార్పుల సూచించడానికి మౌలిక అక్షరం లోనే మార్పులు చేస్తారు, ఆ అక్షరం

లోనే అంతర్గతంగా అచ్చు చేరి ఉంటుంది.

ఉదా: బ్రాహ్మీ అక్షరం '+' 'క్' కాదు

అందులో 'క' ఉంది.

బ్రాహ్మీ '+' ≠ క్

'+' = క

బ్రాహ్మీ లో స్థానిక మార్పులు అశోకుని కాలం లోనే కన్పిస్తాయి. శతాబ్దాలు గడిచే కొద్దీ లిపి రాయడం లో అలంకారాలు పెరిగాయి. క్రమంగా 'నాగరి' (నగరం) లిపి ఇదే 'దేవనగరి' (దేవతల నగర లిపి) ఆవిర్భవించింది.

దక్కను లో లిపులు మరింతగా పరిఢవిల్లినాయి. మధ్యభారతం లో క్రీ.శ. 5, 6 శతాబ్దాల్లో చతురస్రపెట్టెలకు బదులు ఉత్తరభారత లిపుల 'సెరిఫ్‌లు' ఇతర అలంకారాలు చేరిన లిపి బయలు దేరింది.

దక్షిణ దక్కను, సీలోను లిపులు మరింత వృత్తాకారం లో మారసాగాయి.

తమిళులు మరోవైపు 'గ్రంథ' గా పేరు పొందిన కోణాల లిపి ని వృద్ధి పరచు ఉన్నారు.

# విషయ సూచిక

పల్లవి. ఠకురాణి

| Sl.NO. | Name of the Topic | page NO: |
|---|---|---|
|  |

Q. Describe the role of guilds in the economic life of ancient India from 200 B.C. to 300 A.D. (1982, 86)

Ans: మౌర్యానంతర యుగం లో అంటే క్రీ.పూ. 200 నుండి క్రీ.శ. 300 ల మధ్య కాలం లోని ప్రాచీన భారత ఆర్థిక వ్యవస్థ ప్రత్యేక లక్షణం గా "శ్రేణుల్ని" చెప్పవచ్చు. ఈ కాలం లో విదేశీ వాణిజ్యం బాగా పుంజుకోవడం వలన శ్రేణులు ఆర్థికం గా బాగా బలపడి సమకాలీన ఆర్థిక, సాంఘిక వ్యవస్థల్లో కీలక పాత్ర పోషించాయి.

మౌర్యానంతర యుగం లో ఉత్పత్తి, వర్తక మార్పిడి (exchange) 'శ్రేణి' అనే వ్యవస్థ ద్వారా ప్రధానం గా సాధించబడేవి. 'శ్రేణి' ని సాధారణం గా ఆంగ్లం లో 'guild' గా పిలుస్తుంటారు, అయితే యూరోపియన్ guild కంటే శ్రేణి ఎంతో భిన్నమైనది. శ్రేణి అధికంగా వృత్తికారుల, వర్తకుల సమూహ స్వభావం కలిగినది; వీరు కలిసి జట్టు గా పని చేస్తారు.

వాణిజ్యానికి అవసరమైన ఉత్పత్తి ని ఈ శ్రేణులు విరివిగా పెంచడం ద్వారా పట్టణ జీవితం లో ముఖ్య స్థానాన్ని పొందాయి. వ్యక్తిగతం గా వృత్తిపనివారి కి వృత్తి వ్యవస్థలతో వృత్తి సంఘాలతో పోలిస్తే

పడటం కష్టం కాబట్టి వృత్తిపనివారు అధికంగా శ్రేణుల్లో చేరేవారు. పైగా శ్రేణులు వారికి సంఘం లో హోదాను, భద్రతను అందించేవి, అందువలన వారు శ్రేణుల పట్ల మొగ్గు చూపేవారు.

'మిళిందపన్హా' 'మహావస్తు' వంటి బౌద్ధ గ్రంథాలు ఈ కాలంలో దాదాపు 75 కు పైగా వృత్తులున్నట్లు తెలుపుతున్నాయి. అయితే శ్రేణులు ఎంత ఎక్కువ సంఖ్యలో ఉన్నప్పటికీ ఈ 75 లో ఏ కొద్ది మాత్రమో శ్రేణులుగా ఏర్పడి ఉంటాయని రొమిలా థాపర్ అభిప్రాయ పడ్డారు.

ఉత్పత్తిలో సామర్థ్యం, లాభదాయకమైన అమ్మకాలు శ్రేణుల ధ్యేయాలయినట్లయితే బహుశా వాణిజ్యపరంగా మంచి గిరాకీ ఉన్న వస్తువుల ఉత్పత్తి కి మాత్రమే శ్రేణులు పరిమితమై ఉంటాయని రొమిలా థాపర్ అభిప్రాయం. గిరాకీ పెరిగినప్పుడు కొత్త శ్రేణులు కార్మికుల్ని కిరాయికి కుదుర్చుకోవడం లేదా బానిసల్ని నియమించుకోవడం చేసేవి. వాణిజ్య ఉత్పత్తి, అమ్మకాలపై ఆదాయం / శిస్తు వసూలు కు వీలవుతుంది / సౌలభ్యం ఏర్పడుతుంది కాబట్టి ఈ శ్రేణుల్ని ప్రభుత్వాలు ప్రోత్సహించేవి.

'అర్థశాస్త్రం' ప్రకారం శ్రేణులు అవి ఇవి చేస్తున్న ప్రాంతం లో స్థానికం గా రిజిస్ట్రేషన్ చేయించుకోవాలి, ప్రాంతం మారాలంటే అనుమతి తీసుకోవాలి. అయితే ఆచరణ లో ఈ నియమాల్ని ఎంత కఠినంగా అమలు చేసే వాళ్లు తెలియదని థాపర్ అభిప్రాయం. ఏ వృత్తి కి చెందిన కళాకారులైనా శ్రేణి గా ఏర్పడవచ్చు. ముఖ్యమైన శ్రేణులుగా కుమ్మరులు, లోహకారులు, నేతపనివారు, స్వర్ణకారులు, పూసలు - గాజు చేసేవారు, దంతం చెక్కేవారు, వడ్రంగం పనివారు మొదలైన వారిని చెప్పవచ్చు.

అయితే శ్రేణులు ఏర్పడటం ద్వారా వ్యక్తిగత entrepreneurship అంతమైందని అనుకోరాదు. సద్దాలపుత్ర అనే ధనిక కుమ్మరి 500 కుండల ఉత్పత్తి కేంద్రాలకు యజమాని, ఇతడు తన ఉత్పత్తుల పంపిణీ కూడా చూసుకునే వాడు. ఉత్పత్తి కేంద్రాల నుంచి గంగా నది మార్గం ద్వారా అనేక పడవలలో సరుకు ను వివిధ రేవు పట్టణాలకు చేరవేసేవాడు.

శ్రేణులు వృత్తిపర నియమాలతో పాటుగా ఉత్పత్తుల నాణ్యతా నియమాల్ని వాటి ధరల్ని కూడా నిర్ణయించేవి. ఇది అటు వృత్తికారులకు ఇటు వినియోగదారులకు ఇరువురికీ భద్రత కలిగిస్తుంది. ఉత్పత్తి చేయబడిన వస్తువుల ధరలు వాటి నాణ్యత మీద లేదా ఇతర నిర్దిష్ట స్కేలు (fixed scale) ద్వారా నిర్ణయించబడేవి.

శ్రేణుల సభ్యుల యొక్క ప్రవర్తన ను

ఒక స్వేచ్ఛాస్థానం ద్వారా పర్యవేక్షించేవారు, ఇది శ్రేణి యొక్క
సంప్రదాయాల్ని - "శ్రేణి ధర్మ" ను కాపాడుతుండేది.
ఒక వృత్తి సమూహం - 'జాతి' యొక్క సంప్రదాయ
క్రియలకి ఇది సమాంతరంగా ఉండేది, మరియు రాజు
గౌరవించాల్సి ఉండేది. 'శ్రేణి' 'జాతి' వంటి వ్యవస్థలు
అంతర ప్రాతినిధ్య పద్ధతుల్ని కూడా కలిగి ఉండేవి [వాటి
పరిధి వాటి సొంత సమూహానికి మాత్రమే పరిమితమైన
-ప్పటికీ] ఒక్కోసారి ఈ రెండింటి మధ్య overlap జరుగు
తుండేది, శ్రేణి కులం యొక్క విధుల్ని తీసుకోవడం కూడా
కన్పిస్తుంది. ఇందులో ముఖ్యమైనది వివాహాలు శ్రేణి
లోపలే చేసుకోవడం గా చెప్పవచ్చు.

శ్రేణి అధ్యక్షుడు "శ్రేష్ఠ", ఇతడు
అవసర సమయాల్లో ఇతర వ్యవస్థలతో మాట్లాడడం సమావేశాలు
జరపడం చేసేవాడు. కొంతవరకూ శ్రేణి పనితీరు
"గణ-సంఘ" ను పోలి ఉండేది.

శ్రేణులు వాని సభ్యుల వృత్తిగత జీవితాల్లో
కూడా జోక్యం చేసుకునేవని తెలుస్తుంది. వివాహిత స్త్రీ
బౌద్ధ భిక్షుణిగా మారదల్చితే భర్త అనుమతే గాక ఆమె శ్రేణి కి
చెందినదైతే ఆ శ్రేణి అనుమతి కూడా పొందాల్సి ఉండేది.
శ్రేణి లో నియామకాలు కులం తో సంబంధం పై ఆధార
పడి ఉండేవి. నిర్దిష్ట జాతి లోని వ్యక్తులు వారి తండ్రి
యొక్క వర్తకాన్ని అనుసరించేవారు, ఫలితంగా శ్రేణి కి

అది సంక్లిష్ట జీవనశైలిగా ఉండేది. సమాయత్తాలుల్ని (5)
చేస్తున్న వృత్తికారులు తమ ~~వారసుల్ని~~ కొడుకుల్ని లేదా వారసత్వం
గా అందించవచ్చు. ఒక జాతి పాటించే వృత్తి
తీవ్ర ఆర్థిక మార్పుల గతి ~~అమ్మబడే~~ లేదా ఏదైనా
ప్రత్యేక ఉత్పత్తుల గిరాకీ పడిపోయినప్పుడే, పరిణామ
దశా గందరగోళం లోని శ్రేణులకి ప్రమాదం ఏర్పడేది.

వృత్తికారులు వ్యక్తిగతంగా గాని లేదా
శ్రేణుల ద్వారా గాని ఉత్పత్తి చేసిన సరుకుల్ని "వణిజు" లనే
వర్తకులు అమ్మేవారు. సుదీర్ఘ రహదారి కోసం వర్తకాన్ని నిర్వహించే
వారిని "సార్థవాహులు" అనేవారు, వీరు దోపిడీలనుండి
రక్షణ పొందేందుకు అనేక బిడారులు (caravans)
గా కలిసి ప్రయాణం చేసేవారు. వాణిజ్య కార్యకలాపాల్ని
లకి నియమించే వ్యవస్థీకృత సంస్థలు అన్ని శ్రేణుల్లా
అత్యంత ప్రాబల్యం గలవి ఉండేవి — వీటిని 'పూగ'
'గోష్ఠి' మరియు 'నిగమ' అనేవారు. ఈ పేర్లను
కార్పొరేషన్లు, కమిటీలు, వర్తక మండలులు జరిగే ప్రాంతాలు
అని చెప్పవచ్చు. తక్షశిల, కౌశాంబి, భట్టిప్రోలు మొదలైనవి
'నిగమ'లతో సంబంధం గలిగినవి.

పురావస్తు తవ్వకాల ద్వారా శ్రేణుల,
కార్పొరేషన్ల చిహ్నాలు (emblems) గల ముద్రలు అనేకం
లభించాయి. శ్రేణుల పతాకాలు, ధ్వజాలు, చిహ్నాలు
మొదలైనవి ఉత్సవ సమయాల్లో ప్రదర్శించబడగా

అమరావతి స్థూపం బౌద్ధ స్థూపాల మీద రాతిఫలకాలపై
చెక్కబడి కన్పిస్తాయి. ఈ చిత్రాలు స్త్రీల పట్ల ఆదరణకి
ప్రబల ఉదాహరణలు గా చెప్పవచ్చు. అలాగే స్త్రీలు
మత సంస్థలకు చేసే దానాలు కూడా శాసనాలు గా రాయబడి
మరి ప్రాచుర్యం పొందేవి. ధార్మిక వర్తకులు విరివిగా
చేసిన దానాలు ; స్వర్ణ-వెండి నాణెలు బంగారాలతో, సాంచి
బౌద్ధ స్థూపాల చుట్టూ శిల్పాల అలంకరణలకు చేసిన దానాలు
గమనించవచ్చు. విదిశ లో పనిచేసే దంతపు పనివారు
సాంచి లో కొన్ని bas-reliefs చెక్కారు. ఇలాంటి
ప్రాంతాల్లో దానాలు చేసే దాతలు చుట్టుపక్కల ప్రాంతాల
నుంచే గాక దక్షిణ వంటి దూర ప్రాంతాల నుండి వచ్చేవారు/
ఇచ్చేవారు.

పశ్చిమ భారతం లో నాసిక్ గుహ లో శక
రాజవంశస్థులు వేయించిన శాసనం లో నేటపాయని స్త్రీ
లో అధిక ధనాన్ని నిల్వ ఉంచి దాని పై వడ్డీ ని ఈ 'సంఘ'
బౌద్ధ సంఘాని & విరాళం గా ఇచ్చినట్లు ఉంది. ఇలాంటి
శాసనాలు ఆ నాటి కాలం లో స్త్రీల యొక్క రాజకీయ ప్రాధాన్యత
ను స్పష్టం గా ప్రతిబింబిస్తాయి. పెద్దగ కొలాల్లో స్త్రీలు
చాలా శక్తివంతంగా స్వయం గా ఉన్నట్లు రాజకీయ
ముద్రలను స్పష్టంగా కూడా లేదా వదిలి ఆకారం
వంటి వాటిని ఉపయోగించేవారని తెలుస్తుంది. ఇలాంటి సిద్ధాంత
పరంగా చైనా రాజకీయాలు రాజు & మాతృస్వామ్య ప్రత్యేకంగా

గుర్తింపబడటం ఇందుకు కారణం కావచ్చు. రాజవంశం లో
చీలికలు పడటం (nexus) వారి కార్యకలాపాలకి
నిస్సందేహం గా రాజకీయ లబ్ధి చేకూర్చేదని చెప్పవచ్చు,
అయితే శ్రేణుల రాజకీయ కాంక్షలు కూడా ఆర్థిక కారణాల వలన
ప్రభావితం చేయబడ్డాయి. రాజవంశాల కు శ్రేణులలో ఆర్థిక
ఆసక్తులు ఉండేవి. సమర్థుల ఎంటర్‌ప్రైజులలో పెట్టిన
పెట్టుబడులు మంచి రాబడి నిచ్చేవి. ఇవి అంటే విలువ గల
భూముల పై నుంచి వచ్చే రాబడి కన్నా ఎక్కువ గా ఉండేవి. రాజులు
వాణిజ్య కార్యకలాపాల్లో పెట్టుబడులు పెట్టేవారు కాబట్టి
శ్రేణుల నుంచి వారు వారి నిక్షేపాల కోసం కృషి చేసేవారు.
సుస్పష్టమైన రీతి లో రాజ మద్దతు లభించటం, రాజు నుంచి ఒత్తిడి
వ్యాపారాల్లో తేవటం శ్రేణి నాయకుల్లో రాజకీయ కాంక్షల్ని
బలపరిచి ఉండవచ్చు. అయితే ఒక శ్రేణి రాజకీయ
అధికారం పొందాలి అంటే అది ముందు ఇతర శ్రేణులలో
ఇతరులతో వారి విధేయత సంపాదించాల్సి ఉంటుంది, ఇది
లేకుండా ఏ రాజకీయ కాంక్ష నెరవేరదు. అయితే వివిధ
శ్రేణుల మధ్య కులం పట్టింపుల వలన కలిసి భోజనం చేయటం
మొ॥ వారికి అవకాశం ఉండేది కాదు, ఇది శ్రేణులు దగ్గరకి
రావటానికి ముఖ్య అవరోధం. ఒకవేళ అలాంటి నియమాలు
పాటించబడకపోయినా రాజకీయం గా సహకరించు కోటానికి
వారి వాటికి వేరే కారణాలున్నాయి. దానాలు రాజులకి,
శ్రేణులకి, సంఘాలకి మధ్య ఐక్యత ఏర్పరచి వారి
మధ్య సంబంధాల్ని మరింత బలంగా మార్చేవి. శ్రేణి

ఆవిర్భావం అనుసరించి ఒక పట్టణ ప్రభావం, ఒక స్వాభావిక సాంఘిక వ్యవస్థగా శ్రేణి పట్టణ జీవితం యొక్క పెరుగుతున్న ప్రాధాన్యతను ప్రతిబింబించింది.

పైన చూపిన నాసిక్ శాసనం వంటివి నేతపనివారి, కుమ్మరుల, దంతపు పని వారి శ్రేణుల్లో పెట్టుబడులు పెట్టడాన్ని సూచిస్తుంది. శ్రేణులు బ్యాంకర్లుగా, ఫైనాన్షియర్లుగా, ట్రస్టీలుగా కూడా వ్యవహరించేవని శాసనాల ద్వారా తెలుస్తుంది. వడ్డీరేటు 12 నుంచి 15 శాతం మధ్య ఉండేదని తెలుస్తుంది.

— o —

వర్తకంలో ఎంతో విపరీతంగా పెరగడంతో ఉత్పత్తి, పంపిణీలు వ్యవస్థీకృతంగా సమర్థవంతంగా చేయాల్సిన అవసరం ఏర్పడింది. వృత్తిగల వృత్తికారులు సమూహంగా ఏర్పడి 'శ్రేణుల్ని' ఏర్పరిచారు. వర్తకులు కూడా సార్థవాహులుగా వ్యవస్థీకృతమయ్యారు. ఈ కాలంలో దాదాపు రెండు డజన్ల కు పైగా వృత్తికారుల శ్రేణులు ఉండేవని చెప్పవచ్చు. ఎన్నో / పెద్ద స్థాయిలో ఉత్పత్తులు అందిస్తూ ఈ కాలంలో 'శ్రేణి' సాధారణ ఉత్పత్తి విధానం అయ్యింది.

శాసనాల ద్వారా మధుర ప్రాంతంలో,

పశ్చిమ దక్కను లో శ్రేణులు అధికంగా ఉండేవని తెలుస్తుంది (9)
ముఖ్యంగా 'గోవర్ధన' వృత్తికారుల శ్రేణులకు ముఖ్యకేంద్రం
గా ఉండేది.

<u>శ్రేణులు బ్యాంకర్లు, ట్రస్టీలుగా, బ్రోకర్లు గా ఉండేవి.</u> క్రీ.శ. 2 వ శతాబ్దం లోని శాతవాహనుల శాసనం ద్వారా ప్రాచీన బౌద్ధ మతస్థులు కుమ్మరి, తైల పిండులు, నేతపనివారి శ్రేణుల వద్ద ధనాన్ని (వెండి నాణాలు) డిపాజిట్ చేసేవారని దాని పై వడ్డీ తో బౌద్ధ సన్యాసులకు వస్త్రాలు ఇతర అవసరాలు తీర్చడం శ్రేణులు బాధ్యత వహించేవని తెలుస్తుంది. సమకాలీన మధుర లోని లిఖితాధారం వలన ఒక పురుషుడు ధాన్యం మిల్లర్ల శ్రేణి వద్ద ధనం డిపాజిట్ చేసి దాని వడ్డీ ద్వారా 100 మంది బ్రాహ్మణుల పోషణ బాధ్యత అప్పగించడం కన్పిస్తుంది. శ్రేణులు వాటి వద్ద డిపాజిట్ చేయబడిన మూలధనాన్ని వినియోగించుకొని ఉత్పత్తి ని వృద్ధి చేసుకునేవి, వాటిని అమ్మడం ద్వారా వచ్చిన లాభాల నుంచి మూలధనం పై వడ్డీ ని చెల్లించేవి. ఉత్పత్తి ని మరింత పెంచాలనే కాంక్ష తో శ్రేణులు కార్మికుల్ని కూలికి నియమించుకోవడం లేదా బానిసల చేత పని చేయించుకోవడం కన్పిస్తుంది. ఇది సమాజం లోనే వృత్తికారులకు, హస్తకళాకారులకు కొంత స్వేచ్ఛ / వెసులు బాటు కల్పించేది.

శ్రేణుల వ్యవస్థీకరణ, ప్రాముఖ్యత, విధులు గురించి జాతక కథలు మంచి వివరాలు అందిస్తున్నాయి. వీటి ద్వారా గణనీయమైన రీతిలో వర్తకం, పరిశ్రమలు స్థానికమయ్యాయని, వివిధ వృత్తులు మంచి ప్రత్యేకీకరణ సాధించాయని ఇవి శ్రేణుల ఆవిర్భావానికి దోహదపడ్డాయని తెలుస్తుంది. ఈ ఆర్థిక కారణాలే గాక సంప్రదాయేతర మతాలు తెచ్చిన నూతన భావాలు కూడా శ్రేణుల వృద్ధికి దోహదమయ్యాయి. ఈ శ్రేణులు మరలా సంప్రదాయేతర మతాల్ని ప్రోత్సహించడం వాటి ద్వారా శ్రేణుల శక్తి, అధికారం, హోదా పెరగడం కన్పిస్తుంది.

వివిధ వృత్తుల వారసత్వ లక్షణం, ఫలితంగా వచ్చే ప్రత్యేకీకరణ, పరిశ్రమల స్థానికీకరణ, జేష్ఠక (అధిపతి) వ్యవస్థ మొ॥ లక్షణాల వలన ఈ శ్రేణుల్ని మధ్యయుగాల నాటి యూరప్ guilds తో పోల్చారు. అయితే శ్రేణి కి guilds కి మధ్య కొన్ని భేదాలున్నాయని ఆ అంతరం మన్నించి ఈ పోలికను అంగీకరించవచ్చని రొమిలా థాపర్ అన్నారు.

జాతక కథల ద్వారా 18 రకాల శ్రేణులు ఉన్నట్లు తెలుస్తుంది. వీటిలో [illegible] వడ్రంగం వారు, లోహకారులు, చర్మకారులు, చిత్రకారులు ముఖ్యంగా పేర్కొన బడ్డారు. పరిశ్రమలు స్థానికీకరణం చెందడం ద్వారా

ప్రాంతాల్లో వివిధ రకాల వర్తక సంఘాల పేర్లతోనే పిలిచేవారు — దంతపు పనివారి వీధి, వడ్రంగం వారి గ్రామం, కుమ్మరి వారి గ్రామం మొదలైనవి. కరీంనగరు (కరీంనగర లోని శాసనాల ద్వారా ఈ పద్ధతులకు ఆధారాలు దొరికాయి.

శ్రేణుల వద్ద నుంచి అత్యవసర సమయాల్లో రాజు ధనాన్ని అప్పు తీసుకోవాలని చెప్పబడిన సలహా కూడా శ్రేణుల ప్రాముఖ్యాన్ని తెలియచెప్తుంది. మనువు, యాజ్ఞవల్క్యుడు శ్రేణుల స్వభావం - 'శ్రేణీధర్మ'ను రాజ్యం కాపాడాలని, గౌరవించాలని చెప్పారు. శ్రేణి అధికారులు మంచి గౌరవం కలిగి ఉండేవారు, న్యాయ విచారణల్లో వారి సాక్ష్యాలకు చాలా బలం ఉండేది.

బౌద్ధ భిక్షువుల వసతార్థం శ్రేణుల వద్ద డిపాజిట్ చేసే ధనం లాంటివి వివరాల్ని సంప్రదాయం ప్రకారం 'నిగమసభ' వద్ద రిజిస్టర్ చేయించు కోవాల్సి ఉండేది.

శ్రేణుల వద్ద ఇతరులు ధనాన్ని డిపాజిట్ చేయటం ద్వారా దానాలు చేయటమే గాక శ్రేణులు కూడా అప్పుడప్పుడు స్వయంగా దానాలు చేసేవి. ధాన్యం వర్తకుల శ్రేణి పిడుగదుల గుహని దానం చేయటం ఇందుకు ఉదాహరణ. సాంచి స్థూపం వద్ద

దక్షిణ తోరణాలకు దంతపు పనివారి శ్రేణి దానం చేసింది. మౌర్యానంతర యుగం లో చిన్న చిన్న వృత్తుల వారు శ్రేణులు గా ఏర్పడటం కన్పిస్తుంది. వెదురు పనివారు, పిండి చేసేవారు, braziers మొ॥ వారి శ్రేణులు ఇందుకు ఉదాహరణ.

కొన్ని శ్రేణులకు వారి సొంత ముద్రలు, పతాకాలు ఉండేవి. ఇలాంటివి కొన్ని Basarh లో దొరికాయి.

ఈ శ్రేణులు వారి వర్తకాలు & పరిపాలనలు గా వ్యవహరించారు. శ్రేణి ధర్మాన్ని రక్షించడాన్ని నారద స్మృతి 'సంవిత్పత్ర' అని కాత్యాయన స్మృతి 'స్థితిపత్ర' అని పేర్కొన్నాయి.

తమ సరుకుల్ని రక్షించుకునేందుకు గాను శ్రేణుల కు కొంత పరిధి లో "సైన్యం" ఏర్పాటు చేసుకునేందుకు కూడా రాజ్యం అనుమతి ఇచ్చేదని తెలుస్తుంది.

# Post-Mauryan Economy



## సముద్ర మార్గం ద్వారా వర్తక వాణిజ్యాలు :

[మౌర్యానంతర యుగం లో భారతదేశానికి రోమ్ సామ్రాజ్యానికి మధ్య వర్తకం చురుకుగా సాగేది. మొదట్లో ఈ వర్తకం అధిక భాగం భూమార్గం ద్వారా సాగేది. కాని శకులు, పార్థియన్లు, కుషాణుల కదలికల వల్ల భూమార్గానికి అంతరాయం ఏర్పడింది. దాంతో క్రీ.శ. తొలి శతాబ్దం నుంచి ఈ వర్తకం ప్రధానంగా సముద్ర మార్గం ద్వారా సాగింది.

భారత ద్వీపకల్పం తో రోమ్ సామ్రాజ్య వాణిజ్య సంబంధాల్ని రెండు దశలు గా చూడవచ్చు.

1) అరబ్బులు మధ్యవర్తులు గా గల తొలిదశ
2) రుతు పవనాల సాయం తో ప్రత్యక్ష సంబంధాలు గల మలి దశ.]

చాలా కాలం పాటు అరేబియా సముద్రం లో నౌకాయానం తీరాల వెంట సాగేది. ఇది 'కష్టం' తో కూడిన సుదీర్ఘ యానం. క్రీ.శ. ఆరంభానికి పూర్వం అరబ్బులు అరేబియా ని వర్తక మార్గం గా చేసుకొని భారత్ తో సంబంధాలు ఏర్పరుచుకున్నారు. తూర్పు-పశ్చిమ వర్తకం లో గుత్తాధిపత్యం ఏర్పరుచుకోడానికి వారి భౌగోళిక స్థానం అరబ్బులకి అనువుగా ఉంది. అరేబియా సముద్రం లో

పవనగతుల గురించి వారికి కొంత అవగాహన ఉంది. వారు దీన్ని ప్రాకార రహస్యంగా ఉంచేవారు. ఈ విధంగా అరబ్బులు మధ్యవర్తులుగా ఉంటూ మంచి లాభాలు భారత్ – రోమ్ సామ్రాజ్య వర్తకం ద్వారా గడించేవారు.

క్రీ.శ. మొదటి రెండు శతాబ్దాలలో రోమ్ సామ్రాజ్యం భారత్ తో ప్రత్యక్ష సముద్ర మార్గాన్ని ఏర్పరచుకునే విధానం అవలంబించింది. క్రీ.పూ. 25 లో అగస్టస్ భారత్ ఆ సముద్ర మార్గం పై ఆధిపత్యం కోసం సైన్యాన్ని పంపాడు. తర్వాత క్రీ.శ. 45 లో హిప్పాలస్ ఋతుపవనాల్ని గమనించడం తో పరిస్థితి మెరుగుపడింది. ఆధునిక చారిత్రకులు హిప్పాలస్ 'ఋతుపవనాల' పేరుతో 'కనుగొనబడటం' అనేదేమీ లేదని అంటారు. ఏదేమయినా ఇకపై నౌకలు సముద్ర మధ్యమార్గం లో పయనించటం మొదలుపెట్టాయి - ప్రత్యక్షమార్గం ద్వారా సమయం తగ్గడం వలన తీరాలచే వాణిజ్యం పుంజుకుంది. రోమ్ సామ్రాజ్యం విస్తరించిన Pax Romana – విశ్వశాంతి కూడా ఇందుకు తోడ్పడింది. ఫలితంగా వర్తక మార్గాలకి భద్రత చేకూరింది. భారతీయ విలాస వస్తువులకి రోమ్ లో ఉన్న విపరీతమైన గిరాకీ కూడా ఈ వర్తకాన్ని బాగా ప్రోత్సహించింది.

విరివిగా సాగిన ఈ వర్తకంలో నిత్యావసర (17)
వస్తువులు లేకపోవడం ఆసక్తిదాయకం. ప్లినీ
అంచనాల ప్రకారం ప్రతి సంవత్సరం భారత దేశ
ఆదాయంలో 40 మిలియన్ల సెస్టెర్సులు (దాదాపు
50 మిలియన్ల పౌండ్లు) పోతుంది, భారతదేశ
వెల ఉన్న ఎన్నో రెట్లు ఎక్కువకి విలాసవస్తువుల్ని
ఉపయోగదారులకి అమ్మడం ద్వారా. అందుకే సెనెకా,
ప్లినీ వంటి వారు రోమన్ల ముఖ్యంగా రోమన్ స్త్రీలు విలాస
వస్తువాడకంపై తీవ్ర రోషం వెలిబుచ్చారు. అయినా భారతీయ
విలాసవస్తువులపై మోజు కొనసాగుతూనే ఉండేది.

## ఎగుమతులు - దిగుమతులు :

భారతదేశం నుండి ముఖ్య ఎగుమతుల్ని
3 రకాలుగా చెప్పవచ్చు.

1) మనుషులు, జంతువులు - జంతూత్పత్తులు, పక్షులు :

a) ఆడ బానిసలు, గాయకులు, మండవాళ్ళు, వంటవారు, వేశ్యలు

b) సింహాలు, చిరుతలు, కోతులు, పులులు, కుక్కలు, ఏనుగులు, ఖడ్గమృగాలు, కొండ చిలువలు..

c) చర్మాలు, తోలు/బొచ్చులు, వెన్న, ఉన్ని, మస్క్, కొమ్ములు, దంతాలు, ముత్యాలు, శంఖాలు, సిల్క్

1) బట్టలు, పెమళ్ళు

విలువైన సిల్క్ చాలా వరకు చైనా నుంచి వచ్చేది. మొదట్లో చైనా సిల్క్ ప్రత్యక్షంగా సిల్క్ రోడ్డు ద్వారా ఉత్తర ఆఫ్ఘనిస్థాన్, ఇరాన్ ల ద్వారా చైనా నుంచి రోమన్ సామ్రాజ్యానికి చేరేది. కాని ఇరాన్ పార్థియన్లు పాలకు లాగా వెళ్ళడంలో ఇబ్బందులు కలిగించారు. దాంతో ఎగుమతులు భారతదేశం ద్వారా చైనా నుంచి పశ్చిమ భారత ఓడరేవులకు చేరేది. కస్పియన్ సముద్రపు రేవుల ద్వారా కూడా వెళ్ళేది. ప్రత్యేకంగా మిరియాలు, దంతం, బట్టలు కి రోమ్ లో గిరాకీ ఎక్కువగా ఉండేది.

2) <u>వృక్ష ఉత్పత్తులు</u>:

మిరియాలు, బియ్యం, మలబాత్రం, స్పైకెనార్డ్ నూనె, గార్లాండ్స్, నీలిమందు, gingelly చెరుకు, మస్లిన్, ముడి పత్తి, ఎబాని, టేకు, రోజ్ వుడ్, గంధంచెక్క, కొబ్బరి, plantains, melons, వరి మొ॥ వి.

## 3) ఖనిజ ఉత్పత్తులు :



వజ్రాలు, క్వార్ట్జ్, sapphire, పగడాలు, beryl, asbestos, ఇనుము, ఉక్కు మొదలైనవి.

భారతదేశానికి రోమ సామ్రాజ్యం నుంచి దిగుమతయ్యే ముఖ్యాంశాలు - అందమైన గ్రీకు గాయనిలు, బానిసలు, కోరల్స్, టిన్, (నాణ్యమైన) సాంబ్రాణి / wine, లెడ్, రాగి, తగరం, పూలకుండీలు, లాంతర్లు, గాజు, అద్భుతమైన మృణ్మయ పాత్రలు.

భారతీయ వస్తువులకు రోమ సామ్రాజ్యం వారు ప్రధానంగా బంగారు నాణాలు ఇచ్చేవారు.

ఇక్కడ గమనించాల్సిన ముఖ్యాంశం - రోమన్లే దక్షిణ భారత రేవులకు వారి సరుకుల్ని తీసుకొచ్చేవారు. తిరిగి వారే భారతదేశం నుంచి సరుకుల్ని తమ దేశానికి తీసుకుపోయేవారు.

భారతీయ ఎగుమతుల్లో చాలా వరకు స్థానికంగానే లభించేవి, వర్తక సరుకుల్ని సేకరించే పని దక్కను లోనూ దక్షిణ భారతం లోనూ భారతీయ వర్తకులే చేసేవారు. వాగన్లు, మోతకుడు బండ్లపై వారి సరుకుల్ని రేవులకు చేర్చేవారు.

వర్తక సరుకుల్ని పశ్చిమ భూములకు చేర్చడం ప్రధానంగా విదేశీ వర్తకుల ద్వారానే జరిగేది. దక్కను

లోను, దక్షిణ భారతం లోనూ కొద్ది మంది భారతీయ
సముద్ర వర్తకులు ఉన్నప్పటికీ ఎక్కువగా విదేశీ వర్తకుల
ద్వారానే సరుకు పశ్చిమ దేశాలకు చేరేది.

[రోము తో వర్తకం అన్నది భారతదేశ విస్తృత
విదేశీ వాణిజ్యం లో ఒక భాగం మాత్రమే. అనేక
దూర ప్రాచ్య దేశాల సరుకులు భారతదేశం ద్వారా రోము
చేరేవి. ఫలితం గా చైనా నుంచి స్పెయిన్ వరకూ
మధ్యధరా తో సహా విస్తరించిన ప్రపంచ వాణిజ్యానికి
భారతదేశం కేంద్రం అయింది.]

[దక్షిణ భారతం లో శ్రీలంక తోనూ,
ఆగ్నేయాసియా తోనూ వర్తక సంబంధాలుండేవి. ఈ వర్తకం
లో సుగంధ ద్రవ్యాలు [spices], కర్పూరం, గంధం చెక్క
ప్రధాన పాత్ర పోషించేవి. ఈ వర్తకం లో తమిళ వర్తకులు
చొరవ చూపేవారు.] శ్రీలంక వర్తకులు తమిళనాడుకు వచ్చేవారు
కూడా. తమిళ బ్రాహ్మీ లో రాయబడ్డ శాసనాలు శ్రీలంక/
కాలం నుంచి వచ్చే వర్తకుల్ని పేర్కొంటున్నాయి,
అయితే ఈ వర్తక వివరాలు తెలియడం లేదు.

RT
Romila
Thapar

తూర్పు తీరం లాంటి ప్రాంతాలతో శ్రీలంక తో సంబంధాలుండేవి. పూర్వం రోమను ఓడల నుంచి సరుకు పశ్చిమతీర రేవుల్లో దించేవారని, అక్కడ నుంచి భూమార్గం ద్వారా తూర్పు తీరం చేరేదని ⊗ భావించేవారు, ⊗ అక్కడ అరికమేడు మొ॥ ప్రాంతాలు వర్తక కేంద్రాలయ్యేవని.

మన దేశానికి వచ్చే (incoming) సరుకును అక్కడ డిస్ట్రిబ్యూషన మరియు ఎగుమతి చేయడానికి తీసుకునేవారు. ముఖ్యంగా ఎర్రసముద్ర రేవులకి పంపడానికి ప్రత్యేకంగా ప్యాక్ చేసేవారు.

అయితే ప్రస్తుతం రోమను ఓడలు దక్షిణ భారతం మరియు శ్రీలంకల మధ్య సముద్ర ప్రమాదాలు ఉన్నప్పటికీ అవి తూర్పుతీర రేవులకి ప్రయాణించేవని భావిస్తున్నారు.

అరేబియా దక్షిణ ప్రాంతాలు వాటి వ్యవసాయసంపదకి అలాగే వర్తక ఆదాయానికి గర్వపడ్డాయి. భారతీయ వర్తకసరుకులు గా రాగి, గంధం చెక్క, టేకు, ఎబొని మొ॥నవి చెప్పవచ్చు. భారతదేశానికి ఎగుమతులుగా సారాయి, dates, బంగారం, శిక్షణ పొందిన బానిసలు వచ్చేవారు / లభించేవి. ఈ రేవుల్లో కొన్ని ఎప్పటి నుంచో వాడకం లో ఉన్నవి ఉన్నాయి. భారత దేశానికి దగ్గరగా బార్బరికం [On the Indian side Barbaricum was much frequented

importing linen] లినెన్, టోపాజ్, కోరల్,
స్టోరాక్స్, ఫ్రాంకిన్సెన్స్, గాజు, వెండి, బంగారు పాత్రలు,
సాధారణ దిగుమతయ్యేవి. కాగా రకరకాల
సుగంధ ద్రవ్యాలు, turquoise, లాపిస్ లజులీ, మస్లిన్,
సిల్క్ దారం, నీలిమందు మొ॥నవి ఎగుమతయ్యేవి.
[పశ్చిమతీరం లో 'బరుకచ్ఛ' అతిపెద్ద ప్రవేశద్వారం,
పశ్చిమ ఆసియా తో సముద్ర వాణిజ్యం లో చాలా
వరకు ఈ రేవులోనే జరిగేది.] బరుకచ్ఛ కి
వచ్చే దిగుమతుల్లో సారాయి, తగరం, కోరల్, టోపాజ్,
gauze, స్టోరాక్స్, తియ్యని లవంగాలు, గాజు, రియల్గార్,
అంటిమొని, వెండి పాత్రలు, బంగారు-వెండి నాణాలు
ఉండేవి. బరుకచ్ఛ ఎగుమతుల్లో సాధారణ సుగంధ
ద్రవ్యాలు, స్పైకెనార్డ్, మలబాత్రం, వస్త్రాలు, రత్నాలు
ఇతర విలువైన రాళ్లు మొ॥నవి ఉండేవి. ఈ జాబితా
ద్వారా తరచుగా పెద్ద సమాచారం మార్పిడి
అవుతుండేదని తెలుస్తుంది.
(మలబాత్రం → వైద్య పూతల తయారీ లో వాడతారు.)

భారత్ నుంచి పశ్చిమ ఆసియా కు
తీర మార్గం చాలా కష్టంగా ఉండేది, అత్యవసర
సరుకుల ఉచ్చు వర్తకానికి (looping trade) ఈ
మార్గమే ఉపయోగించబడింది. అరేబియా సముద్ర మధ్య
మార్గం నైరుతి రుతుపవనాలు వేసవిలో వీయడం ద్వారా
సులువైపోతుంది. ఈ పవనాలు సముద్రమధ్య మార్గాన్ని తీర
మార్గం కన్నా వేగం చేశాయి. బహుశా ఈ పవనాల్ని ఈ
ప్రాముఖ్యం కోసం తెలుసుకుంది అరబ్బులు చెప్పవచ్చు.
క్రీ.పూ. మొదటి శతాబ్దం మధ్యలో మధ్యధరా ప్రపంచ
వర్తకులు కొందరు వాటి ఉపయోగాన్ని గుర్తించారు. గ్రీకు
ఆధారాలు హిప్పాలస్ discovery ద్వారా
నౌకాయానం లో జరిగిన మార్పులు వచ్చినట్లు
చెబుతున్నాయి. హిప్పాలస్ పవనాల్ని కనుగొన్న వ్యక్తి
పేరు గా తప్పుగా భావించేవారు, కాని ప్రస్తుతం హిప్పాలస్
పవనాలకు ఇవ్వబడిన పేరు గా తెలుస్తున్నది. ఎర్రసముద్రం
దక్షిణ కొన నుండి బయలు దేరే ఓడలు నైరుతి రుతుపవనాల
వాటి తీవ్రత దశ ను దాటే దాకా ఆగి తక్కువ తీవ్రతగల
పవనాల సాయం తో ప్రయాణాన్ని ఆరంభించేవి. భారత్ నుండి
తిరిగి వచ్చే ఈశాన్య రుతు పవనాలు శీతాకాలంలో ఈ
ఓడల్ని వెనక్కి తీసుకెళ్లేవి. పవనాల్ని నౌకాయానం కు
వాడుకోవటం వలన వర్తకులు, సముద్రయానికులు
(seamen) ఈజిప్టు నుంచి వచ్చేవారు కొద్ది కాలం

పాటు ఇతర సముద్ర దేశాలకు అరబ్ వెళ్ళేటందుకు భారత
తీరం లో వేచి ఉండాల్సి వచ్చేది, ఫలితంగా
భారతీయులకు, యవనుల మధ్య సంబంధాలు
పెరిగేందుకు అవకాశం వచ్చింది.

భారత్ లో రోమను వర్తకానికి అలా వారవ ప్రభావం
నుండే వచ్చిందనీ ఈ తర్వాత కూడా అదే కొనసాగిందనీ
ఒక వాదన ఉంది. ఈ వర్తకం మొదట రోమన్ సామ్రాజ్యం
దీనికి ఆధారాలు గ్రీకు, లాటిన్ లో ఉన్నాయి, అవి
ఎక్కువ గా రోమను సామ్రాజ్యమే వర్తకం చేసేది
అని గా చూపాయి. అప్పటి నుంచి ద్వీపకల్ప భారత
అక్షాంశ పటం ముఖ్యంగా వర్తక ఆధారాలు కనుగొన
బడ్డాయి. పైన చెప్పిన వాదన వాస్తవమైన
భారత దేశం వర్తకం లో పాలుపంచుకున్నదనే
ఆధారాల ద్వారా తిరస్కరించబడింది. ద్వీపకల్పం
లో అంతకుముందే
ఉన్న వర్తక మార్పిడి మార్గాల్లో గమనిస్తే, ఇప్పుడు
కొత్త లో వర్తకం అంత విప్లవాత్మకమైన
innovation ఏమీ కాదు. తమిళ బ్రాహ్మి లో,
ప్రాకృతం లోనూ భారతీయుల పేర్లు రాయబడిన
మృణ్మయపాత్రలు ఇటీవల తవ్వకాల్లో ఎర్ర సముద్ర

రేవుల్లో బయటపడ్డాయి, ఇవి భారతీయులు
వర్తకం లో చూపిన చొరవ కు ఆధారాలు గా నిలుస్తాయి.
రోమను సామ్రాజ్య నాణాలు దొరకడం; భారతీయ వస్తువుల
వాటి మార్పిడుల ఆధారాలు లభించడం; దక్షిణ లాంటి
ఇక్కడ బౌద్ధ స్థలాల్లో యవన దాతృత్వాలు ఉండడం ఇవన్నీ
ఈ వర్తకం లో భారతీయుల అస్థిత్వాని కి గుర్తులుగా
పైన భేదాన్ని సాక్ష్యం చెబుతున్నాయి. వర్తక కేంద్రాలు,
వర్తక సమూహాల్లో పరిసరాలు శాశ్వతం కావు. మొదట్లో
లాభాపేక్ష గా వర్తకాని కి వచ్చిన అలెగ్జాండ్రియా
మార్కెట్ల నుండి వచ్చినట్లయితే, ఈ ఆసక్తుల నుండి
లంబాల్ని ఏర్పడడం లో భారతీయ networks
నిదానంగా ఏమీ లేవు. వర్తకం
యొక్క భారత పక్షాన్ని నియంత్రించడం లో
కూడా అవి మెల్లగా ఏమీ లేవు.

క్రీ.శ. ఒకటి శతాబ్దం మధ్యకి చెందిన
"పెరిప్లస్" ఎర్ర సముద్రం, భారత తీరాల వెంట రేవులు,
మార్గాలు, రేవుల hinterlands గురించి విపులంగా వివరిస్తుంది.
వర్తక మార్పిడి సరుకుల్ని విశదీకరిస్తుంది.

కొచ్చి సమీపంలో ఉన్న "ముజిరిస్"
మిరియాలు, సుగంధద్రవ్యాలు (spices) మరియు beryl
వర్తకం లో ముందుకుంది. ఇటీవలే లభించిన రోమ

papyrus (క్రీ.శ. 2వ శతాబ్దం) లో ఓ వర్తక
ఒప్పందం దీన్ని సమర్థిస్తుంది. నాణాలు లభించిన
ప్రాంతాల ద్వారా ముజిరిస్ నుండి వయా పాల్ఘాట్
కనుమ ద్వారా beryl సమేత ఉత్పత్తుల కావేరీ లోయ
గుండా తూర్పు తీరానికి మార్గం ఉండేదని తెలుస్తుంది.

పెరిప్లస్ లోని మార్గం ద్వీపకల్ప అగ్రం
చుట్టి తూర్పు తీరం పై దాకా సాగుతుంది. అందులో చెప్పిన
రేవుపట్టణాలలో "అరికమేడు" (పడౌక) గురించి వివరాలు
తెలుస్తుంది. ఈ ప్రాంతం లోని తవ్వకాల ద్వారా విస్తృత
జనావాసాలు (settlements) బయల్పడ్డాయి, ఇవి
తూర్పు మధ్యధరా వర్తకులతో సంబంధాలకి ఆధారాల
నిస్తున్నాయి. ఆగ్నేయ భారతం లో అరికమేడు కేవలం
మజిలీ రేవు / విడిది రేవు మాత్రమే కాదు, స్థానికంగా
లభించే వస్తువుల ఎగుమతి చేసేది. అరెటైన్ రోమను
వారికి ప్రత్యేకించబడిన కొన్ని రకాల వస్త్రాలు (స్థానికంగానే
తయారు చేసేవారని భావిస్తున్నారు) పచ్చిమణులు & ఉత్తమమైన
రాతి పూసలు ఓడల కెక్కించేవారు. ప్రభావితమైన
రోమను మృణ్మయ పాత్రలు — చిత్రిత సిగిల్లాటా, అరెటైన్,
amphorae sherds, అరెటైన్ కూజాలు, గాజు, చిత్రశిలలు
మొ॥ వాటి ద్వారా కనీసం క్రీ.పూ. మొదటి శతాబ్దం
నుంచి రోమను settlement ఇక్కడ క్రియాశీలకంగా
ఉండేదని తెలుస్తుంది. ద్వీపకల్పం లో దక్షిణ మధ్యం

మధ్యధరా తయారీదార్ల ఎరుపు వెలిగె ఉంది, దక్షిణ ఇటలీ-గ్రీసు దీవుల నుండి తయారైందిగా భావిస్తున్నారు. కొరికె, అరికమేడు, కొడుమనాల వంటి తీర ప్రాంతాలు కూడా ఈ వర్తక సంబంధాలకి బలమైన ఆధారాలనిచ్చాయి.

రోమను వస్తువులకి కంచు, మట్టి లో అనుకరణలు లభిస్తున్నాయి. నెక్కుండ్రం, పొన్నైదాన ల కంచు విగ్రహాలు తవ్వకాల్లో బయటపడ్డాయి. ఇవి భారతీయ వర్తకులు గుర్తుగా తెచ్చుకున్నవి అయ్యే అవకాశం ఉన్నా రోమను వర్తకులు భారతదేశం లో నివసించారనడాన్ని నమ్మిస్తాయి. రోమను నాణాల ను పోలిన మట్టి bullae సాధారణంగా లభిస్తున్నాయి. సంగం పాండ్య, చేర, చోళ నాణాలుగా కొన్ని నాణాలపై పంచమార్కు నాణాల్ని పోలిన బొమ్మలున్నాయి. అయితే వీటిపై మాత్రం రోమను నాణాల వలె స్థానిక రాజుల్ని చిత్రించే యత్నం జరిగింది. ఈ నాణాల ముద్రణ నిమ్నస్థాయిలైన వస్తుమార్పిడి గాక బాగా వృద్ధిచెందిన వర్తక మార్పిడి రూపం అవల్సి ఉండేదని తెలుస్తుంది.

రోమను మార్కెట్లు లో బాగా గిరాకీ ఉన్న ఉత్పత్తుల్ని ప్రధానం గా రోమను నాణాల తోనే మార్పిడి చేసేవారు. దక్కను లోనూ, దక్షిణ భారతం లోనూ తరచుగా లభించిన నాణాల ద్వారా వర్తకం లో వాటి ప్రాధాన్యత వెల్లడి అవుతుంది. రోమను చరిత్రకారుడు ప్లినీ తూర్పు వర్తకం రోము ఆదాయానికి సంవత్సరానికి 550 మిలియన్ సెస్టెర్సుల దాకా గండి కొడుతుందని విమర్శించాడు, ఇలా కేవలం

$\frac{1}{5}$ వ వంతు భారత్ కు చేరేది. భారత్ నుంచి దిగుమతులు సాధారణంగా [illegible] పెరుగుతూ వస్తుంటే — అందువల్ల వర్తక శేషం (BoTrade) భారత్ కు అనుకూలంగా ఉండని భావించేవారు. కానీ, ఇటీవలి కాలంలో కొత్త వాదన వినిపిస్తుంది. ఒకవేళ ప్లినీ గణాంకాలు సరైనవే అయినా తూర్పు నుంచి వచ్చే దిగుమతులపై రోమను ఈజిప్టులో వేసే [illegible] సుంకాలు, పన్నులు ఈ వర్తకానికి ఆరంభ outlay లాంటి ధన నష్టం ని పూరించేంత ఎక్కువగానే ఉండేవని వాదిస్తున్నారు. అంతేగాక టైబెరస్, [illegible] ప్లినీలు (— ఇద్దరూ భారత్ కు రోమను ధన ప్రవాహాన్ని గూర్చి విమర్శించినవారే) రోమను పాట్రీషియన్ సమాజం యొక్క సంపద ప్రదర్శన పై నైతిక తీర్పు చెప్పడం గురించి ఎక్కువ విచారించినట్లు కన్పిస్తుంది, ఈ విషయాన్ని గూర్చి చెప్పిందే వర్తకాన్ని వాదుతున్నట్లు కన్పిస్తుంది. ఏదేమయినా, భారత ద్వీపాల వర్తకులకు ఇది లాభదాయకమైన వర్తకమని నిస్సందేహంగా చెప్పవచ్చు. మిరియాలనుంచి వచ్చే లాభాలు అంతులేనివి. భారతీయ, యవన వర్తకుల మధ్య సంబంధాల్ని / సంబంధాల స్వభావం లాంటి మార్పులపై, అలాగే, భారత దేశంలో ఉన్న వర్తక మార్గాల networks మీదా, ఇవి ఏ విధంగా విస్తృత వర్తకం లోకి లాగ బడలేదా అన్న వాటిపై నేడు ఆసక్తి పెరిగింది. వర్తక నెట్‌వర్కులపై కేంద్రాలు, వాటి

పరిసరాలు; పాటు మారుతున్న పోకడలు వీటిని అధ్యయనం చేయడం ద్వారా ఈ వర్తకం ను అవగాహన చేసుకోవడానికి మరో కోణం అందిస్తాయి.

తూర్పు మధ్యధరా నుంచి యవన వర్తకులు శాతవాహనుల తోనూ, ఇతర దక్షిణాది లతోనూ వర్తకం చేసేవారు, దక్కను లోని బౌద్ధ కేంద్రాల శాసనాల ద్వారా వారి ఇక్కడ ఉనికి తెలుస్తుంది. పశ్చిమం నుంచి వచ్చే వర్తకులు రోము లోని రోమన్లు కారు, కాని రోమను సామ్రాజ్యం లో భాగాలైన ఈజిప్టియను యూదులు, అలెగ్జాండ్రియా గ్రీకులు, తూర్పు మధ్యధరా గ్రీకులు, కొంతమంది ఉత్తర ఆఫ్రికా నుండి వచ్చేవారు. ఈ సంబంధాలు తర్వాతి కాలాల్లో క్రైస్తవ శిష్యుడు సెయింట్ థామస్ భారత దేశానికి రావడానికి సుగమం చేసి ఉంటాయి. కొందరు ఇండో-గ్రీకులు, వాయవ్యం లోని వర్గాల వారసులు కూడా ఉండి ఉంటారు.

[ఆగ్నేయాసియా మరియు భారతీయ వర్తకులు వర్తక మార్గాల విస్తరించుకుపోవడమన్నది రోమను వర్తకం ద్వారా మరింత బలపడింది. భారతీయ వర్తకులు తూర్పు ప్రధానంగా భారత్ లో లభించని సుగంధద్రవ్యాల(స్పైస్). అన్వేషణ పెట్టిన మార్గం సముద్రమే అయినా అది ఎక్కువ ప్రమాదాలతో కూడుకున్నది సువర్ణద్వీపాలకు (జావా, సుమత్రా, బాలి) వర్తకులు చేసే సాహసయాత్రలు (కథాసరిత్సాగరం ద్వారా తెలుస్తుంది. కాని ఈ సుగంధ ద్రవ్యాల

అతిగ్నాంద్రియమైన వర్తకులు : అవసరం ద్వారా వచ్చే ఆర్థిక
లాభాలు ఈ ప్రమాదాన్ని భర్తీ చేసేవి. రోమను
వర్తకం తగ్గుముఖం పట్టిన తర్వాత ఆగ్నేయాసియాలో
భారతదేశ వర్తకం విస్తృతమై పెంపొందిన సంబంధాల నుండి
ప్రోత్సహించబడింది.

చైనా, భారత్ లతో ఆగ్నేయాసియా
సంబంధాలు క్రీ.శ. తొలి శతాబ్దాల నుంచి మొదలయ్యాయి.
దీంతో ద్వీపాలు, కాంబోడియాన్ దంపరల రాష్ట్ర, బ్రాహ్మణ
ఆర్యారాలలో ఉన్న మూడు ఇవన్నీ భారతీయ వర్తకులు ఉండి
ఉండేవని సూచిస్తాయి. భారత్ కు దగ్గరగా ఉన్న "శ్రీక్షేత్ర",
(near Prome) మయన్మార్ ; సియాం గల్ఫ్ వద్ద
గల Oc-eo వంటి ప్రాంతాలలో భారతీయ వర్తకుల
పునుగడ మరింత ఎక్కువగా ఉండేది తెలుస్తుంది. ఆగ్నేయాసియా
లోని పాలకవర్గ అవసరాల ద్వారా ఆసక్తిగలవే స్థానిక సంస్థలుగా
బలపడ్డాయి, భారతీయ వర్తకులు వీటితో సంబంధాలు
కలిగి ఉండేవారు. ఆగ్నేయాసియా లోని స్థానిక సంస్థలకు
మధ్య వర్తక సంబంధాల పరిణామం దక్షిణ భారతం
లో వలెనే ఉంది — వస్తు మార్పిడి వర్తకం గా
పరిణామం చెందడం, ఆరంభ దశలోని నగరీకరణ మొదలైన-

ఈ సంబంధాలన్నింటిలో కొట్టొచ్చినట్లు (31)
కన్పించే లక్షణం — సంస్కృతులను సృష్టించటానికి
ఏదో ఒక్క అంశం (strand) కారణం కాకపోవటమే.
ప్రతిదీ మరొకదానిపై ఆధారపడి ఉంది, ఆ మరొకది దూర
దూరాలను ప్రయాణించి ఉండొచ్చు. వీటిలో ఏ సంస్కృతిని
ఏ కాలంతో పర్చలేము, వాటి అస్తిత్వానికి సంబంధం
లేని ఉండటం అత్యవసరం. ఈ కార్యకలాపాల వల్ల
ప్రాంతం అర్థం కూడా విస్తృతమౌతుంది. వాయువ్య భారతం
అంటే తప్పని సరిగా ఆఫ్ఘనిస్తాన్, మధ్యఆసియాల వైపు
ప్రాంతం కూడా చేరుతుంది. ద్వీపకల్పానికి గల తూర్పు, పశ్చిమ
తీరాలు కూడా ఆగ్నేయాసియా, మధ్యధరా లతో విరివిగా
వర్తకం చేస్తున్నాయి. దాని భౌగోళిక స్థానం ద్వారా ; ఆర్థిక
enterprise ద్వారా భారతదేశం క్రీ.శ. మొదటి సహస్రాబ్ది లోని
తొలినాటి ప్రపంచ వాణిజ్యం లో సమర్థవంతమైన పాత్ర
పోషించింది.

---

[రోమను లింక్ కి తెలుసనంతగా అన్య
వస్తువులు మన దేశం లో లభించేవి కావు, ముఖ్యంగా
సుగంధ ద్రవ్యాల్ని చెప్పవచ్చు. ఈ కొరత శ్రీలంక లో ఒకవైపు
ఆగ్నేయాసియా తో మరొవైపు భారత వర్తకాన్ని తప్పనిసరి
గా ప్రోత్సహించింది.] ఏనుగు దంతం, తాబేలు డిప్పలు,
ఇతర వర్తక సరుకుల్ని విరివిగా సిలోను నుండి భారత

దేశం కు తెచ్చేవారని స్ట్రాబో (63 BC – AD 21)
తెలియజేశాడు. తూర్పు ఇండోనేషియా నుండి గంధం చెక్క,
ఆగ్నేయాసియా ప్రధాన భూభాగం నుండి Cinnamon
మరియు Cassia ; మలయా ద్వీపకల్పం నుండి
కర్పూరం ; సుమత్రా - బోర్నియో లనుండి గూడా
కర్పూరం తెచ్చేవారు. వీటన్నిటి ద్వారా భారత్ కు
ఆగ్నేయాసియా తో ఉన్న వర్తకం పశ్చిమ హిందూ మహా
సముద్రం లోని వర్తక కార్యకలాపాలకి మద్దతు ఇచ్చే
-దని వెల్లడి అవుతుంది.

— o —

మలబారు రేవుల నుంచి ఎగుమతి చేయబడే
ముత్యాలు, విలువైన రాళ్ళు మొ॥నవి శ్రీలంక
నుండే అధికం గా వచ్చేవని ప్లినీ మొ॥ వారి రచనల వల్ల తెలుస్తుంది

[పశ్చిమాన వర్తకం - వాణిజ్యం అరబ్బు,
రోమను వర్తకుల ఆధిక్యం లో ఉండగా ఆగ్నేయాసియా
మార్గం లో భారతీయ వర్తకులు పూర్తి ఆధిక్యత కలిగి
ఉండేవారు. ఆగ్నేయాసియా భారత్ కు దూర ప్రాచ్య
వర్తకం లో విడిది రేవుల్ని అందించడం మాత్రమే గాక దాని
ఖనిజ, వ్యవసాయ ఉత్పత్తుల గూడా భారత్ కు అందించేవి.]

[మౌర్యానంతర యుగం లో బర్మా కు భారత్ కు
ప్రత్యక్ష వర్తక సంబంధాలు ఉండేవి అని చెప్పవచ్చు.]

భారత్ కు దక్షిణ చైనా సముద్రాలకి మధ్య మలయా ఉండేది. హిందూ మహాసముద్ర ఇండో-చైనా ప్రధాన భూభాగానికి దక్షిణ చైనా సముద్రానికి మధ్య ఉంది సమీప మార్గంగా వర్తకులు మలయా లోని "Isthmus of Kra" ను వాడుకునేవారు.

రామాయణం లో శిశిర పర్వతం నుంచి (యవద్వీప ఇండోనేషియా లోని సెలెబెస్ లో ఉంది) గంధం తెచ్చి తేవడం చెప్పబడింది. Oc-Eo లోని తవ్వకాల ద్వారా ఆగ్నేయాసియా కు భారత్ తో వర్తక సంబంధాల గురించి వివరంగా తెలుస్తుంది. పశ్చిమాసియా కి భారత్ నుండి ఎగుమతి అయ్యే విలువైన రాళ్ళ పెద్దసంఖ్య లో ఇక్కడ బయల్పడ్డాయి. ఇక్కడి ఆభరణాలపై భారతీయ, రోమను ప్రభావం ఉంది. ఇక్కడి వస్తువుల మీద లిపి కూడా భారతీయ ప్రభావాన్ని చూపుతుంది. అరికమేడు రోమను సామ్రాజ్యానికి, థాయిలాండ్, చంప మరియు చైనాల మధ్య వర్తకానికి entrepot అని తెలుస్తుంది.

పెరిప్లస్ ద్వారా చైనా (Thinae) నుండి ముడిసిల్క్, సిల్క్ దారం, సిల్క్ వస్త్రాలు భూమార్గం ద్వారా బాక్ట్రియా కి చేరి అక్కడ నుంచి బరుకచ్ఛ చేరేవి లేదా బ్రహ్మపుత్ర గంగానది మార్గం ద్వారా కోరమాండల్ తీరం చేరేవని తెలుస్తుంది.

చైనా చరిత్రకారుడు పాన్-కు (క్రీ.శ. 1వ శతాబ్దం) ఉటంకించిన దాని మేర చైనా వర్తకులు విదేశీ

ఇడల్లో పయనించి వయయాంగ్-చె రాజ్యం వెళ్లేవారని రాశాడు. వారు ముత్యాలు, గాజు, అమూల్యమైన రాళ్లను బంగారం, వెండి లతో మార్పిడి చేసుకునేవారని కూడా పేర్కొన్నాడు. వయయాంగ్-చె ను 'కంచి' గా గుర్తించారు. అంటే దక్షిణ భారతానికి చైనా తో క్రీ.పూ. 1 వ శతాబ్ద ద్వితీయార్థం నుంచి వర్తక సంబంధాలు ఉండేవని తెలుస్తుంది.

మధ్యధరా ప్రాంతం నుంచి వర్తకులు ప్రధానంగా బరుకచ్ఛ, అరికమేడు, తామ్రలిప్తి రేవులకు, అప్పుడప్పుడు ఇతర రేవులకూ వచ్చేవారు. సంగం సాహిత్యం లో యవన వర్తకులు కావేరిపట్నం లోకి వారి ఓడలలో సరుకులు తెచ్చేవారని ఉంది.

[మస్లిన్, ముత్యాలు, ఆభరణాల రాళ్లు మొదలైనవి మధ్య, దక్షిణ భారత్ ల నుండి రోమన్లు తీసుకెళ్లేవారు, వీటిని ప్రత్యక్షంగా మనదేశమే అందిస్తుంది కాబట్టి "టెర్మినల్ ట్రేడ్" అనవచ్చు. ఇదికాక భారత్ "ట్రాన్సిట్ ట్రేడ్" కూడా నిర్వర్తించేది, ముఖ్యంగా చైనా సిల్క్ ను చెప్పుకోవచ్చు]

## సముద్ర మార్గాలు - ఓడ రేవులు



పశ్చిమ దిశగా పయనించే ఓడలు సాధారణం గా రెండు మార్గాలు అనుసరించేవి.

1) పర్షియన్ గల్ఫ్ పై దాకా తీరం వెంట పయనించి బాబిలోన్ చేరుకోవడం

2) అరేబియా సముద్రం మధ్యగా పయనించి ఏడెన్ లేదా సొకోట్రా చేరి అక్కడ నుంచి ఎర్రసముద్రం వెళ్లేవి. సూయజ్ వద్ద సరుకును దింపి భూమార్గం ద్వారా అలెగ్జాండ్రియా చేరేవి. మధ్యధరా ప్రాంతాలకు ఈ అలెగ్జాండ్రియా entrepot గా ఉండేది.

'పెరిప్లస్' లో అరబ్బు, గ్రీకు జనావాసాల తో పాటుగా భారతీయ జనావాసాలు కూడా Dioscorida (Socotra) లో ఉన్నట్లు చెప్పబడింది. ఇండో-ఈజిప్షియన వర్తకం లో Eudaemon Arabia (Aden) మొదటగానే భారత్ - తూర్పు ఆఫ్రికా వర్తకం లో ఈ సొకోట్రా దీవి half-way station గా పనిచేసింది.

వాయువ్యప్రాంతాలకి సింధు హైదరాబాదు లోని 'బార్బరికం' మంచి రేవుపట్టణం గా ఉండేది. అప్పటి కాలం లో అది పూడుకుపోవడం వలన పనికి రాలేదు. దీని అంతర్భూమి (hinterland) గాంధార వరకూ ఉండేది. అంతకు ముందు శతాబ్దాలలో వలెనే 'భరుకచ్ఛ'

ప్రధాన రేవు గా కొనసాగింది. దీని అంతర్భూమి
గంగా మైదానాల దాకా ఉండేది. బరుకచ్ఛ ను
చేరే ఓడల్ని పైలట్ పడవల ద్వారా వాటి బెర్త్
లకు చేర్చేవారు. జాతక కథల ద్వారా బాబిలోన్
(బవేరు) తో సంబంధాలు తెలుస్తున్నాయి. అరేబియన్
గల్ఫ్ నుంచి అనేక ఓడలు గల్ఫ్ ఆఫ్ కాంబే వచ్చేవి.
కాని వర్తకం లో పెద్ద మొత్తం పశ్చిమ తీరం లో దిగువన
ఉన్న ఇతర రేవులు సోపారా, కల్యాణ్, మొ॥ వాటి ద్వారా
సాగేది. ముజిరిస్ రేవు దక్షిణాన గల ముఖ్య
కేంద్రాలతో కలుపబడి ఉండేది.

తూర్పుతీరం లోని రేవులు భూతల
నదుల estuaries వద్ద ఉండేవి. గంగా తీరం
లోని "తామ్రలిప్తి" పెద్ద రేవు. తామ్రలిప్తి కి
గంగ వెంబడి నది వర్తకం తో . వాయువ్యం నుంచి
వచ్చే గంగా మైదానం గుండా వచ్చే వర్తక మార్గాలతోనూ
సంబంధాలు ఉండేవి. గంగా మైదానం లో ఖరోష్ఠి
లిపి లో దొరికిన sherds ఇందుకు ఆధారం.
సింహళ బ్రాహ్మి లిపి ఆధారాలు కూడా గంగా మైదాన
ప్రాంతం లోనూ దీవి లోనూ దొరికాయి. ఈ
ప్రాంతాల మధ్య వాణిజ్యానికి ఇవి సూచనలు.

## భూమార్గ విదేశీ వాణిజ్యం - వర్తకం :

పశ్చిమ ఆసియాతో భారత సంబంధాలు కొన్ని భూమార్గాల ద్వారా సాగేది. ఇవి భారత్ లోని ఆయా ప్రాంతాలు, వర్తక కేంద్రాలనుంచి మొదలై కొనసాగేవి. వీటిలో ప్రధానంగా పుష్కలావతి నుండి మొదలై ఖైబర్ కనుమ ద్వారా కాబూల్ లోయ, హిందూకుష్ లు దాటి బాక్ట్రియా వద్ద ముగిసేది. బాక్ట్రియా భారత్, చైనా, మధ్య ఆసియా మరియు మధ్యధరా ప్రపంచానికి ట్రాన్సిట్ వర్తకానికి ముఖ్య కేంద్రంగా పనిచేస్తుండేది. బాక్ట్రియా నుంచి వర్తకమార్గం పశ్చిమంగా పయనించి పర్షియన్ ఎడారి ఉత్తర భాగం మీదుగా ఆరియా (హేరత్) మార్జియానా (మెర్వ్) కాస్పియన్ లోయ లను దాటుతూ టైగ్రిస్, యూఫ్రటీస్ లను దాటి సిరియా లోని ఆంటియోక్ చేరేది.

సింధు లోయ నుంచి పశ్చిమ ఆసియాకి మరో రెండు మార్గాలుండేవి. వాటిలో ఒకటి బోలాన్ లేదా ముల్లా కనుమ నుండి పయనించి హేరత్-కాందహార్ ల మధ్యనున్న విశాల పీఠభూమి లోనికి తెరుచుకునేది. మరో వర్తక మార్గం ఇరుకైన మక్రాన తీరం (బలూచిస్తాన్ లోనిది) వెంట పయనించి దక్షిణ పర్షియా తో సింధు మైదాన దిగువ ప్రాంతాన్ని కలిపేది. వీటిలో అతిముఖ్య మార్గం ఖైబరు కనుమ నుంచి

పయనించేది, ఇది అత్యవ ప్రమాదకరమైంది మరియు
ప్రపంచ వర్తక మార్గానికి సమీపమైంది కావటం చేత
వర్తకులు దీన్ని అధికం గా వాడేవారు. కాందహార్,
హేరత్ మరియు ఎక్‌బటన (హామదాన్) ల నుంచి
పయనించే ఈ మార్గం సెల్యూసియా లేదా మధ్యధరా
తూర్పు తీర రేవుల లేదా కలుపబడేది. కాందహార
నుంచి ఒక శాఖ ఈ మార్గాన్ని పెర్సిపొలిస్ తో
సూసా తో కలిపేది.

— o —

RT

ఉత్తరాన పశ్చిమదిశగా చైనాగా వెళ్ళే వర్తక
మార్గం తక్షశిల నుంచి బెగ్రామ్ కు ఉండేది, ఇక్కడ రహదారులు
వివిధ దార్లు చీలిపోయేవి. ఉత్తర మార్గం వయా బాక్ట్రియా,
ఆక్సస్, కాస్పియన్ సముద్రం, కాకసస్ నుంచి నల్లసముద్రం
వరకు వెళ్ళేది. దక్షిణ మార్గం కాందహార్, హేరత్
నుంచి ఎక్‌బటన వెళ్ళి అక్కడ నుంచి తూర్పు మధ్యధరా
రేవులతో కలుపబడేవి. మరొక ముఖ్య మార్గం కాందహార ను
పెర్సిపొలిస్, సూసా లతో కలిపేది. ఈ మార్గాలు బెగ్రాం
కు విస్తార వైవిధ్యం గల సరుకుల్ని తెచ్చేవి, ముఖ్యమైన
దంతపు చెక్కడాలు భారత్ నుంచి చైనా సిల్కు చైనా నుంచి
ఇక్కడికి వచ్చేవి. మధ్యధరా కు ఉద్దేశించిన తూర్పు ప్రాంతాల
సిల్కు బాక్ట్రియాను ఆక్సస్ గుండా "మార్జియానా"
కు చేరేది. గాంధార ప్రాంతం కూడా భూమార్గ

వర్తకులకు ముఖ్యకేంద్రం అయింది. ఇది సిల్కు రహదారిని,
తూర్పు బైజాంటియన్ వర్తక కేంద్రాన్ని అనుసంధానించేది.
గాంధార గంగా మైదానం తో సంబంధాలు కలిగి ఉండేది.
గాంధార ప్రాంతంలో వర్తక సరుకులు — మిరియాలు, వివిధ
రకాల వస్త్రాలు, లోహాలు, శిక్ష మృగాలు, ఏనుగులు,
లాంబేలు దిప్పలు మొదలైనవి ఉండేవి.
పశ్చిమం నుంచి

## సిల్క్ మార్గం :

తక్లమకాన ఎడారి చుట్టూ అనేక ఒయాసిస్సులు
ఉండి ఈ మార్గం లో మజిలీలు గా ఉండేవి. చైనా
లోని లాయాంగ్, చాంగేయన్ ల నుంచి ఈ దారి
మనవాయాంగ్ చేరి అక్కడ రెండుగా చీలేది.
ఉత్తర మార్గం తుర్ఫాన్, కరషాహర్, కుచా నుంచి
కష్గర్ చేరేది. దక్షిణ మార్గం నియా గుండా
ఖోటాన నుంచి కష్గర్ చేరేది. కష్గర్ నుంచి ఇది
బాల్ఖ్ చేరి అక్కడ నుంచి ఇరాన్ కు లేదా యూరప్
మధ్యధరా కు లేదా దక్షిణంగా భారత్ ను
చేరేది.

ఇది ఒకే రేఖామార్గం కాదు, ఒయాసిస్సు
పట్టణాల నుంచి వచ్చే అనేక మార్గాల కలయిక గా ఉండేది.

భారతీయ వర్తకులు వర్తక కేంద్రాల్ని,

వర్తక కాలనీలను కష్గర్, యార్కండ్, ఖోటాన్, 
మిరాన్, కుచి, కరషహర్ మరియు తుర్ఫాన ఇలా
అనేక మారుమూల ప్రాంతాల్లో ఏర్పాటు చేశారు. లాభాలు
ఆర్జిస్తూనే ఉండటంతో వర్తకులు పెరిగేవారు. మధ్య
ఆసియా లోని ఈ కార్యక్రమాల ద్వారా చైనా తో సంబంధాలు
మరింత పెరిగాయి. ఒక విధంగా చెప్పాలంటే కుషాణ
పాలకులు / పాలన భారత్ కు చైనా కు మధ్య సంబంధాలు
ఏర్పరిచారు, బౌద్ధ మతానికి చర్యలు ఈ సంబంధాన్ని
మరింత బలపరిచాయి. రోమను ప్రాంతాల నుంచి వర్తకులు
చైనాలోని గోబి ఎడారి దాకా అప్పుడప్పుడు సాహసించేవారు.
కాని చైనా కు తూర్పు మధ్యధరా, బైజాంటియం
లకు మధ్య జరుగుతున్న విలాస వర్తకం లో మధ్యవర్తులు
గా ఉండటం వలన వచ్చే లాభాన్ని భారతీయ వర్తకులు
వెంటనే పసిగట్టారు.

పార్థియన్స్ తో రోమను గొడవల వలన చైనా
వర్తక సరుకు [illegible] తక్షశిల కు, భృగుకచ్ఛ కు తరలించ
బడేది, ఫలితంగా వాయువ్య భారత్ సౌభాగ్యం మరింత
పెరిగింది. యవనుల లోనూ, మధ్య ఆసియా లోనూ
భూమార్గ వర్తకం ఉత్తర పర్వత కనుమల ద్వారా
తక్షశిల, Ai-Khanoum వంటి నగరాన్ని కలుపుతూ
జరుగుతుండేది. ఫలితంగా ఈ నగరాలు విశాలంగా

సంపదను మాకు చెబుతాయి, లిపుల ద్వారా వీటి ఉన్నత జీవన స్థాయి తెలియవస్తుంది.

## పశ్చిమ ఆసియా కు దక్షిణ మార్గం

పర్షియన్ గల్ఫ్ నుంచి సెల్యూసియా కు వెళ్లేది. ఓడలు తీరం వెంట బాబిలోన్ ఆ పైన టైగ్రిస్-యూఫ్రటీస్ మైదానం ద్వారా వెళ్లేవి. సిరియా లోని పాల్మిరా, జోర్డాన్ లోని పెట్రా అంతర(inland) పట్టణాలు పశ్చిమ ఆసియా మార్గాన్ని మధ్యధరా తూర్పు రేవులతో కలిపేవి.

ప్రత్యామ్నాయంగా ఓడలు అరేబియాను దాటి Aden or Dioscurides – the island of Socotra కు చేరేవి. ఇక్కడ నుంచి ఓడలు ఎర్ర సముద్రం చేరేవి. భారతీయ ఓడలు వరి, గోధుమ, వస్త్రాలను సొకోత్రా కు తెచ్చేవి; సొకోత్రా నుంచి లాంచీలు ఓడలు ఇతర సరుకులు అక్కడికి తెచ్చేవి. భారత్ నుంచి అలెగ్జాండ్రియాన్ వర్తకులు తీసుకొచ్చిన సరుకులు ఎర్ర సముద్రం కు ఈజిప్టియన్ వైపు గల రేవుల్లో దింపేవారు. అక్కడ భూమార్గం ద్వారా నైలు నది కి పంపేవారు. అక్కడనుంచి కింది ప్రవాహం వెంట అలెగ్జాండ్రియా చేరేవి, అలెగ్జాండ్రియా మధ్యధరా ప్రపంచానికి entrepot గా ఉండేది.

టాలెమీ చైనా నుండి భారత్ కు 2వ మార్గం 'పాలింబోత్రా' (పాటలీపుత్ర) ద్వారా పయనించేదని రాశాడు. అంటే చైనా - భారత్ ల మధ్య రెండు దార్లు ఉండేవని తెలుస్తుంది. 1) వయా యున్నాన్, బర్మా మరియు అస్సాం 2) వయా టిబెట్, సిక్కిం.

తరిం బేసిన్ లోని వివిధ ప్రాంతాల్లో - కష్గర్, యార్కండ్, ఖోటాన్, నియా, ఎండేర్, లౌలాన్, మిరాన్, కూచా, కుశారాపత్ర్ మరియు తుర్ఫాన్ లోని త్రవ్వకాలు ఈ ప్రాంతాల్లో భారతీయ ఉనికి తీవ్రతను తెలుపుతున్నాయి. తరిం బేసిన్ లో ఈ భారతీయ ప్రభావం సినో-ఇండియన్ సంబంధాల ఉప ఉత్పత్తిగా (by-product) చెప్పవచ్చు.

## దేశం లోపల వర్తక - వాణిజ్యాలు :

'మిళిందపన్హా', 'జాతక కథలు' వంటి సాహిత్యాధారాల వలన ; త్రవ్వకాల్లో లభించిన నాణాలు, ముద్రలు, ముద్రికల వలన నాటి వర్తకవాణిజ్యాలు తెలుసుకోవచ్చు.

అనేక రకాల వాణిజ్య కార్యకలాపాలు ; అలాగే వస్తువుల ధరల్ని నిర్ణయించడానికి అనేక మార్గాల్ని అవలంబించే వారని తెలుస్తుంది. ఉదాహరణకు రాజు వెంట వర్గం వారు వాడే గుర్రాలు, ఏనుగులు, విలువైన రాళ్ళు మొ॥ న వాటి ధరను అర్ఘకుడు లా ఉండే విలువనిర్ణయకుడు నిర్ధారించేవాడు.

వర్తకులు శ్రేణులుగా ఏర్పడేవారు. కొందరు సొంత డబ్బు తో వర్తకం చేసేవారు. మరికొందరు కేవలం ఫైనాన్షియర్లు గా ఉండేవారు. 'సెట్టి' అంటే ఫైనాన్షియరు ; 'వణిక' సాధారణ వర్తకుడు ; 'సార్థవాహ' సుదీర్ఘ దూరాలకి సరుకులు రవాణా చేసే బిడారు ల నాయకుడు.

సరుకుల మూటల మీద లాంఛన గుర్తులు ఒకవైపు, ప్రామాణముద్రలు మరొకవైపు గల మట్టిముద్రలు త్రవ్వకాల్లో విరివిగా లభించాయి.

① ఉత్తరాపథ 'పుష్కలావతి' (పెషావర్ భరుచ) లో మొదలై వయా తక్షశిల, మథుర, కౌశాంబి, వారణాసి ల ద్వారా పాటలీపుత్ర చేరేది. అక్కడ నుంచి చంప, చంద్రకేతుగర్హ్ చేరేది. ఈ ప్రాచీన మార్గం ఎప్పటినుంచో ఉపయోగంలో ఉండేది. ② మథుర నుంచి మరొకటి పశ్చిమంగా సింధు చేరేది. ఈ మార్గం ద్వారానే సరుకులు ఉత్తర భారత్ కు వచ్చేవి. మథుర ఉజ్జయిని, గుజరాత్ భరుచ్ రేవు తో కూడా కలుపబడేది. మూడో మార్గం ③ సింధునది కి సమాంతరంగా పయనించి తక్షశిలని పటాలా తో కలిపేది. ఇక్కడ గమనించాల్సిన ముఖ్య విషయం - ప్రధాన రవాణా మార్గం గంగానది ద్వారానే సాగేది. ఈ ప్రధాన మార్గం అనేక చిన్న మార్గాలతో కలుపబడేది, వాటిలో ఒకటి వైశాలి, శ్రావస్తి నుంచి నేపాల్ కు కూడా ఉండేది.

అంతర్గత వర్తక మార్గాలు :

1) తామ్రలిప్తి నుంచి తక్షశిల వరకు
2) ఉత్తరం నుంచి వైశాలి కి → శ్రావస్తి నుంచి ప్రతిష్ఠాన
3) ఉత్తరం నుంచి ఆగ్నేయానికి → శ్రావస్తి నుంచి రాజగృహానికి
4) నదీలోయల గుండా తూర్పు నించి పశ్చిమానికి
5) మథుర నుంచి పశ్చిమంగా సింధు కు — సరుకులు వీని ద్వారానే ఉత్తర భారత్ చేరేవి.
6) మథుర నుంచి ఉజ్జయిని కి
చివరికి బ్రోచ్ కు

7) బ్రోచ్ నగర, ప్రతిష్ఠాన లతో కూడా కలుపబడేది.

8) శ్రావస్తి నుంచి దక్షిణానికి వెళ్ళే మార్గం సంకాసనగర, అమరావతి, కాంచీపురం, ఉరయూర్ లను కలిపేది.

9) ఉరయూర్ ముజిరిస లతో కలుపబడేది.

ఏమైనా దక్షిణ భాగాలలో భూమార్గాలు శాతవాహనుల కాలం లోనే బాగా వృద్ధి చెందాయి.

విలాసాలకు ఉత్తర భారత రాజవంశాలు ఇతర ప్రాంతాలనుండి దిగుమతులు లభించే వివరాలు పేర్కొన్నారు. నూలు వస్త్రాలు తూర్పు ప్రాంతం నుంచి, అపరాంత (పశ్చిమ ప్రాంతం) నుంచి తెచ్చేవారు. చైనా, బాహ్లిక నుంచి సిల్కు; కాంభోజ నుంచి బ్లాంకెట్లు; తూర్పు ప్రాంతం, హిమాలయాల నుంచి ఏనుగ [illegible]; దేశ వాయువ్యం నుంచి గుర్రాలు, ఒంటెలు; తూర్పు, దక్షిణ ప్రాంతాల నుంచి ఏనుగులు తెచ్చేవారు.

వివిధ రకాల వస్త్రాల తయారీ గా అనేక ప్రాంతాల్లో కేంద్రాలు చేసేవారు, ఇవి దేశం లోనూ విదేశాల్లోనూ మంచి మార్కెట్ ఉండేది. మగధ, బెంగాల్ ఇనుము [illegible] ఉండేవి. రాజస్థాన్, దక్షిణ హిమాలయ పాద ప్రాంతాల్లో రాగి దొరికేది. కాశ్మీర్,

హిమాలయ ప్రాంతాల నుంచి ఔషధ మొక్కలు దొరికేవి. పంజాబు సాల్ట్ రేంజ్ ఉప్పుకు ప్రసిద్ధి. దక్షిణ భారత ప్రాంతాలు బంగారం, విలువైన రాళ్ళు, గంధం చెక్క అందించేవి. మధుర, వారణాసి, ఉరయూరు వస్త్ర ఉత్పత్తి కేంద్రాలు. ఉజ్జయిని లో విలువైన రాళ్ళ, గాజు, దంతం, చిత్రకారుల లాంటి పూసలు చేసేవారు. ఈ ఉత్పత్తుల్ని దేశీయ, విదేశీయ వాణిజ్యావసరాల్ని తీర్చేవి.

## నగరీకరణ:

వర్తకం, నాణాల వాడుకల వలన నగరీకరణ వృద్ధి చెందింది. "The Periplus of the Erythraean Sea" గ్రంథం ద్వారా అనేక తీర పట్టణాల గురించి తెలుస్తుంది. పురాతత్వ ఆధారాల ద్వారా దేశం లోపల ప్రాంతాల్లో అనేక పట్టణాల గురించి తెలుసుకోవచ్చు.

వాయువ్య భారతం లో 'తక్షశిల' అతిముఖ్య నగరం. క్రీ.పూ. 200 – క్రీ.శ. 200 ల మధ్య ఇది అత్యున్నత స్థితి లో ఉంది. జమ్మూ-కాశ్మీరు ప్రాంతం లో 23 నగర ప్రాంతాలు బయల్పడ్డాయి, ఇవన్నీ కుషాణుల కాలానికి చెందినవే. ఈ దశ లో పంజాబు లో అసంఖ్యాక నివాసాలు ఏర్పడ్డాయి. పశ్చిమ ఉత్తరప్రదేశ్ లో మధుర కుషాణుల కాలంలో మంచి నగరం. మధ్య గంగా మైదాన ప్రాంతంలో కౌశాంబి, వారణాసి, పాటలీపుత్ర గమనించదగ్గ నగరాలు గా ఉండేవి. బెంగాలు లో తామ్రలిప్తి, చంద్రకేతుగఢ్ క్రీ.శ. 3 వ శతాబ్దం దాకా ముఖ్య

శ్రేష్ఠ పట్టణాలు గా ఉండేవి. రాజస్థాన్ లో విరాటనగర (ఆధునిక బైరాట్), మాధ్యమిక (ఆధునిక నాగరి) క్రీ.పూ. తొలి కాలాల్లో పరిఢవిల్లాయి. మధ్యప్రదేశ్ లోని త్రిపురి, ఎరాన్ లు ; గుజరాత్ లోని మహేశ్వర్-నవదటోలి వృత్తి కేంద్రాలుగ - వర్తకాలు ఈ కాలంలో కేంద్రాలుగా ఉండేవి.

ఆంధ్రప్రదేశ్ లోని అప్పటి శాతవాహనుల కాలం లో విదేశ వర్తకం లో సంబంధాలున్న పట్టణాల్ని వెలికి తీశారు. వాటిలో ముఖ్యమైనవి గా ధూళికట్ట Dhulikatta, కరీంనగర జిల్లా; యేలేశ్వరం, నల్గొండ జిల్లా; కొండాపూర్ (మెదక్ జిల్లా); ధరణికోట, అమరావతి, నాగార్జునకొండ (గుంటూరు జిల్లా) లను చెప్పవచ్చు. ఇవి [illegible] చాలా వరకు నగర ప్రాంతాలు మైదానాల్లో ముఖ్యంగా తీర ప్రాంతాల్లో ఉన్నాయి. వాటిలో "అరికమేడు" కు రోమను సంబంధాలు అత్యధికంగా ఉన్నాయి. కావేరి మైదానం లో ఉన్న కావేరిపట్నం, ఉరయూర్ రెండు కూడా సమకాలీన వాణిజ్యం లో మంచి పాత్ర పోషించాయి.

పరిశ్రమలు :

నేత, కుమ్మరి, నూనె తీయడం, దంతపు పని, సెరామిక్ పరిశ్రమ, గాజు-తయారీ, ఇత్తడి వస్తువుల తయారీ, hydraulic యంత్రాల తయారీ మొదలైనవి ఈ కాలంలో వర్ధిల్లిన కొన్ని పరిశ్రమలు. లోహ పాదరక్షల తయారీ ఈ యుగం లోనే మొదలైంది. ఉత్తమ మట్టిన ఉత్పత్తి అయ్యేది. భవనాలు కట్టడం మరి ముఖ్య వృత్తిగా ఉండేది. ఇటుక కార్యక్రమాల్లో అద్భుత ప్రగతి సాధించారు. కాల్చిన ఇటుకల్ని, టైల్స్ ను వాడేవారు. ఇటుక బావులు పెద్ద సంఖ్యలో కట్టారు.

ఈ కాలంలో కార్మికులు వివిధ ప్రాంతాలకు తరలి వెళ్ళేవారని తెలుస్తుంది. 'మణిమేఖలై' లో పుహార్ లోని ఒక భవనాన్ని మగధ వృత్తికారులు నిర్మించినట్లు ఉంది. మరియు మరాఠా mechanics, మాళ్వా లోహకారులు, యవన వడ్రంగులు తమిళ వృత్తికారులతో కలిసి ఈ భవనాన్ని కట్టినట్లు పేర్కొన్నారు.

చేతి వృత్తులు [Craft Production]

మౌర్యులకు పూర్వయుగానికి చెందిన "దిఘ నికాయ" లో కేవలం రెండు డజన్ల వృత్తులు మాత్రమే చెప్పబడగా మౌర్యానంతర యుగం లోని "మిళిందపన్హా" లో దాదాపు 75 వృత్తులు చెప్పబడ్డాయి, వాటిలో దాదాపు 60 చేతివృత్తులతో సంబంధించినవి ఉన్నాయి- దీని ద్వారా మౌర్యానంతర

యుగం లో చేతివృత్తుల సంఖ్య బాగా పెరిగిందని అర్థమౌతుంది. వీటిలో 8 లోహాలకు చెందినవి — బంగారం, వెండి, లెడ్, తగరం, రాగి, కంచు, ఇనుము, విలువైన రాళ్లు - ఆభరణాలు.

సిల్క్ నేయడం, వస్తువుల తయారీ, ఆయుధాల తయారీ ప్రగతి సాధించాయి. ఇనుము కు సంబంధించిన సాంకేతిక జ్ఞానం బాగా వృద్ధి చెందింది. తెలంగాణా ప్రాంతం లో ఇనుప వస్తువులు అత్యధికంగా లభించాయి. (గ్రీకు ఆధారంబే) → అరియక నుండి ఆఫ్రికన్ రేవుల కి ఇనుము ఎగుమతులని పెరిప్లస్ చెప్తుంది.

బెంగాల్, వారణాసి, గుజరాత్, గాంధార ప్రధాన వస్త్ర ఉత్పత్తి కేంద్రాలు. అరేబియా, సొకోత్రా, ఈజిప్టు లకు వస్త్రాన్ని ఉజ్జయిని, తగరం ల నుండి గణనీయంగా ఎగుమతి చేసేవారు. భారతీయ వస్త్రాల కి రోమన్ సామ్రాజ్యం అతి పెద్ద మార్కెట్. వాయువ్య సరిహద్దు ప్రాంతాల్లో + ఉత్పత్తి చేసేవారు. కంబళ్లు, ప్రస్తుత ఉత్తరాంచల్ లో ఉన్ని

దంతపు పని, గాజు తయారీ, పూసల తయారీ, నాణేల ముద్రణ మొదలైనవి ఈ కాలంలో అభివృద్ధి చెందాయి. తైలిక చక్ర వాడకం వల్ల నూనె తీసే పరిశ్రమ పెరిగింది. పశ్చిమ దక్కను, సాంచి, బార్హుత్, మథుర, గయ ల

[శాసనాల ద్వారా నేతవారు, స్వర్ణకారులు, లోహకారులు, (51)
గంధికులు మొదలైన వాళ్ళు దానాలు చేసినట్లు తెలుస్తుంది.
ఇది వారి ఉన్నత ఆర్థిక స్థితి కి నిదర్శనం.]

## Monetization of economy :

[బంగారు నాణాలను విడుదల చేసిన తొలి పాలకులు ఇండో-గ్రీకు పాలకులే. వారి తర్వాత కుషాణులు చెప్పుకోదగ్గ సంఖ్యలో బంగారు నాణాల్ని ముద్రించారు.] కుషాణులు బంగారు నాణాల్ని రోమను నాణాల్ని కరిగించి ముద్రించారని కొందరంటారు. కాని సింధ్ లోనూ, ధాలభూం లోనూ బంగారు గనులున్న విషయం గమనించదగింది.

ఈ కాలంలో రోమను బంగారు నాణాలు విరివిగా భారత్ కు చేరేవి. అయితే వాటిని మనవారు bullion గా మాత్రమే వాడి ఉంటారని చెప్పవచ్చు.

[శాతవాహనులు తక్కువ విలువ గల లెడ్, పొటిన్, రాగి వంటి లోహాలలో నాణాలను ముద్రించారు. బహుశా శాతవాహనులు అత్యధిక సంఖ్య లో రాగి నాణాల్ని విడుదల చేసి ఉంటారు. సామ్రాజ్య రాజవంశాలే గాక చిన్న గణసంఘ వంశాలు కూడా నాణాలు ముద్రించాయి.] నాగులు, యౌధేయులు, కునిందులు, కౌశాంబి మిత్రులు, మథుర, [illegible], అహిచ్ఛత్ర పాలకులందరూ నాణాల్ని ముద్రించారు. రాజవంశాలే గాక

అనేక నిగమ సభలు కూడా నాణాలు ముద్రించేవి. (రాగి, కంచు నాణాలు). వీటన్నిటి ద్వారా [illegible] మౌర్యానంతర యుగం లో ద్రవ్యం (money) సామాన్య మానవుని జీవితం లో భాగమైపోయిందని తెలుస్తుంది.

Imp

ప్రాచీన భారతీయ చరిత్ర లో మరే దశ లోనూ ఇన్ని రకాల నాణాలు ముద్రించబడలేదు.

కుషాణుల, రోమనుల బంగారు నాణాలు కొంత వరకు పెద్ద నాణాలను bullion గానే వాడి ఉంటారు. నిత్యవ్యవహారం లో అవి వాడేవారని చెప్పలేము. అయితే వాయువ్య భారతం లో కుషాణుల రాగి నాణాలు, దక్షిణ లో శాతవాహనుల పోటిన్, సీస నాణాలు నిత్యవ్యవహారానికి ఉపయోగపడి ఉంటాయి.

## వ్యవసాయం

[మౌర్యానంతర యుగం లో వ్యవసాయం పై ప్రభుత్వ నియంత్రణ అంతగా కన్పించదు, క్రమంగా భూమి పై ప్రైవేటు యాజమాన్యం వృద్ధి చెందిందని తెలుసుకోవచ్చు. అనేక కేసుల్లో ప్రైవేటు వ్యక్తులు భూమిని దానం గా ఇవ్వడం కూడా కన్పిస్తుంది.]

భారతదేశం లో భూదానానికి చెందిన తొలి శాసనం క్రీ.పూ. మొదటి శతాబ్దంలో కన్పిస్తుంది, ఇందులో శాతవాహనులు ఒక గ్రామాన్ని (బ్రాహ్మణులకు) కానుకగా ఇచ్చారు. ఇవి పన్నుల నుంచి మినహాయింపబడేవి. ఈ దానంగా ఇవ్వబడిన గ్రామాల్లో పన్నులే గాక పాలనా హక్కుల్ని కూడా రాజ్యం వదులుకోవడం గౌతమీపుత్ర శాతకర్ణి కాలం లో మొదటి సారి గా కన్పిస్తుంది.

(సంఘాలకి దేవతలకి గ్రామాల్ని లేక భూముల్ని దానం గా ఇవ్వడం కూడా కన్పిస్తుంది.)

(వాయువ్య భారతం లో శకులు, కుషాణులు తటాకాలు తవ్వించారు. ఖారవేలుడు పాత కాలువ ను పెంచాడు. ధనవంతులైన వ్యక్తులు కూడా నీటి పారుదలా సౌకర్యాలు కల్పించేవారు). శాతవాహనుల

(శాతవాహనుల, కుషాణుల భూవిధానం లో ఒక ముఖ్య లక్షణం గా "అక్షయనివి" ని చెప్పవచ్చు. ఇది అద్దె లేకుండా భూమిని శాశ్వతంగా అనుభవించే

వాళ్ళు అని చెప్పవచ్చు.)

(ప్రధానంగా ఆదాయాన్ని ప్రభుత్వాధికారం రాజు పెద్ద మొత్తం లో వసూలు చేసేవాడు. మనువు పంట లో $\frac{1}{6}$, $\frac{1}{8}$ లేదా $\frac{1}{12}$ వ వంతును వార్షిక ఆదాయంగా రాజు తీసుకోవచ్చని చెప్పాడు. ఈ భూమిశిస్తు గాక ప్రభుత్వం అడవులు, గనులు, herds మీద శిస్తు వసూలు చేసేది. 'కర' భూమిశిస్తు అని అనగా periodical గా చెల్లించే భూమి మీద పన్ను కావచ్చు. 'ప్రతిభాగ' అనేది పళ్ళు, పూలు వంటి నిత్యావసరాలు. జునాగఢ్ రాతి శాసనం లో 'కర', 'విష్టి', 'ప్రణయ' వంటివి కన్పిస్తాయి. 'విష్టి' ప్రతిఫలం లేని చాకిరి; 'ప్రణయ' అత్యవసర సమయాల్లో చెల్లించాల్సిన పన్ను అని తెలుస్తుంది.)

— o —

## దక్షిణ భారతం

నీటిపారుదల సౌకర్యాలు చెరువులు, బావుల రూపం లో ఉండేవి. జల చక్రాన్ని వాడి నీటిని పైకి తోడేవారు.

దక్షిణ ప్రాంత ప్రజలకు వరి నాట్లు వేసే పద్ధతి తెలుసు. (paddy transplantation)

క్రీ.శ. లోని రెండు శాసనాల్లో గోదావరి, కృష్ణ (55)
నదుల డెల్టాలలో వరి విస్తారంగా పండేదని తెలుస్తుంది.
నల్లరేగడి నేలలో పత్తి పండించేవారు, ఆంధ్ర ప్రత్తి ఉత్పత్తులకి
విదేశాల్లో కూడా గిరాకీ విపరీతంగా ఉండేది. తీర
ప్రాంతాల అభివృద్ధి లో కొబ్బరి చెట్ల సాగు గణనీయమైన
పాత్ర పోషించింది. మామిడి తోటలు, కలప నిచ్చే ఇతర
వృక్ష జాతుల సాగు దక్కను లో మంచి లాభాలు ఇచ్చేది.

సాగు చేసేందుకు నీటిని చెరువులలో
నిలువ యుంచుకోవడం, బావి నీళ్ళు వాడడం చేసేవారు. పెర్షియన్
ద్వారా అరేబియా నుండి బావి నీళ్ళు తెచ్చేవారని తెలుస్తుంది.

[శాతవాహనుల కాలంలో దక్కను లో రెవెన్యూ
విధానం ఎక్కువ క్రమబద్ధమైంది, కాని వివరాలు పూర్తిగా
తెలియడం లేదు. కార, దేయ, మేయ, భాగ వంటి
పదాలు శాసనాల్లో కన్పిస్తున్నాయి. బౌద్ధులకి, బ్రాహ్మణులకి
దానంగా ఇచ్చిన భూముల్లో రాజు సైనికులు ఏ విధమైన రుసుం
వసూలు చేయకుండా, రాజ్యాధికారులు గ్రామం నుంచి ఏ వస్తువులూ
తీసుకోకుండా మినహాయింపు ఇవ్వబడింది. అంటే సాధారణ
గ్రామాల్లో సైనికులు వస్తే వస్తువులు, ధనమో ఇవ్వాలని;
లేదా సైనికులు రెవెన్యూ వసూలు అధికారం కలిగి ఉండేవారని
అర్థమౌతుంది. శాతవాహనుల గ్రామాలు చిన్న సైన్య
విభాగం అధిపతి 'గౌల్మిక' (అధీనం లో) కింద ఉండేవని
తెలుస్తుంది.]

## వర్తకం, నగరీకరణ పెరగడానికి కారణాలు:

1) వ్యవసాయం ఇనుప పనిముట్లు, నీటిపారుదల వసతుల కారణంగా వృద్ధి చెందడం, మిగులు ఉత్పత్తులు పెరగడం.

2) ఉత్తర-దక్షిణ భారతదేశాల మధ్య భూమార్గాలు తీరాల వెంబడి సముద్రమార్గాలు వృద్ధి చెందడం.

3) భారతీయ ఉత్పత్తులకి విదేశీ గిరాకీ పెరగడం, రోమన్ ప్రపంచం నుండి కూడా మన తీరపట్టణాలకు ఓడలు చేరడం.

4) చేతివృత్తుల్లో వస్తువుల వైవిధ్యం పెరగడం.

## దేశీయ వర్తకం:

కళింగ ప్రాంతం లోని కళింగ శైలి తమిళ రాజులకు ఎంతో ప్రయోజనమైంది. ఉత్తరాది NBP మృణ్మయ పాత్రలు పాండ్య ప్రాంతాల్లో లభించాయి. ఉత్తరాది పంచమార్కు వెండి నాణాలు కూడా దక్షిణ భారతం లోని వివిధ ప్రాంతాల్లో దొరికాయి. ఉత్తర-దక్షిణ భారతాల మధ్య విరివిగా వర్తకం సాగిందనడానికి ఇవి ఆధారాలు.

## విదేశీ వర్తకానికి రాజుల మద్దతు:

శాతవాహన రాజులు విదేశీ వర్తక లాభాలని గుర్తించారు. విదేశీ వర్తకులకి సదుపాయాలు కల్పించేవారు. బరుకచ్ఛ చేరే ఓడల్ని పైలట్ పడవలు రేవు వద్ద వేచివున్న బెర్త్ లకు చేర్చేవి.

తమిళదేశం లో సముద్ర వర్తకాన్ని భూస్వాములు ప్రోత్సహించేవారు. తీరాల పై లైటహౌసులు నిర్మించేవారు. రోమను ఓడలు సరుకు దించే చోట స్థానిక రాజు చిహ్నం తో ముద్రించబడేందుకు సదుపాయాలుండేవి. సరుకు కు స్టోరేజి సౌకర్యాలు కల్పించేవారు. గోదాము లని సరుకు ని రక్షణ వసతులూ అందించేవారు. దక్షిణ భారతం లో, దక్కను లో సముద్ర వాణిజ్యం అంతవరకూ "పాలిత వర్తకం" (administered trade) లక్షణాలను

అంచారు.

## తూనికలు - కొలతలు :



భూమిని 'నివర్తనములు' అనే కొలతలో కొలిచే వారు. దక్షిణాగ్ర ప్రాంతంలో 'మా' 'వేలి' భూమి కొలతలు గా ఉండేవి. ఇక్కడ ధాన్యాన్ని 'అంబనం' లలో కొలిచేవారు, బహుశా ఇది శిస్తు చెల్లించేటప్పుడు వాడే పెద్ద కొలత కావచ్చు. వీటితో 'నాలి' 'ఉలక్కు' 'అలక్కు' వంటి చిన్న చిన్న కొలతలు కూడా ఉండేవి.

బరువును త్రాసు ద్వారా చూసేవారు. కడ్డీ మీద గుర్తులు గల త్రాసు వాడేవారు. <u>బంగారాన్ని కూడా త్రాసు పై తూచేంత పరిజ్ఞానం గలరని శిలాశాసనాలు తెల్పుతున్నాయి.</u>

నిత్యవ్యవహారంలో కొన్ని కొలతల్ని gingilly grain 'ఎల' వరి ధాన్యంగింజ 'నెల', వేలు, చేయి లలో కొలిచేవారు.

— o —

* మౌర్యానంతర యుగం లోని ముఖ్య లక్షణంగా "<u>నగర సంస్కృతి</u>" ని చెప్పవచ్చు, ఇది పట్టణాల్లో ఉత్తమ జీవన పరిస్థితుల్ని కల్పించింది.

* వర్తకులు శ్రేణి నిర్మాణం ద్వారా, మార్గాలు ప్రాంతాల సంబంధాల ద్వారా ఉపయోగించడాన్ని తెలిపినారు. తర్వాత వాణిజ్య భాగాల్ని స్థానికులు అనుభవించడం

ఇతర ప్రజలు వలస రావడం మొ|| వల్ల వర్తకానికి
ప్రోత్సాహమిచ్చారు. వర్తకులు నూతన ప్రాంతాల్లో రేవుల్ని
వినియోగపర్చుకున్నారు. ఇండో-గ్రీకు రాజులు పశ్చిమ ఆసియా
తూర్పుమధ్యధరా ప్రాంతాలతో మార్గాలు ఆరంభించిన
సంబంధాల్ని బలపరిచారు. శకులు, పార్థియన్లు, కుషాణులు
మధ్య ఆసియా ను భారతీయ వర్తక పరిధి లోకి
తీసుకొచ్చారు, ఇది మళ్లీ చైనా తో వర్తకాన్ని ప్రోత్సహించింది
భారతీయ వాయువ్యంలో ఉన్న రోమను గ్రీకు యవన
వర్తకులు తూర్పుమధ్యధరా నుంచి దక్షిణ, పశ్చిమ భారత
ప్రాంతాలకి వచ్చేలా చేసింది, ఇది భారతీయ
వర్తకులు ఆగ్నేయాసియా కి ఎంట్రెపోర్ట్స్ గా
వెళ్లేందుకు ప్రేరణ ను అందించింది. ఈ కాలం లో
వర్తకుల ప్రాబల్యం సమకాలీన సాహిత్యం & శాసనాల్లోని
దానాల ద్వారా తెలుస్తుంది.

అయితే దీని అర్థం వ్యవసాయం తగ్గిందని
-అని కాదు. వ్యవసాయం ఆదాయం వస్తూనే ఉంది.
కాని నాటకీయమైన వృద్ధి మాత్రం వర్తక రంగం
లో కన్పిస్తుంది.

# Post-Mauryan Period

## Religion

### బౌద్ధమతం

మౌర్యానంతర యుగం లో శుంగ, కణ్వుల కాలం లో బౌద్ధమతం రాజాదరణ కోల్పోయింది. కాని వివిధ సాంఘిక వర్గాల నుంచి ఆదరణ తగ్గలేదు. వీరి కాలంలోనే బార్హుత్ స్థూపం కట్టబడడం, సాంచి స్థూపం పెద్దది గా అలంకరింపబడడం అందుకు నిదర్శనాలనవచ్చు.

[మిళిందపన్హ' 'మహావస్తు' మరియు 'సద్ధర్మ పుండరీక' వంటి బౌద్ధ గ్రంథాలు వర్తకులకు మద్దతును, గౌరవాన్ని ఇచ్చాయి. దీంతో సమాజంలోనే బౌద్ధ స్థావాలు, విహారాలకు విరాళాలు విరివిగా వచ్చాయి. దాన శాసనాలు, విహార గదుల నిర్మాణం మొదలైనవి విహారాలు సంపద కేంద్రాలుగా భాసిల్లాయని చెబుతున్నాయి.] స్థూపాల నిర్మాణం లో, దానం గా వచ్చిన భూమి సాగు లో పనివారిని పర్యవేక్షించే కొత్త బాధ్యత బౌద్ధ సన్యాసులకు కలిగింది. ఉదయం వేళల్లో పొందిన భిక్ష మీద మాత్రమే బతకడం పాత కథనం గా మారిపోయి సౌభాగ్యవంతమైన విహారాల్లో బౌద్ధ సన్యాసులు వేళ తప్పకుండా తినడం మొదలైంది.

సాధారణంగా విహారాలు పట్టణాలకు

ఆసుపత్రులా, వర్తకుల ప్రసిద్ధ మార్గం లోనా నిర్మింపబడేవి.
~~అరుదుగా~~ ~~అందమైన~~, ఏకాంత ప్రాంతాల్లో కట్టబడేవి.
అట్టి ఏకాంత విహారాల్లోని సన్యాసులకు కూడా మంచి
విరాళాలు అందేవి. కాని ఇవి సామాన్య ప్రజల నుంచి

RT Page: 271 దూరంగా పోవడం వలన

ఈ కాలంలో బౌద్ధమతం ప్రజాదరణ
పెరగడానికి అది స్థానిక మతాల్ని తనలో కలుపు
కోవడానికి సుముఖంగా ఉండడం కూడా కారణమే.
మథుర ప్రాంతంలోని చివరి కుషాణుల కాలపు విహారాలి
కి స్థానిక నాగ మతం వారు విరాళాలివ్వడం
దీన్ని బలపరుస్తుంది. అదే సమయంలో మథుర
వంటి ప్రాంతాలు అన్ని మతాలకు కేంద్రం కావడమే కాక
రాజకీయ, ఆర్థిక కేంద్రాలు కూడా కావడం గమనించాలి.
వాటి సాంఘిక విధినిర్వహణ భిన్నంగా ఉన్నా పై
కారణాలన్నీ ఈ స్థలాన్ని ఎంచుకోవడంలో ప్రభావం
చూపి ఉంటాయి. బౌద్ధమతం వారు విభిన్న వర్గాల
దగ్గరికి చేర్చడానికి యత్నిస్తే 'వర్ణ' నియమాలు

పేరు పరబడటానికి అవకాశం ఉంటుంది.

[బుద్ధుణ్ణి దైవంగా ఎంచటం,
అతని విగ్రహాన్ని పూజించడం, బోధిసత్త్వ భావన,
ఆధ్యాత్మిక యోగ్యత (merit) ని ఇతరులకు
బదిలీ చేయవచ్చన్న భావన మొ॥ నవి బుద్ధుని
వాస్తవ బోధనలలో భాగం కాదు. అయితే
విస్తృత చర్చల అనంతరం వివిధ బౌద్ధమత శాఖలు
వీని ప్రామాణికంగా అంగీకరించాయి. బుద్ధుడు తనను
దైవం గా చూడటాన్ని వ్యతిరేకించాడు, కాని
క్రీ.శ. మొదటి శతాబ్దానికల్లా బుద్ధుని రూపాన్ని
చెక్కడం, చిత్రించడం పూజించడం మొదలైనాయి.]
'బోధిసత్త్వుడు' పూర్తి నిస్వార్థం తో మానవజాతి మంచి
కోసం పాటు పడతాడు, అంతేగాక తన పని పూర్తయ్యేదాకా
నిర్వాణాన్ని కూడా వాయిదా వేయగలడు. ప్రత్యామ్నాయం
గా బోధిసత్త్వ బుద్ధుని పూర్వ అవతారం గా చెప్పారు.
ఇతడు నిర్వాణ దిశ గా కృషి చేస్తు వివిధ జన్మలలో
ఆధ్యాత్మిక యోగ్యతని కూడబెట్టుకుంటున్న వాడు. ఇలాంటి
యోగ్యత కేవలం వ్యక్తి గా బోధిసత్త్వుని కి
వ్యక్తికే గాక మొత్తం మానవాళి అంతటికీ
ఉద్దేశించింది. అంతేగాక, ఎవరికైతే యోగ్యత
చెందాలో వారి పేరు మీద మంచి పనులు (pious act)

చేయడం ద్వారా కూడా యోగ్యతను బదిలీ
చేయవచ్చు. ఫలితంగా, ఉపాసక సంఘాలకి విరాళం
గా ఇచ్చి ధనికులు యోగ్యతను పొందవచ్చు.

RT page: 271

~~ఈ~~ మార్పులు బౌద్ధ సన్యాసి -
సామాన్య బౌద్ధుడు ( ఉపాసక ) మధ్య పరస్పరాధార స్థితి
ని మార్చివేశాయి. సంఘ ఏర్పాటుతో, బాగా కొనసాగడం
లో ఉపాసకుని పాత్ర ముఖ్యమయ్యింది. ఒక వ్యవస్థ గా
సాంఘికం గా అంగీకారం పొందడానికి 'సంఘ' కు రాజుల
సభ్యుల, ధనికుల వద్దరి మద్దతు అవసరమైంది.
'సంఘ' ఎంత ఎక్కువ గౌరవం పొందితే, దాన్ని దానికి
మద్దతునిచ్చేవారి గౌరవం కూడా అంతగా పెరిగేది, వారు
కింది కులాల వారు ~~అయినా~~ సరే! ఇలాంటి పరస్పరం
బలాన్ని పెంపొందించుకోవడం అనేక ఇతర మతాల్లోనూ ఉండేది.
కానీ, ఈ విషయంలో, బౌద్ధ, జైనాలు
వైష్ణవ, శైవాల నుంచి భిన్నమైనవి. ఎందుకంటే
వైష్ణవ, శైవాల్లో సాధువులు వంటి మనుషులు తప్ప
వ్యవస్థీకృతమైన వైరాగ్యం విహారాలు, సంఘాల

మటువి వేర్వు. అటువంటి వీరు 'జాతి' గా గుర్తింప బడేవారు, వివిధ 'కులాలు' లౌకికులకు ప్రత్యామ్నాయం కాజొచ్చాయి. ( partly b'se they were often rooted in 'jati' identities and concerned jatis tended to become a substitute for a laity ) ప్రత్యామ్నాయం గా మతమే 'జాతి' గా మారింది. 'సంఘ' ఉపాసకుల మీద ఆధారపడటం కొనసాగింది, ఉపాసకులు కూడా చక్కగా స్పందించేవారు. దానాలు, కానుకలు ఆధ్యాత్మిక యోగ్యతని పొందడం తో ముడిపెట్టబడ్డాయి

వైదిక యాగాల్లో క్షత్రియులు బ్రాహ్మణులకి కానుకలివ్వడం లో ఈ 'దానాలు' మొదలయ్యాయి. కాని క్రమంగా యాగాల ప్రాధాన్యం తగ్గడం, దానగ్రహీతలకు 'భూమి' ని దానం గా ఇవ్వబడటం అధికమైంది. బౌద్ధుల్లో జైనుల్లో దానాలివ్వడం క్షత్రియులకి మాత్రమే పరిమితం కాలేదు. గహపతులు, భూస్వాములు, సెట్టిలు, చేతివృత్తికారులు ఇలా ఎవరు ఇవ్వదలిస్తే వారు ఇవ్వవచ్చు. దానం పెట్టుబడి గా మారింది, దానం చేసే వారికి కి యోగ్యత వస్తుందని నమ్మితే దానగ్రహీతలకి అది సంపదగా మారేది. దానం ఇవ్వడం ప్రతి తప్పనిసరిగా <u>వ్యక్తిగతమైంది</u>, అప్పుడప్పుడు ఇద్దరు రక్తసంబంధీకులతో కలిసి చేసినా. <u>ఇది ఒక తేడా గా</u>

పేదా విస్తృత అటువంటివి చెందిన విధి కాదు.

సంఘాలు లేని దటాలచ్చే కొందరు ధర్మశాస్త్రజ్ఞులు శూద్రులు గా చెప్పబడ్డారు. సంఘాల వలన అన్ని బ్రాహ్మణ గ్రంథాల్లో కూడా బ్రాహ్మణులు శూద్రుల నుండి దానములు తీసుకోవచ్చని చెప్పబడింది, అయితే అట్టి బ్రాహ్మణుల్ని వారి ఆచారానికి శ్రద్ధ [illegible] అనుమతించరు.

ఈ కాలంలో వివిధ ప్రాంతాల మధ్య సంబంధాలు పెరగడం వలన తీర్థయాత్రలు పెరిగి క్షేత్ర స్థలాలు, క్షేత్ర పద్ధతులు వెలుగు చూశాయి. ఉపఖండం లోని వివిధ ప్రాంతాలకి, వెలుపలా సైతం ప్రచారానికి వెళుతూ లను మారడం వలన నూతన భావాలు బౌద్ధమతం లో చేరాయి. మొదటి సిద్ధాంతం పునర్వ్యాఖ్యానించబడింది. ఫలితంగా 'హీనయాన' 'మహాయానాలు' గా బౌద్ధమతం చీలింది. సిద్ధాంత భేదాలే గాక ధనికుల - పేదల విరుద్ధ ప్రయోజనాలు తేలికగా [illegible] వుంది. ఈ మార్పులు ఆది నుంచి సంతరించిన బౌద్ధమత విశ్వాసం ను బలహీనం చేయనున్నాయి - బలహీనం పరచగలవు. (likely to weaken)

బౌద్ధ సంప్రదాయం ప్రకారం క్రీ.శ. 2 
వ శతాబ్దం ఆరంభంలో కాశ్మీరులో జరిగిన 4వ బౌద్ధ సంగీతిలో హీనయాన, మహాయాన చీలిక గుర్తించబడింది. ఈ సంగీతి చారిత్రకత అనుమానించబడుతుంది, అయితే వాయువ్య భారతం, మధ్య ఆసియాల్లో ~~ఆలోకించబడిన~~ స్థానిక బౌద్ధ శాఖ ని గుర్తించుచ్చే యత్నం జరిగి ఉండవచ్చు. పురాతనులు హీనయానం వాస్తవ బుద్ధుని బోధనలకి దగ్గరైందని చెప్పేవారు. మహాయానం వాస్తవ బోధనలతో సరిపోని నూతన భావాలు కలిగి ఉందని భావించారు. హీనయానం శ్రీలంక, మయన్మార్, ఆగ్నేయాసియా దేశాల్లో ప్రాబల్యం పొందగా మహాయానం మధ్య ఆసియా, టిబెట్, చైనా, జపాన్ లలో ప్రాబల్యం సంపాదించింది.

మహాయాన శాస్త్రాలు సమకాలీన బౌద్ధ శాస్త్రాలచే ప్రభావితమైంది. నాగార్జునుడు చెప్పిన 'శూన్యత' సిద్ధాంతం ఇందులో ముఖ్యమైంది. దీని ప్రకారం మనం శూన్యం చే చుట్టబడి ఉన్నాం, మనం చూసేదంతా భ్రాంతి. అయితే ఈ శూన్యతే ప్రతి బౌద్ధుడూ కోరుకునే పునర్జన్మల్ని అంతం చేసే దశ అయిన నిర్వాణం. ఈ ఆలోచనలు తర్వాత వైవిధ్యమైన బహుసార్థ పౌరాణికమైన శాస్త్రీయ గ్రంథాలుగా ఆలోచనలుగా కూడా వృద్ధి చెందాయి. కాని ఇవి హేతువు, తర్క భావాలు కలిగి ఉండేవి.

మహాయానం యొక్క ఇతర భావాలు బౌద్ధ బోధనల నుంచి జనించినవే అయినా వివిధ

మతాలతో సంబంధాల వల్ల మరింత ప్రోత్సాహించ
బడ్డాయి — క్రైస్తవం, జొరాస్ట్రియనిజం; ముఖ్యంగా
ఉత్తర భారతం నుంచి తూర్పు మధ్యధరా వరకు,
మధ్యప్రాచ్యంలో Manichaeism లో ముఖ్యంగా
ప్రభావితమైంది. వారసత్వ సిద్ధాంతాల్లో కొత్తదాని
" బుద్ధ మైత్రేయుడు" వస్తాడని నమ్మారు. దీన్ని
'suffering saviour' భావనలో చూస్తారు.
కష్టాల్లో ఉన్న బాధితుల్ని — తను స్వంతంగా బాధననుభవించి
మానవాళిని విముక్తం చేస్తాడని లో చూస్తారు. తూర్పు
మధ్యధరలోని కొత్త నమ్మకాలు జొరాస్ట్రియన్లలో రక్షకుడ్ని
'Saoshyant' గా ఆవిష్కరిస్తే బౌద్ధులలో బుద్ధమైత్రేయ
గా చేరాడు. మహాయానం అంతర్జాతీయ నమ్మకాల్ని
చేర్చింది — స్వర్గాల వ్యవస్థ, ఒకదానిపై ఒకటి
పేర్చబడి వాటిలో అసంఖ్యాక బాధిసత్త్వాలు ఉంటారని
విశ్వసించారు, వీరు దేవతలుగా ఆరాధింపబడటం
మొదలైంది. ఈ యుగంలోని ఇతర మతాల వలెనే
ప్రజాబాహుళ్య మతాల్ని చేరువచేయటం / ఇముడ్చుకోవటం
ద్వారా ప్రాచుర్యాన్ని పెంచుకోవటం మహాయానం లో కూడా
కన్పిస్తుంది, ముఖ్యంగా సంతాన ఆరాధనా మతాల్ని —
అసంఖ్యాక యక్షులు, యక్షిణులు, నాగులు ప్రధాన

మతం లోకి చేరారు, ఒక్కసారి పశ్చిమ ఆసియా నుంచి వచ్చిన స్త్రీ దేవతల్ని ప్రముఖంగా ఆరాధించడం కూడా కన్పిస్తుంది.

— o —

* ఈ కాలంలో వెండి - వర్తకులు, ఉద్యోగులు బౌద్ధాన్ని ఆదరించారు. దక్షిణాన శాతవాహనుల రాణులు కొందరు, మాండలికులు బౌద్ధాన్ని ఆదరించారు.

బౌద్ధమతం వ్యాప్తి చెందడంలో తోడు అనేక శాఖలుగా చీలడం కూడా జరిగింది. ఉదాహరణకు కౌశాంబి లో థేరవాదులు, మధుర లో సర్వాస్తివాదులు; నాసిక్, కన్హేరి లలో భద్రయాణికులు కేంద్రాలేర్పరుచుకున్నారు. ఈ శాఖల ఆవిర్భావానికి మొదట్లో సిద్ధాంత భేదాలు కారణమై ఉండవు. వాటి పుట్టుక, వృద్ధికి కారణమైన ప్రాంతాల దేశ భౌగోళిక వైవిధ్యాలకు, స్థానికంగా వివిధ మతాల ధోరణులకు, వివిధ శాఖల్ని ప్రచారించిన వారి మధ్య సమాచార లోపాలకు సంబంధించినవై ఉంటాయి.

ఈ కాలంలో పశ్చిమాన నాసిక్, కార్లె, కన్హేరి వంటి అసంఖ్యాక విహారాలు వెలిశాయి. తూర్పున అమరావతి, నాగార్జునకొండ, భట్టిప్రోలు, గోలి వంటి బౌద్ధకేంద్రాలు వెలిశాయి. తక్షశిల, మధుర, బెనారస్, నలంద మొదలైనవి బౌద్ధ విద్యాకేంద్రాలుగా వెలిశాయి.

* పాత సిద్ధాంతం ప్రకారం బోధిసత్త్వ జన్మనం,
జన్మల్లో జీవించి దయ, జాలి తో గొప్ప ఎన్నో మంచి
పనులు చేసి చివరికి బుద్ధుడవుతాడు. అందుకే
సామాన్య విశ్వాసులు నిర్వాణం పొందడం కోసం
అతన్ని అనుకరించవలసినవారు. కాని మహాయానం
లో బోధిసత్త్వ నిర్వేక్షంగా మంచివాళ్ళ అందరి
మంచి కోసం కృషిచేస్తూ అందరి ధ్యేయం నెరవేరే
దాకా తన నిర్వాణను వాయిదా వేసుకుంటాడు. పాత
బౌద్ధం వ్యక్తిగత నిర్వాణం ధ్యేయంగా గలది కాగా
మహాయానం అందరి నిర్వాణం ధ్యేయంగా గలది.

మహాయానంలో బుద్ధుడు మత బోధకుని
స్థాయి నుంచి రక్షించే దేవుని గా ఎదిగాడు. బుద్ధుని
విగ్రహాన్ని విస్తారఖ్ఖాలు, మంత్రాలు, మేళ తాళాలతో
ఆరాధించడం మునుపటి అతీత సామర్థ్య సత్యాన్ని
గుర్తించడం స్థానంలో చోటుచేసుకొంది — ఈ మార్పును
బుద్ధుడు గర్హించి ఉండేవాడు. మునుపటిలాగా బుద్ధుని
చిహ్నాలను కొలవడం తగ్గింది కాని విగ్రహారాధన
ఎక్కువ ప్రాముఖ్యం సాధించింది.
క్రీ.శ. ఆరంభానికల్లా 'భక్తి భావన' ముఖ్యం
ఫలితంగా మహాయానానికి
గా మారింది.

# జైన మతం :

(వ్యాపార వాణిజ్యాలలో జైనం నగరాల్లో వర్తక వర్గం లో ఆదరణ పొందింది. ఇందులో కూడా చీలికలు వచ్చాయి.)

(జైనం బౌద్ధమతం అంతగా వ్యాప్తి చెందలేదు. పైగా బౌద్ధానికున్నంత రాజాదరణ జైనానికి లేదు. అయినా జైన స్వాములు చైతన్యంగా ఉండటం, జైనం ప్రచారానికి మఠాలను నిర్వహించడం చేశారు. క్రీ.శ. తొలి శతాబ్దాల్లో భారత దేశం లో జైనం తన స్థానాన్ని స్థిరపర్చుకుంది. కాని బౌద్ధం లాగా జైనమతం భారత్ వెలుపల ప్రచారానికి ప్రయత్నించలేదు.)

(కళింగ ఖారవేలుడు జైనాన్ని ఆదరించి జైనులకి ఉదయగిరి కొండల్లో గుహలు దానం చేశాడు. ఉత్తరభారతం లో మధుర మరో జైన కేంద్రం, మధురశిల్పశైలి తీర్థంకర శిల్పాలను అందించింది. తమిళ ప్రాంతంలో దక్షిణ ఆర్కాటు లో కొండ గుహలు; సిత్తన్నవాసల్ గుహలు (పుదుక్కోట్టై జిల్లా) జైనులకి దానంగా ఇవ్వబడటం ఆ ప్రాంతంలో జైనమతానికున్న ఆదరణని చెబుతున్నాయి.)

జైనుల్లో క్రీ.పూ. 2 వ శతాబ్దం ప్రాంతంలోనే శ్వేతాంబర, దిగంబర శాఖలు ఏర్పడా.

దిగంబరులు వివస్త్రులై ఉంటారు కాగా శ్వేతాంబరులు
తెల్లని వస్త్రాలు ధరించేవారు, వీరిద్దరి మధ్య సిద్ధాంత
భేదాలు / చాలా తక్కువ మాత్రమే
ఉన్నాయి. ఇది ఈ కాలం లో కూడా అనుసాగింది.
(ఈ చీలిక ఈ కాలంలో కూడా కొనసాగింది.)

(క్రీ.శ. ఐదవ శతాబ్దం లో జైనమతం
లో మరో శాఖ గా "యాపనీయ" (Yapaniya)
వృద్ధి చెందింది.) ఇది కలయనగర లోని శ్వేతాంబర
సన్యాసి కలశ చేత స్థాపించ బడి ఉండవచ్చు.
(దీని ప్రత్యేకలక్షణం - స్త్రీలు కూడా 'మోక్ష'
పొందవచ్చని ప్రవచించడం), కేవలినులు వారి
ఆహారాన్ని
(Kevalins should take their food in morsels.)
వెయ్యేళ్ళ మీద జైనమతం దాని వాస్తవ సిద్ధాంతాలకి
విధేయమవుతూనే ఉంది, అందుకే దాని అనుయాయుల
సంఖ్య స్థిరంగా ఉంది.

శ్వేతాంబర శాఖ, వజ్రయతి క్రీ.శ. 2 వ
శతాబ్దంలో రాజగృహ లో ప్రసిద్ధి చెందాడు. ఈ
కాలం లో మథుర, ఉజ్జయిని ముఖ్య జైనకేంద్రాలు
గా ఉండేవి. తక్షశిలలో సిర్కప్, ఉదయ

బ్రోచ్, సాహారా లు ; అయోధ్యన ఉదయగిరి, ఖండగిరి కొండలు జైనులకు ప్రసిద్ధి. క్రీ.పూ. 2 వశతాబ్దం లో ఖారవేల లేమిడిగుంట మధుర, శ్రవణబెళగొళ ప్రాంతాలు జైనానికి ముఖ్యకేంద్రాలుగా భాసిల్లాయి.

— ० —

* జైనులు మగధ నుండి పశ్చిమంగా మథుర, రాజస్థాన్, ఉజ్జయిని, సౌరాష్ట్ర ఇంకా పశ్చిమతీరం వెంట సాహారా మొదలైన ప్రాంతాలకు వెళ్లి అధిక ప్రసిద్ధి చెందారు. రాజస్థాను, గుజరాత్‌లో బాగా ప్రసిద్ధి చెందారు. మరో వర్గం వారు కళింగ వెళ్లారు.
* ఇతర సంప్రదాయాల మధ్య జైన ఆచారాల్ని పాటించడం కష్టమైంది, కావున బౌద్ధం వలె జైనం "pan-Asian" మతంగా ఆవిర్భవించలేదు.
* (జైనమతం లో కూడా 'విగ్రహారాధన' ప్రబలమయ్యింది.)

## బ్రాహ్మణమతం :

(మౌర్యానంతర యుగ ఆరంభంలో వైదిక బ్రాహ్మణ
మతాలకు ప్రాధాన్యమంది బలులతో కూడిన యాగాలు, క్రతువులు,
సంకీర్ణాచారాలు, విస్తృతాలు వంటి పాలకవర్గం వారు.
రాజుల పట్టాభిషేకాలు మొ॥ వాటికి వైదిక యాగాలు
ఆచారంగా ఉండేవి. కాని వైదిక సంప్రదాయం బ్రాహ్మణుల
కే పరిమితమై ఉండేది.) ఈ దశలో అప్పుడే ఎదుగు
తున్న భాగవత, శైవ శాఖలతో కొంత మేరకు
overlaps అవుతుండేవి. ఆదరణకై పోటీ,
అనుయాయుల్లో వైవిధ్యాలకై పోటీల కారణంగా
బౌద్ధ, జైనాలతో కొంత వైరం ఉండేది. (కొందరు
వైదిక దేవతలు - వరుణ, మిత్ర మొ॥ వారు కనుమరుగ
య్యారు.) ఇంకొందరు - ఇంద్ర, అగ్ని మొ॥
వారు తమ ఆధిపత్యం కోల్పోయారు. (రుద్రుడు
బ్రహ్మ or ప్రజాపతి వంటి ఆరాధింపబడే వారిలో
దేవతలుగా ఎదగసాగారు.) At this time
Vedic Brahmanism became differentiated from
sects such as the Bhagavata and Shaiva — now
referred to as Puranic Hinduism — and which
took form towards the latter part of the
period.

'హిందు' అన్న పదం క్రీ.శ. లోని
సహస్రాబ్ది లో వాడుకలో లేదు. నేడు మనం
హిందూమత శాఖలుగా చెప్పేవాటిని ఆనాడు అనుసరించే
వారు తమ మతాన్ని గుర్తించేందుకు వారి శాఖల పేర్లనే
వాడేవారు. అంటే వారిని వారు వైష్ణవులు, శైవులు
లేదా వాటిలోనే భాగవతులు, పాశుపతులు ఇలా తమ
మతాన్ని చెప్పుకునేవారు. అంటే ఆనాడు మతగుర్తింపు
కు 'శాఖ'ని (sect) వాడేవారే గాని అన్ని
శాఖల్ని కలుపుకున్న అన్వయించిన మతాన్ని (all-inclusive
religion) వాడేవారు కాదని తెలుస్తుంది.

అయితే మధ్యయుగానంతర యుగం లో
వైదిక బ్రాహ్మణమతం నుండి ఈ శాఖల్ని వేరుగా కలిపి
చెప్పేందుకు "పౌరాణిక హిందూమతం" అనే పదం
నేడు వాడుకలోకి వచ్చింది. క్రీ.శ. 8 వ శతాబ్దం

తర్వాత అరబ్బులు సింధు కి అవల ఉన్న
వారందర్నీ కలిపి 'హిందు' అని పిలవడం లోంచే
పదం పుట్టింది. ఆ తర్వాత కాలంలో భారతదేశంలో
వైష్ణవులా ప్రాముఖ్యాన్ని పొందిన మతాల్ని కలుపుకుంటూ
వారందరు అని దానికి అర్థం ఏర్పడింది.

పురాణ రచనల్లో ఈ మార్పు ప్రతిఫలించి
లిఖించబడి ఉండటం చేత ఈ పేరు రూపొందింది.
పౌరాణిక రాయడం క్రీ.శ. ఆరో శతాబ్దాల్లో మొదలయ్యింది.
ఒక్కో పురాణం ప్రత్యేక దైవాన్ని ప్రత్యేకీకరించబడింది,
భక్తునికి మార్గదర్శిగా ఉంటుంది. తర్వాత కాలం లో
ఇవి పూజా విధానాలకీ, స్థల మహాత్మ్యాలకీ, ఆగమాల్ని
క్షేత్రమహాత్మ్యాల్ని రాయటానికి ప్రేరణ నిచ్చాయి.
ఈ క్రమంలో ప్రజా విశ్వాసం, భక్తి అవసరమైనవి గా
ఉన్నత కులాల రచయితలు అంగీకరించారు. వైదిక బ్రాహ్మణం
లా లాగా కాక పురోహితుని మధ్యవర్తిత్వం optional
'ఐచ్ఛికం' గా మారింది.

వైదిక బ్రాహ్మణమతం లాగానే
వైష్ణవ, శైవాలు చారిత్రక పురుషులచే స్థాపించబడలేదు.
అవి ఆవిష్కరించబడ్డ (revealed) మతాలు కావు.
కాని అనేక రకాల మతాలు, నమ్మకాలు, ఆచారాలు
వీటిలో కొన్ని బ్రాహ్మణ ఆచారాల నుంచి వచ్చినవి కాగా

ఆర్య కార్మిక విరుద్ధమైన జానపద మతాల నుంచి
వచ్చినవి కూడా ఉన్నాయి, వీటి నుంచి ఈ వైష్ణవ, శైవాలు
వృద్ధి చెంది పరిణామం చెందాయి. ప్రజాదరణ రూపం
బ్రాహ్మణులు కొంత దిగివచ్చి ప్రజాబాహుళ్య మతాల్ని ప్రధాన
మతం లో కలుపుకున్నారు.

వైష్ణవ, శైవాలు ఉద్భవించి వాటి లోని
పాండ్యుల గుర్తింపు లో తరచుగా కలుస్తుంటారు. వారసత్వ
ఆధారంగా తెగలుగా (clans) సంఘం ఉన్నప్పుడు ఉన్నప్పటి కాలం
నుంచి ఈ మతాలు తమ లోని నమ్మకాల్ని చెప్పుకొని
ఉంటాయి. ఈ గుర్తింపులు తెగలు 'కులాలు' గా మారడం
తో మారిపోయి ఉంటాయి, కాని కొంత వరకు నమ్మకాలు,
ఆచారాలు మతవిశ్వాసాలుగా ఆనవాళ్ళ ఉంటాయి. తెగ తేడా
రక్త సంబంధాల గుర్తింపులు. జాతి సభ్యత్వం గుర్తింపులో మారాయి,
కాగా తెగల పురాతన ఆచారాలు జాతి భావన నుంచి
వచ్చే ఆచారాలతో కప్పివేయబడి overlaid
ఉంటాయి. విశ్వాసులకి, దేవతలకి మధ్య పురాతన
మధ్యవర్తిత్వం అవసరం లేని సూటైన ఆరాధనా విధానం
పరిణామం పొందింది. ఈ క్రమవిధానం (process)
తర్వాతి కాలంలో మరింత స్పష్టంగా కన్పిస్తుంది, అయితే
మార్పు సూచనలు మతంలో మొదట్లోనే చూడొచ్చు. ఏమైనా,
పురాతనమైన వాస్తవం అంతం కాలేదు, కొంత కాలం దూరంగా
ఉన్నా పురాతనతలు ఈ సూటైన ఆరాధనా విధానాన్ని
అంగీకరించినారు.

కాలం లో ఇష్టపూర్వక సమాచార రూపంలో,
సమాకలించుకుంటున్న రూపంలో చూడబడేది, ఇప్పుడు
వర్ణ సమాజ సరిహద్దు అవల ఉన్నవారికి వర్ణ హోదాను
ఇచ్చి, వారి నమ్మకాలను అదనపు పురాణాల కింద, విగ్రహాల
కిందా చేర్చుకునే ప్రక్రియగా కూడా చూడబడుతుంది.
కొందరు తెగల పురోహితుల్ని మినహాయించి సాధారణంగా
ఇలా చేర్చుకున్న సమూహాల్ని శూద్రులుగానే పరిగణించేవారు.
తెగలో సమాన సభ్యులుగా ఉండడానికి అలవాటుపడిన వారు
ఇలా చేర్చుకోవడం పై నిర్వేదంగా ఉండి ఉండరు.

అనేక దైవాలని ఆరాధించడం కొనసాగినా
కొందరి పైనే దృష్టి కేంద్రీకరించే లక్షణం కూడా కనబడుతుంది.
ఇది మొదట్లో కొంతమేర వైదిక ప్రార్థన ఆలాపనల్ని ప్రోత్సహించి ఉండొచ్చు.
అయినప్పటికీ 'త్రిమూర్తుల' భావనా ప్రాచుర్యం పొందింది.
బ్రహ్మ సృష్టికర్త, విష్ణువు సృష్టిని కాపాడేవాడు, శివుడు
చివరికి సృష్టిని అంతం చేస్తాడు. కాలక్రమంలో విష్ణువు, శివుడు
ప్రధాన దైవాలుగా ఎదిగారు, కాని బ్రహ్మ వెనక్కి వెళ్ళిపోయాడు.

సృష్టిని కాపాడే విష్ణువు అధర్మం పెచ్చరిల్లినపుడు
వివిధ అవతారాలు ధరించి ప్రపంచం లోని చెడును నిర్మూలిస్తాడు.
ఇటువంటి అవతారాల్లో మనుషులూ, జంతువులూ ఉన్నాయి. ఇతిహాస
నాయకులు రాము, కృష్ణ అవతారాలుగా చెప్పబడ్డారు.
వాస్తవంగా రాజులకి తెగల పెద్దలకి చెందిన మూలాల ప్రస్తావనైన
ఇతిహాసాలు కాలంలో దశావతార మత గ్రంథాల స్థానాన్ని
పొందాయి. మత సాహిత్యంగా ఉపయోగపడేందుకు వాటిని
పునర్లిఖించారు. (revised) ఇలా చేయడంలో

ఎన్నో సూచనలు ఇలాగు చెప్పబడ్డాయి, ఎలాగా మహాభారతం
లో చేరిన '<u>భగవద్గీత</u>' చెప్తున్నది. విష్ణువు పదవ,
మరియు చివరి అవతారం అయిన 'కల్కి' భవిష్యత్తులో
వచ్చి అధర్మాన్ని అంతం చేస్తాడు చెప్తున్నారు. (తరువాత
కులాల వారు ఉన్నత వర్ణాన్ని ధిక్కరించడం మొ॥ అధర్మాన్ని
బ్రాహ్మణమతం ప్రకారం అధర్మమైనవి.)

అవతారాల ఆలోచనకు బుద్ధ మరియు
బోధిసత్వాల భావనల సిద్ధాంతాల్ని గుర్తుకు తెస్తుంది.
'<u>కల్కి</u>' బౌద్ధమతం లోని '<u>బుద్ధమైత్రేయ</u>' లా
ధ్వనిస్తుంది. మైత్రేయ అంతకు ముందు గ్రంథాల నుంచి
తెలిసినా ఈ కాలం లోనే ప్రాచుర్యం పొందాడు. బౌద్ధమతం
లో ఒక రక్షకుడు రాకపోతే నాశనమౌతుందనే భయం కలగడం
వలన ఈ కాలంలో మైత్రేయ ప్రాచుర్యం పొందాడు.
మౌలిక బోధనల విధానానికి చాలక స్థాపకుడి స్థాయి నుంచి
బుద్ధుడు messianic, millenarian దైవం గా
చిత్రించబడ్డాడు. ఈ అవతారాల భావనలు,
రక్షకుల ఆలోచనలు ఒక మతం మరొక మతాన్ని
ప్రభావితం చేయడం వలన కలిగినవి కావు.
దూరాలకు ప్రయాణించే, కలిసే ఒక మధ్య మార్గాల్లో
ఒక సంభాషణా విశ్వం (a universe of discourse)
ఆవిష్కృతమవడం ఇందుకు కారణమనవచ్చు.

ఈ సంభాషణలు తత్త్వం, నమ్మకాల లో ఆ కాలం లోని అనేక మత ఆలోచనల్లో గల సమాంతరాల్లో ప్రతిఫలిస్తుంది. ముఖ్యంగా భారత్, మధ్యఆసియా, పశ్చిమ ఆసియా ప్రాంతాలని చెప్పవచ్చు.

పౌరాణిక హిందూమతం లో అనేక స్త్రీ దేవతలు ముఖ్యంగా సంతాన ఆరాధనా మతాల దేవతలు పురాణగాథల్లో ప్రాముఖ్యతను సంపాదించి ప్రాథమిక ప్రముఖ దైవాలుగా కొలవబడ్డారు. ఇదే తర్వాతి కాలంలో తాంత్రిక దేవతల కి దారి తీసింది. ప్రకృతి, జంతువులు దేవుని పవిత్ర రూపాలుగా తలచారు. చెట్లు, నదులు, పర్వతాలు అలాగే ఎద్దులు, పాములు పవిత్రంగా కొలవబడేవి. ఈ ఆరాధనతో పాటు అనేకమైన అతిపురుషులు, దివ్యలోకవాసులు వివిధ శ్రేణుల్లో (ranks) హోదాల్లో కొలబడుతూనే వారు.

పునర్జన్మ నుండి విముక్తి అనే భావం 'కర్మ' 'సంసార' వంటి వాటికి ప్రాధాన్యత నిచ్చింది. ఈ భావాలు ఉపనిషత్తుల్లో నుంచి బౌద్ధ, జైన మతాల చేత విస్తృతమై ఈ కాలంలో మంచి ప్రచారం పొందాయి. వైదిక బ్రాహ్మణాల ద్వారా గా విగ్రహాన్ని ఆరాధించడం అనేది వ్యక్తిగత గా ఏక దైవం మీదా భక్తిని మీదా దృష్టి పెట్టింది. ఆరాధన యొక్క ఉద్దేశం 'మోక్షం'. శ్రమణిక మతాల్లో వలెనే వ్యక్తి యొక్క ముక్తి ని మరింత కేంద్రం చేయడం ఈ వైష్ణవ, శైవాల ప్రచారం కి విపరీతంగా తోడ్పడం చేసింది.

ప్రస్తుత జన్మ లోని చర్యలు వచ్చే జన్మ పరిస్థితుల్ని నిర్ణయిస్తాయి. ఇది విధివాదం కాదు, ఎందుకంటే ఒకరు నిరంతరం మంచి పనులు చేయడం ద్వారా తమ విధి ని మార్చుకోవచ్చు. ~~అయితే~~ 'విధి' గా చెప్పించేదేమిటంటే ఆ చర్య నైతికత 'ధర్మ' లా పరిగణించబడుతుందా లేదా అన్నదానిపై ఆధారపడి ఉంటుంది - వైదిక బ్రాహ్మణులలా సాంప్రదాయిక హిందూ సిద్ధాంతం లోనూ 'ధర్మ' ను ప్రతిపాదించేది బ్రాహ్మణులూ, వారి ప్రమాణ గ్రంథాలే - ధర్మశాస్త్రాలే. ఇవి 'వర్ణ' నీతుల్ని ప్రాయబద్ధం చేశాయి. బౌద్ధ, జైన మతాలు భిన్నమైన సాంఘిక నైతికతలు చెప్పాయి, ఉదాహరణ 'వర్ణ' లో - లేని 'మధ్యమార్గం' ను చెప్పవచ్చు.

[వైష్ణవ, శైవాల్లో కనిపించే ముఖ్యలక్షణం "భక్తి" భావన. భక్తి మార్గం లో మోక్షం పొందడం వీలు అత్యం గా కల్పిస్తుంది.]

— o —

* (~~ఈ~~ కాలంలో శైవం గొప్ప రాజాదరణ పొందింది. కుషాణ రాజు విమా కాడ్ఫైసిస గొప్ప శివారాధకుడు. అతని నాణాల వెనుక త్రిశూలధారి గా శివుడు కనిపిస్తాడు. కనిష్కుడు బౌద్ధుడైనా అతని బంగారు నాణాల వెనుక శివుని చిత్రం కనిపిస్తుంది. దక్షిణ లో శివారాధన తొలినాళ్ళ నుంచీ ఉంది - బాగా ప్రాచుర్యం లో ఉంది.

ప్రదర్శించాడు. తమిళ సంగం సాహిత్యం కూడా విశిష్ట గుణాల్ని, గొప్పదనాన్ని కీర్తిస్తుంది.

## క్రైస్తవమతం:

ఎడెస్సా కాథలిక్ చర్చి ప్రకారం క్రీస్తు శిష్యుడు సెయింట్ థామస్ భారత్ లో రెండు పర్యాయాలు వచ్చాడు. మొదటిసారి వాయువ్యంలో పార్థియన్ రాజు గొండోఫెర్నెస్ వద్దకు రెండవసారి క్రీ.శ. 52 ప్రాంతంలో మలబారుకు వచ్చాడు. తూర్పు మధ్యధరా సంప్రదాయంలో అతడు [illegible] నుంచి ముజిరిస్ వచ్చాడు. అవన్నీ వర్తక మార్గాల్లోనే ఉండడం ఆసక్తికరం. ఏమైనా క్రీ.శ. 500 (mid-first millenium A.D.) ప్రాంతంలో చారిత్రక సంబంధాలు ఎడెస్సా మరియు పర్షియన్ చర్చిలతో బలంగా కన్పిస్తాయి. థామస్ కాన నేతృత్వంలోని పర్షియన్ క్రైస్తవులు కేరళ వలస వెళ్లారు, అక్కడ స్థానిక రాజు వారికి భూదానం చేశాడు. భారతదేశానికి క్రైస్తవం తొలిరాక సిరియన్ క్రైస్తవ చర్చి ఏర్పాటు చేయటం తోనే ఎక్కువ గా ముడిపెడతారు.

ఆయన అభిప్రాయాల భావం, వారి స్పందన.] భారతీయేతరుల
తో వర్తకం చేయడం ద్వారా ; దేశంలోకి
కొత్త ప్రాంతాలు తెరువబడి విభిన్న ఆచారాలు - సంస్కృతులు
గల ప్రజల తో సంబంధాలు అమరవటం వలన
కారణాలై ఉండవచ్చు. [స్థిరత్వ వర్గ గుర్తింపుగా పుట్టుక,
③ వృత్తి తో పాటు ఒక ప్రాంతం లో కొనసాగడం -
(ప్రాంతీయ గుర్తింపు అందిస్తుంది కాబట్టి) కూడా
అవసరమే.] కాని, కొత్త వృత్తులు - వలసలు -
దూర ప్రాంతాల నుండి గుర్తింపులు (identities)
మరియు వాటి ప్రాధాన్యత పెరగడం తో బ్రాహ్మణులకు
తప్ప వర్ణ ని గట్టి గా కట్టడి చేయడం సాధ్యం
కాలేదు. నగర జీవితాల్లోని ప్రాధాన్యం
[నగర ప్రజల్లోని ప్రాధాన్యం ధర్మశాస్త్రాలు
నగర జీవితాన్ని తక్కువ గా చూపడానికి
నిస్సందేహంగా ఒక కారణమవవచ్చు]. [సిద్ధాంతరీత్యా
చాతుర్వర్ణాల స్థాయిబద్ధ విధులు, కర్తవ్యాలు
స్పష్టంగా నిర్వచించబడ్డాయి. అయితే ఆచరణలో
④ మాత్రం ఎన్నో విరుద్ధాలు తలెత్తేవి.]
వైష్ణవ, శైవాలను మార్చడం కూడా కొంత
తెలిపేవి కావు ; పుట్టుక, కులం, మతాచారాలు
పరస్పరాధారితాలై ఉండటం అందుకు కారణం.

(5) ఒక పెద్ద వైరాందవేతర సమూహం క్రమంగా అది (91)
ఒక 'జాతి' గా మారడం ద్వారా ఇమిడిపోవచ్చు.
కాని ఒక వ్యక్తి మార్పిడి (Conversion) పొందాలంటే
అది సరైన కులం - స్థాయి కి చెందిన సమస్యల్ని సృష్టించేది
(ఇది పుట్టుక మీద ఆధారపడుతుంది కనుక). అందువల్ల
ఇతరులకి వచ్చిన వ్యక్తి కి బౌద్ధుని గా మారడం సులువుగా
ఉండేది, అయినా కొందరు భాగవత మతం లో చేరారన్నది
వేరు విషయం. బౌద్ధ కేంద్రాల్లోని అనేక దాన శాసనాల్లో
యవనులు బౌద్ధమతం స్వీకరించినట్లు తెలుస్తుంది. ఆ రోజుల్లో
బౌద్ధమతం ప్రాచుర్యం లో ఉండటం చే దాని ప్రతిష్ఠ
కొత్త గా మారిన వారు అలవాటుపడటాన్ని సులభతరం చేసింది.

(6) స్వదేశీయ బ్రాహ్మణులు కింది కులాల నుంచి
దూరంగా ఉన్న రాజకీయాధికారం గల వారిని కులభ్రష్టుల
గా చేయలేరు కాబట్టి కొత్త పాలక వర్గం లో కలపాల్సి వచ్చింది.
"దిగజారిన క్షత్రియులు" అన్నది పాలక వర్గానికి వ్యంగ్యాత్మకంగా
ఇచ్చిన మినహాయింపు, అయితే దీన్ని పొందిన వారు ఈ స్థాయి పట్ల
వర్తించి ఉండరని సులభంగా చెప్పవచ్చు. ~~అంతకు~~ ముందు కాలం
లో వర్ణవాదాలతో సంబంధం లేకుండా రాచరికం కొంత తెరవ
బడి ఉన్నప్పటికీ, రాజకీయ- ఆర్థిక రంగాల్లో ప్రముఖులుగా మారిన
విదేశీయుల అస్తిత్వం వర్ణ సిద్ధాంత నియమాల్ని తప్పనిసరిగా
సవాలు చేసి ఉంటుంది. తక్కువ కులాల్లో ఉన్నవారు తమ
హోదా పెంచుకోవటం కోసం కొత్తగా వచ్చిన విదేశీయులతో
చేరటం ద్వారా ప్రయత్నాలు చేసి ఉంటారు నిస్సందేహంగా

చెప్పవచ్చు. వర్తకం లో వృద్ధి ద్వారా గ్రామాల సంఖ్య పెరగడం, అనేక మంది చేతివృత్తిదారులు నియమించబడడం, వారికి ఆదాయాలు పెరగడం జరుగుతుంది. చేతివృత్తిదారులు సామాన్యంగా శూద్రుల నుండే వచ్చేవారు, వీరిలో కొందరు తమ కుల హోదాను పెంచుకోవడానికి వారి వృత్తి, ప్రాంతం మార్పులతో ప్రయత్నం చేసేవారు. ఇలాంటి వర్గాల్ని అదుపు లో ఉంచడానికి "సంకీర్ణ జాతి" తరగతి కూడా ఉద్దేశించబడింది.

సాధారణంగా కింది కులాల వారు నగర పొలిమేర్లలో ఉంటూ తమ వృత్తుల్ని నిర్వహించాలి. వీరు ఉండవలసినవారు నగర పరిధికి వెలుపల ఉండాలి.

సాధారణంగా సమాజం లో కింది వర్గంగా చెప్పబడే అస్పృశ్య 'జాతులు' నగర బయట ఉమ్మడ్లను వినియోగపడుకోవడం తమ సాంఘిక స్థాయి ని పెంచుకోవడానికి సనాతన సాంఘిక వ్యవస్థ రక్షించేందుకని కలవరపడి ఉండొచ్చు. ధర్మశాస్త్రాల్లో బ్రాహ్మణుల హోదాని ఎవరికి సేవలు చేస్తే వారు సంబంధించి రాసినట్లు ఉంటుంది. అందుకే బ్రాహ్మణుల ఆధిక్యతని, వారిని గౌరవించాల్సిన అవసరాన్ని పదేపదే నొక్కి చెప్పారు.

(7) [ప్రమాణిక గ్రంథాల్లో సాంఘిక న్యాయాల సాధ్యానికి విరుద్ధంగా సమాజ జీవనం లో సారళ్యత (flexibility) పరిఢవిల్లేది].

[సాంచి, బార్హుత్ ఇత్యాది స్థూపాల వద్ద దాన శాసనాల్లో దానకర్తలు తమ నివాసస్థలం, వృత్తుల ఆధారంగా గుర్తింపులు చెప్పుకొన్నారే గాని

వర్ణ, కాలి తప్పనిసరిగా ఏమీ పేర్కొనలేదు.

(8) మౌర్యానంతరయుగం లో కులవ్యవస్థ రెండు ప్రధాన మార్పుల్ని R.C. మజుందారు పండితుడు చెప్పారు.

1) పౌరుల న్యాయవ్యవహారాను / పౌరుల న్యాయపరమైన వ్యవహారాను కులం ప్రభావితం చేయడం: పౌర, నేర సూత్రాలు రెండూ కూడా కులాన్ని అనుసరించి మార్చబడ్డాయి. ఒకే నేరానికి శూద్రులకి తీవ్రమైన శిక్షలు, ఉన్నత కులాల వారికి సరళమైన శిక్షలు న్యాయబద్ధం చేయబడ్డాయి.

2) మిశ్రకులాలు - ఉపకులాలు తలెత్తడం: అనేకమంది విదేశీయులు రావడం వలన కులాల మిశ్రమం విరివిగా జరిగింది, ఇది నూతన కులాలు, ఉపకులాల కు దారి తీసింది.

(9) చేతివృత్తికారులు, వర్తకులు ఎక్కువగా శూద్రులనుంచి వచ్చేవారు. మౌర్యుల తర్వాత ప్రభుత్వ నియంత్రణ తొలగడం తో శ్రేణులు బలపడటం, వృత్తికారులకి అంతర స్వేచ్ఛలభించడం జరిగింది. వర్తకం పరిధి పెరగడంతో ఈ వృత్తిపనివారి ఆర్థిక స్థితి మెరుగైంది. అందువల్ల వైశ్యుల కి శూద్రులకి మధ్య ఆర్థిక వ్యత్యాసాలు క్రమంగా అదృశ్య మయ్యాయి. కాని చాలా వరకు చేతివృత్తికారులు పట్టణాల్లోనే స్థిరపడేవారు, కాబట్టి ఒక వర్గం గా శూద్రుల జీవిత పరిస్థితుల్లో గొప్ప మార్పు

కలిగిందని చెప్పటం కష్టమైంది. సాధారణంగా వారు దాసీలుగా, బానిసలుగా పనిచేస్తూనే ఉండేవారు.

స్త్రీ విషయంగా ఉన్నత వర్గం వ్యక్తి కింది స్థాయి స్త్రీని వివాహం చేసుకోవచ్చు. అయితే పతంజలి 'దాసి' 'వృషలి' (శూద్ర స్త్రీ) వీరు ఉన్నత కులాల పురుషుల విలాసాల కోసం ఉన్నారని చెప్పాడు.

(10) అనేకమంది శూద్రులు అసంతృప్తి లో రగిలిపోయేవారు. వారు తరచూ బ్రాహ్మణులకి, ఉన్నత కులాలకి వ్యతిరేకంగా ప్రవర్తించటం, సమాజంలో అలజడి సృష్టించటం కలిగిందనడం లో తప్పు ఉండదు. అనేక పురాణాల్లో సంఘం 'కలియుగ' విపత్తు నెదుర్కొంటుందని రాయటంలో ఇదే ధ్వనిస్తుంది - కుటుంబ వ్యవస్థ, వ్యక్తిగత ఆస్తి, వర్ణ వ్యవస్థ దాడినెదుర్కొంటాయని. అందుకే ధర్మకర్తలు / స్మృతికర్తలు శూద్రుల వ్యతిరేకత నుంచి రక్షణ కల్పించటమే గాక బ్రాహ్మణ వైదిక వ్యవస్థ ని కాపాడే సూత్రాలు రాశారు.

## వర్తకం - సమాజం

(11) మౌర్యానంతర యుగంలో వర్తకం మునుపెన్నడూ లేనంతగా పెరిగింది. ఇది సమాజాన్ని ఎంతగానో ప్రభావితం చేసింది. ధర్మసూత్రాల్లో స్థానిక వర్తకుల/వర్తక సమూహాలు పాల్గొనటం అన్నది సుదూర వర్తకానికి కూడా తప్పని సరిగా ఉండేది.

అందువల్ల ఈ వర్తకం యొక్క లాభాలు సమాజంలోని ఇతర స్థాయిలకు కూడా చేరాయి. (filtered down to other levels of society) వృత్తిపనివారు, వస్తుకారులు, వర్తకుల సంపద వారు బౌద్ధ విహారాలకు చేసిన దానాల్లో ప్రతిఫలిస్తుంది.

చేతివృత్తికారులు, వర్తకుల శ్రేణులు పాత వారసత్వ (Kinship) సంబంధాల్ని కాదని వస్తుకళల ఉత్పత్తుల్ని, వర్తక కార్యకలాపాల్లో నూతన సంబంధాల్ని పరిచయం చేశాయి.

విరాళాలకి, వర్తక-వాణిజ్య సమూహాలకి, బౌద్ధ విహారాలకి మధ్య సంబంధం దక్కనులో సమాజ- బాధ్యత వహించింది. ఆర్థిక మార్పుల్ని తెలియచేయడంలో

క్రీ.శ. తొలి శతాబ్దాల్లోని బ్రాహ్మణ గ్రంథాలు బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర గా సమాజాన్ని విభజించాయి. వ్యవసాయం, వర్తకం సాధారణంగా వైశ్యుల విధులు. చేతివృత్తులు శూద్రులకి చెప్పబడ్డాయి. దీనికి వ్యతిరేకంగా తొలి బౌద్ధ గ్రంథాలు సమాజాన్ని విభజించడానికి అనేక పద్ధతులు చెప్పాయి. వర్ణ భేదాలు ప్రమాణముగల శ్రేణుల కోడు గా ఇవి పని మరియు చేతివృత్తి (work and craft) ఆధారంగా అనేక వివక్షతలను చెప్పాయి. ఇక్కడ విభజన ఉన్నత, తక్కువల మీద ఆధారపడింది. వ్యవసాయం, వర్తకం మరియు

పశుపోషణ – ఇవి ఉన్నతస్థాయి పనిగా చెప్పబడ్డాయి.
అయితే చాలా బౌద్ధ గ్రంథాల్లో ఉత్తమ వృత్తులు అనేవాటిలో
ఎప్పుడూ వ్యవసాయం, వర్తకం, పశుపాలనలతో కలిపిపెట్ట
బడి చూపబడలేదు. అలాంటి వృత్తుల్లో లెక్కించడం,
లేఖనం (accounting and writing) ఉత్తమమైనవి.
కాగా లోహపని, బట్టలల్లడం, నేత మొదలైనవి తక్కువ
స్థాయి పనులుగా చూడబడుతున్నాయి. మొత్తం మీద,
బౌద్ధ సమాజంలో గుర్తింపు వృత్తి / వృత్తుల ఆధారం
గా ఉండేది, సమాజంలో వర్తకులకు ఉన్నతస్థానం
ఉండేది.

ఇది శాసనాల్లో కూడా ప్రతిబింబించబడింది.
బౌద్ధ విహారాల ప్రాంతాల్లో దానకర్తలు కేవలం వారి
వృత్తిని ప్రస్తావించారు గాని వారి కులం (caste
affiliation) ఎక్కడా కన్పించదు. వర్తకులు, భూస్వాములు
ప్రముఖంగా చూడబడ్డారు, స్త్రీలు కూడా సొంత
హక్కులో ఉన్నారు.

జాతుల పరిణామం :

ప్రాచీన భారతంలో మౌర్యానంతరయుగం
భారత సాంఘిక చరిత్రలో ఒక సంధికాలాన్ని సూచిస్తుంది.
రాజకీయంగా బౌద్ధం ప్రపంచ మతంగా ఎదిగింది – జైనం
దక్షిణ భారత మతంగా ఎదిగింది. భిన్న సాంఘిక – సాంస్కృతిక

నేపథ్యం గల విదేశీయులు పెద్ద సంఖ్యలో మనదేశానికి రావడం
పరిస్థితిని మరింత క్లిష్టం చేసింది. కళలు, చేతివృత్తులు,
వర్తకం సాధించిన వృద్ధి వైశ్య, శూద్రుల సాంఘిక హోదా
లో మార్పుల్ని తెచ్చింది. ఈ మార్పులకు అతి ప్రతిస్పందన
బ్రాహ్మణ గ్రంథాల్లో "కలి యుగ" ప్రభావంగా అదంతా
universal decay కు దారి తీసేది
గా వర్ణించడం లో కన్పిస్తుంది.

(13) [ఈ కాలం లో వర్ణ వ్యవస్థ లో గణనీయ
మార్పులు చోటుచేసుకున్నాయి. వర్ణ వ్యవస్థ లోపలే
ముక్కలుచెక్కలవడం వల్ల (fragmentation), చేతివృత్తుల
వాళ్ళు - శ్రేణుల్లో సమైక్యంగా బలపడటం వల్ల, అలాగే
ఆదివాసీ తెగల్ని - విదేశీయుల్ని కలుపుకుపోవటం వల్ల
ఒక నిర్మాణం లో
కులాలు పరిణామం చెందాయి.]

(14) [ఈ నిర్మాణం వివాహ నియమాలు,
అంతర్గత వివాహాలు, పుట్టుక ఆధారంగా గౌరవం మొదలైన వాటి
ద్వారా ప్రమాణగతశ్రేణి ని నియంత్రించేది - ఇవన్నీ
ఒక నిర్దిష్ట వర్గం లో సభ్యత్వాన్ని సూచించటానికి 'కుల'
పదాన్ని వాడటానికి దారి తీశాయి.] ఈ విధంగా చూస్తే
విశాల సమాజం వృద్ధి కి వ్యవస్థీకృత మరియు ఆదర్శవాద
ఆధారాల్ని అందించటం కోసం వర్ణాలు విస్తరిత పరచబడ్డాయని
పిస్తుంది.

'వర్ణ' తో పాటు 'జాతి'ని కలిపి సారిగా

'నిరుక్త' లో వాడటం కన్పిస్తుంది, ఇందులో శూద్ర జాతి

(స్త్రీ) గురించి చెప్పబడింది. పాణిని కాలానికి శూద్రవర్ణం

లో 'అనిరవసిత' మరియు 'నిరవసిత' విభాగాలు

ఏర్పడ్డాయి. నిరవసిత లో చండాలురు, మృతపాలు

చెప్పబడ్డారు. (15) [క్రీ.పూ. 2 వ శతాబ్దానికల్లా 'వృత్తి,'

'వర్ణసంకర' భావాలు ఏర్పడ్డాయి, విస్తృత వైవిధ్యం

గల సాంఘిక, ఆర్థిక, సాంస్కృతిక సమూహాల్ని చేర్చుకోవటం

వల్లన ఇవి ఏర్పడ్డాయి. ఈ రెండు భావాలూ —

పవిత్ర విధుల్ని నిర్వర్తించలేకపోవడం - వృత్తి ;

వర్ణాంతర వివాహాలు జరగడం వలన - వర్ణసంకరం

ప్రత్యేక 'జాతులు' ఆవిర్భవించటానికి చాలా వరకూ

దోహదం చేశాయి. 'వర్ణ' వ్యవస్థని 'జాతి' వ్యవస్థగా

విస్తృత పరచటంలో ఈ సిద్ధాంత సాధనాలు చాలా

విజయవంతమయ్యాయని నమ్మొచ్చు.]

(16) [వైదిక కాలంలో 'వర్ణ' కి 'జాతి' కి

మధ్య భేదం స్పష్టంగా చూడబడింది.

1) జాతి సాధారణంగా స్థానిక స్థాయిలో పనిచేస్తుంది, కాని
వర్ణ వ్యవస్థ దేశమంతటా ఒకే విధంగా ఉంటుంది.

2) సిద్ధాంత రీత్యా వర్ణాలు వాటి విధుల (functions)
ఆధారంగా విభజింపబడ్డాయి, కాని జాతి

క్రమానుగత శ్రేణి బ్రాహ్మణులం సంపూర్ణ శుద్ధత, (99)
మలినాత్మకంగా ఇతర కులాల మాలిన్యం (impurity)
లపై ఆధారపడింది.

3) వర్ణాలు విస్తృత విభజనలు - వాటిలో అనేక జాతులు
ఇముడ్చబడి ఉంటాయి.

ఈ భేదాల సృష్టికి ఈ రెండు
రకాల గుర్తింపులని (identities) తరచుగా పరస్పరం
వాడడం ఇవన్నీ ప్రాచీన కాలం నుంచి కనబడుతుంది.

ఈ కాలంలో 'వైశ్య', 'శూద్ర' వర్ణాలు కొత్త
అర్థాలు పొందాయి, మలినాత్మక విధులలో శుద్ధత నుంచి మలినాత్మక
జన్మ శుద్ధత కి మార్పు కన్పిస్తుంది. ఇది నిజంగా 'వర్ణ'
నుంచి 'జాతి' కి గల పరిణామం లో దాగున్నది.

'వైశ్య' 'బ్రాహ్మణ' వర్ణాలలో ప్రాంతీయ
మరియు వృత్తిపరమైన భేదాలు అంతర్గత విభజనలకి దారి
తీసాయి. ఈ వైశ్య వర్ణం లో నిర్దిష్ట వృత్తి (craft), ప్రాంతం
కులాలకి దారి తీస్తే బ్రాహ్మణుల్లో నిర్దిష్ట సంప్రదాయ విద్య
లో ప్రత్యేకీకరణ, ప్రాంతం కులాలకి దారి తీసాయి.

క్షత్రియ వర్ణం లో కొత్త పాలక వర్గాలు రావడం,
(విదేశీయులూ అలాగే స్థానికులూ) నిరంతర సర్దుబాట్లకి
కారణమయ్యింది.

వర్ణాల విస్తృత పరిధిలో జాతులు

పరిణామం మౌర్యానంతర యుగం లో నూతన ప్రాధాన్యత పొందింది. (17) [జాతి వ్యవస్థ లో ప్రధాన లక్షణం పాత క్రమంలో సంక్షోభం రావడం మరియు శిల్పకారుల్ని బ్రాహ్మణ సమాజాన్ని కాపాడడానికి గాను శూద్రులకు ప్రత్యేకంగా కఠిన చర్యలు చేపట్టడమే గాక విదేశీయుల్ని ఇముడ్చుకోవడానికి నూతన genealogies ని వంశానుక్రమాన్ని చేపట్టడం గా చెప్పవచ్చు.]

యుగపురాణం అపద్ధర్మం గా స్త్రీలు కూడా పొలం దున్నవచ్చని చెప్పింది. విపత్ సమయంలో వైశ్యుడు తన వృత్తుల ద్వారా మనలేకపోతే శూద్రుల వృత్తులు చేపట్ట వచ్చని మనువు చెప్పాడు. (18) [వైశ్యులకు, శూద్రులకు వృత్తుల్లో భేదం క్రమంగా అంతరిస్తున్నట్లు కన్పిస్తుంది. కాని వైశ్యుల్లా గాక శూద్రులు సాధారణం గా వ్యవసాయ కూలీలు గానే నియమింపబడేవారు. ప్రభుత్వానికి శిస్తు కట్టే కర్షకులు వైశ్యులుగానే వారు ఉండేవారు].

జాతుల సంఖ్యలో పెరుగుదల Majumdar

మౌర్యానంతర యుగం లో వర్ణసంకరం వలన జాతుల సంఖ్య బాగా పెరిగింది. ఈ జాతుల సాంఘిక హోదా విషయంలో మనువు ప్రకారం అనులోమ వివాహాల సంతానం తండ్రి కన్నా కొంచెం తక్కువ కాని తల్లి కంటే అధిక హోదాలు

కలిగి ఉంటారు. ప్రతిలోమ వివాహాల సంతానం కి (101)
మాత్రం శూద్రుల హోదా ఇవ్వబడుతుంది.

ఈ కాలం లోని బ్రాహ్మణ సాహిత్యం లో ఆసక్తికరం గా అనేక ఆదిమ తెగల కి సనాతన సాంఘిక వ్యవస్థ లో గుర్తింపు నిచ్చేందుకు ప్రయత్నించడం కన్పిస్తుంది.

(19) బానిసలు :

మనువు 7 రకాల బానిసల్ని — యుద్ధ బందీలు, ఆహారం కోసం బానిసల్గా ఉండిపోయినవాడు, యజమాని ఇంట్లో పుట్టినవాడు, కొనడం ద్వారా పొందిన బానిస, కానుకగా పొందిన బానిస, వారసత్వంగా పొందిన బానిసలు, శిక్ష కింద బానిసగా మారినవాడు గుర్తించాడు. ఇతర గ్రంథాల్లో వీటిని దయతో చూడాలని చెప్పబడింది. యజమాని కి బానిస పై భార్య, కొడుకుల పై ఉండే పరిమిత సరిదిద్దే అధికారం మాత్రమే ఉండేది — మనువు.

యజమాని బానిసల్ని కొడితే; అప్పు తీరిపోయినా బానిసత్వం పోతుందని తెలుస్తుంది. తన పోషణార్థం బానిసగా చేరినవాడు కొంత మొత్తం చెల్లించి విముక్తి పొందవచ్చు. 'దివ్యావదన' ద్వారా యజమాని తో బిడ్డని ప్రసవించిన మరుక్షణం ఆ స్త్రీ, ఆమె బిడ్డ విముక్తి పొందారని తెలుస్తుంది.

ప్రధానంగా శూద్రుల్ని బానిసలు గా ఉపయోగించేవారు. అయితే శూద్రులు కాని బానిసల్ని

వెలి ఉండటం చెప్పుతుంది.] మను ధర్మశాస్త్రం పై
కుల్లూకుని వ్యాఖ్యానం లో యజమాని ద్వారా
ఉత్పన్నమైన లేదా కుటుంబం కోసం వ్యాపార లావాదేవీల్లో
లేదా బానిస లేదా ప్రతినిధిగా వ్యవహరించవచ్చునని
వీటిని యజమాని కాదనలేదని తెలుస్తుంది. అలాగే
న్యాయ విచారణల్లో సరైన సాక్షి లేనప్పుడు బానిసలు
కూడా సాక్ష్యం ఇవ్వవచ్చని చెప్పబడింది.

## స్త్రీల పాత్ర :

[ఈ కాలంలో వారసత్వ నియమాలు స్త్రీలకి
ఆస్తి హక్కు లేకపోయేలా చేశాయి. వివాహ వయస్సు
తగ్గించివేయటం వలన భర్తల నెమ్మదివటంలో వారి స్వేచ్ఛ
నశించింది. మనువు స్త్రీ వివాహం ముందు తండ్రి పై,
భార్యగా భర్త పై, విధవ అయ్యాక కొడుకు పై ఆధారపడాలని
చెప్పాడు.

జైన, బౌద్ధ కేంద్రాల్లో ఉన్న సన్యాసినుల సంఖ్య,
దానాలు చేయగలిగేంతగా వారికున్న సంపద రెండూ ఆసక్తి
కలిగించేవే. ప్రత్యామ్నాయ జీవిత విధానంగా సంఘాలు
సన్యాసినులకు అందించాయి, సంఘాలు స్వాభావికంగా కావడం
వల్ల ఇవి ఇతర సంస్థల కార్యకలాపాల్లోని ద్వారంగా లేవు.
సంఘాలలో సన్యాసినులను సన్యాసుల కంటే తక్కువగా
పరిగణించేవారు, అయినా ఇది స్త్రీలను ఈ సంఘాల్లో

ఈ స్త్రీధనం అడ్డదేది. అయితే స్త్రీ సాధారణ వారసత్వ ఇది ఏమంత మార్పు కలిగించేది కాదు. ఎందుకంటే స్త్రీధనం గా సాధారణంగా పెళ్ళిళ్ళలోని బహుమతులే ఉండేవి.

ఈ బౌద్ధ స్తూపాలకి చేయబడిన దానాలు ధర్మశాస్త్రాల్లో స్త్రీల గురించి వారికి గల ఆస్తిహక్కు గురించి చెప్పబడిన దానికి విరుద్ధంగా ఉన్నాయి. అయినప్పటికీ ధర్మశాస్త్రాల్ని సమకాలీన సమాజంలో సాధారణ ఆచారాలుగా, సాంఘిక నియమావళిగా తీసుకోవడం తప్పవుతుంది. శాసనాల్లో ఇటువంటి వాటిల్లో స్త్రీలని స్వతంత్రులుగా చిత్రించారని కాదు, కాని స్త్రీలకి కేటాయించబడిన కార్యాల్లో, కుటుంబంలో వారి పాత్రలో ధర్మశాస్త్రాల్లోని అధికారికత్వంలో వాటిల్లో ఇటువంటి భేదం ఉన్నట్లుందని చెప్పవచ్చు.

మనుస్మృతిలో 24 ఏళ్ల అబ్బాయి 8 ఏళ్ల అమ్మాయిని వివాహం చేసుకోవచ్చని చెప్పింది. ఈ బాల్య వివాహాలు బాలికల విద్యకి పెద్ద అవరోధాలయ్యాయి. విధవా వివాహాలు సామాన్యంగా ఆమోదించబడేవి కావు. మనువు స్త్రీని ఇంటికి అలంకారంగా పరిగణించినా సదా ఆధారిత స్థితిలో ఉంచాడు. ఈ కాలంలో సతి కూడా కనిపిస్తుంది. శకుల (Scythians) వంటి విదేశీయులు సతి ఆచారాన్ని

ప్రోత్సహించారు .



## Crux

1. కొత్త ప్రజలు – ఉప స్థాయి కేటాయింపు బ్రాహ్మణుల కి సమస్యగా
2. సిద్ధాంతస్థాయిలో విభజనల కి పదును ( అభద్రతా భావం చేత )
3. వర్ణ గుర్తింపు a) పుట్టుక b) వృత్తి c) ఒక ప్రాంతం లో కొనసాగడం
4. సమూహం మార్పిడి & వ్యక్తి మార్పిడి
5. విగ్రహారాధన వ్యతిరేకులు
6. కింది కులాల వారు విదేశీ లో చేరి + వృత్తి,ప్రాంతం మారడం ద్వారా కుల హోదా పెంచుకోవాలని కృషి
7. ప్రామాణిక గ్రంథాల్లో సాంఘిక స్థాయి కాఠిన్యం కాని సమాజ జీవనం లో సరళత్వం
8. సాంచి, బార్హుత్ లలో నివాస స్థలం, వృత్తుల ఆధారంగానే గుర్తింపు
9. ముజుందారు
   - విదేశీ పాలక వర్గాల హోదా ని కులం ప్రభావితం చేయడం
   - కొత్త కులాలు – ఉపకులాలు తలెత్తడం.
10. వైశ్యులకి - శూద్రులైన వా.క.కా. కి ఆర్థిక విషయాలు దాదాపుగా అస్పష్టమయ్యాయి. కాని ఒక వర్గం గా శూద్రుల పరిస్థితి లో గొప్ప మార్పు కలిగిందని చెప్పడం కష్టం.
11. శూద్రుల అసంతృప్తి – తిరుగుబాట్లు
12. వర్తక లాభాలు సమాజం లో కింది తరగతులకి చేరాయి
13. బౌద్ధ గ్రంథాల్లో వివక్షతల కి ఆధారాలు గా పనికి వృత్తి. Work and Craft
14. వర్ణ – జాతి భేదాలు
    జాతుల పరిణామం
    తర్వాత – వర్ణసంకర భావాలు
    జాతి వ్యవస్థ ప్రధాన లక్షణం
15. వృత్తుల్లో వైశ్య - శూద్ర క్షీణతలు
16. తొలిసారి గా ఆదిమ తెగల కి సనాతన సాంఘిక వ్యవస్థ లో గుర్తింపునిచ్చే యత్నం
17. బానిసలు
18. స్త్రీల పాత్ర
19. వైశ్య, బ్రాహ్మణుల అంతర్గత విధానం
20. వైశ్య, శూద్ర అర్థం లో మార్పు

నీటిపారుదలా సదుపాయాలు స్థానిక సంఘదార్ల చేత, రాజుల చేతా దొరల చేతా కల్పించబడేవి. నదుల నీళ్లని పొలాలకి మళ్లించేవారు. తమిళకం లో కావేరిపట్నం సమీపం లో ప్రాచీన ఆనకట్టల అవశేషాలు బయట పడింది. వర్షం ఎక్కువగా ఉండేది కాదు కాబట్టి నీటిపారుదలా వసతులు ప్రాధాన్యాలు వహించేవి. వరి, చెరుకు సారవంత మరుతం పొలాల్లో ముఖ్య పంటలు. చిరు ధాన్యాలు కూడా పండించేవారు. నాటి సాహిత్యం ద్వారా వారికి ఋతువుల గురించి కూడా కొంత సమాచారం ఉన్నట్లు తెలుస్తుంది.

'వెల్లలర' భూయజమానులు కాగా 'ఉఝువర' సాగుదార్లుగా ఉండేవారు. అడియార్, వినైవలర లు కూడా పొలంలో పనిచేస్తున్నట్లు చెప్పబడింది. అడియార్ అంటే బహుశా బానిసలు కావచ్చు. వినైవలర లు కూలీకి పనిచేసేవాళ్లు. (wages) అనేక సందర్భాల్లో పెద్ద కుటుంబాల సభ్యులు వ్యవసాయ ఉత్పత్తి లో శ్రమని కల్పిస్తారు. కుటుంబం పూర్తి అధిక మిగులు ఉత్పత్తి కాదు. అయినా, ఈ లోపం ఉన్నా, వ్యవసాయ క్షేత్రాలు లోహకారులు, వడ్రంగులు, కవులు, కళాకారుల్లు మొ॥ అనేక వర్గాల వారిని పోషించగలిగేవి.

తమిళకం లో అందరు వెల్లల వర్గాలు భూయజమానులు గా ఉండేవారు. అప్పుడప్పుడు దొరలు (chieftains) వారి యోధులకి, కవులకి 'ఊర్' గ్రామాన్ని దానంగా ఇచ్చేవారు. అప్పుడు దానగ్రహీతలకి ఊర ప్రాంతాల నుంచి ఆదాయం వసూలు చేసుకునే హక్కు లభించేది.

## భూమిశిస్తు మరియు మిగిలు వసూళ్లు :

తమిళ సాహిత్యంలో రాజుల ఆదాయాలు గా 'ఇరై' 'తిరై' లు చెప్పబడ్డాయి. 'ఇరై' ప్రధాన ఆదాయం గా కన్పిస్తుంది. 'తిరై' కానుక (tribute) లా చెప్పవచ్చు. కాని ఆదాయం ఎంత శాతం, ఎలా వసూలు చేసేవారో తెలియటం లేదు. సాహిత్యంలో తరచూ వినిపించే ఆదాయ వసూళ్లలో ముఖ్యంగా పంటలో వంతు చెప్పటం కన్పిస్తుంది. అంటే సాగుదార్ల నుండి పంట వసూళ్లలో ఆరింటా ఒకటి తీసే వ్యవహారం ఉండనిపిస్తుంది.

తమిళకం వ్యవసాయ గ్రామాల్లో [illegible] రకాల వనరుల సంపద కన్పిస్తుంది. అందులో కానుకలు ముఖ్యమైనవి. బహుశా వనరుల సముపార్జనలో కానుకలు సర్వసాధారణ రూపాలు. ప్రతి ఉత్పత్తిదారుడూ తన ఉత్పత్తిలో కొంత ఇతరులకు సేవలందించినందుకు గాను ఇచ్చేవాడు. మంచి భోజనం, వస్త్రాలు సామాన్యంగా పంపకాలు. పాలకులు యోధులకు దాడికి ముందూ, తర్వాతా విందులేర్పరిచేవాళ్లు. పేద కళాకారులు దాతల్ని కీర్తించి పాడుతూ, నాట్యం చేస్తూ ఆస్థానం నుంచి ఆస్థానానికి తిండి, గుడ్డ కోసం తిరిగేవారు. ఒక్కసారి విందులో పాటు విలువైన సిల్కు వస్త్రాలు, మద్యం, బంగారు ఆభరణాలు కూడా ఉండేవి. బ్రాహ్మణులు, యోధులు తరచుగా గ్రామాల్ని బహుమతిగా వారి సేవలకు బదులుగా పొందేవారు.

బ్రాహ్మణులకు భూదానం తమిళకం లో బ్రాహ్మణుల

జనావాసాలలో స్వామ్యం. సంపద, శక్తి గల మూడు వర్గాల ప్రజలు — రాజులు (వేందార్), చిన్న దొరలు (వేలిర్) మంచి వ్యవసాయ గృహస్థులు (వెల్లాలర్) ల కానుకల ద్వారా వనరుల పంపకం చేసేవారు.

## కానుకల పంపకం విలువేందుకు

వనరుల్ని ఒక కేంద్రస్థానంలో సమీకరించడం (దొరల ఇళ్లల్లోకి) అవసరం. పునః పంపకంలో ఒక కేంద్రం నుంచి పంపకం జరగడం ముఖ్య లక్షణంగా కన్పిస్తుంది. వనరుల సమీకరణ తరచూ వ్యవసాయ ప్రాంతాల దోపిడీకి దారితీసేది. ధాన్యం, పశువుల్ని దోచుకునేవారు. వారు తీసుకెళ్లేవారు. రైతుల నివాసాలకి నిప్పు పెట్టడం, నాశనం చేసేవారు. సౌభాగ్య క్షేత్రాల్ల కోతకొచ్చిన పంటల్ని నాశనం చేయడం, సౌభాగ్య తోటల్ని పనికిరాని భూములుగా మార్చడం దోపిడీదారుల చర్యలుగా ఉండేవి. కొండ ప్రాంతాల, పచ్చిక బయళ్ల 'మరవ' యోధుల్ని దొరలు జనావాసాల దోపిడీకి వాడేవారు. ఆ దోపిడీల ఆదాయాల్ని యోధులకి బ్రాహ్మణులకి పంచేవారు. బ్రాహ్మణులకి ప్రాయశ్చిత్త ఆచారాలు నిర్వహించినందుకు బహుమానంగా కానుకగా ఇచ్చేవారు. రక్షణలేని రైతుల కష్టాలు, వారు భయభ్రాంతులైన తీరు, దోచబడిన తీరు సంగం సాహిత్యంలో ఎన్నో పద్యాల్లో నిరూపించబడుతుంది.

పేద రైతులపై అంత అణచివేత చూపుతున్నా, యుద్ధాన్ని ఉత్తమ నాయక చర్యగా ఉత్సవంగా జరుపుకునేవారు. మరో విడ్డూరంగా

ఉప్పొంచేది యుద్ధాన్ని వ్యవస్థీకరించడం. యోధుల
వీరత్వాన్ని వారి స్మరణ రాళ్లు – వీరగల్లు "వీరకల్"
లను పూజించడం ద్వారా ప్రస్తుతించేవారు. ఈ ఆరాధన
యుద్ధ మోహాన్ని (cult of war) ప్రోత్సహించేది. దొరల
వారి యోధుల వీరత్వాన్ని 'పన' గాయకులు కీర్తించేవారు.
పశువుల కొరత వల్ల దోపిడీ అవసరంగా మారింది.
అదే సమయంలో అటువంటి విపరీత చర్యలు పశుల
వినాశనానికి కారణం అయ్యేవి. దొరల స్థాయిలో
పర: పంపకం అనే యుద్ధాంగం లోనే ఈ వైరుధ్యం
అంతర్గతం గా ఉంది.

## స్థానిక వర్తకం :

ఇందులో 'వస్తుమార్పిడి' అతిప్రధానమైంది. తమిళకం
లో వస్తుమార్పిడి లో ప్రధానంగా ఉప్పు, చేపలు, వరి, పాల
ఉత్పత్తులు, వెన్న, తేనె, కల్లు మొదలైన జరుగుతూ ఉండేవి. చాలా
అరుదుగా విలువ వస్తువులు ముత్యాలు, ఏనుగు దంతాలు
కూడా వస్తు మార్పిడి అయ్యేవి. తమిళకం వస్తుమార్పిడిలో
అప్పు విధానం ఉండేది. నిర్దిష్ట పరిమాణం లో ఒక
వస్తువును కొంత కాలం తర్వాత అదే పరిమాణం లో అదే
వస్తువును తిరిగిచ్చేలా అప్పు తీసుకోవచ్చు, దీన్ని
"పరియలిరప్పై" అనేవారు.

తమిళకం లో 'వరి' మరియు 'ఉప్పు'
ఈ రెండూ మాత్రమే నిర్ణీత మార్పిడి రేటు కలిగి ఉన్నాయి.

ఉప్పును సమాన కొలత గల వరి తో మార్పిడి
చేసుకునే వారు.

వాణిజ్య వ్యవస్థీకరణ :

చిన్న స్థాయి లావాదేవీల్లో ఉత్పత్తిదారులే
డీలర్లుగా కూడా ఉండేవారు. చేపల అమ్మకం కుటుంబాలే
చేసేవి. (womenfolk of fisherman's family)
'ఉమనబాధ' అనే ఉప్పు బదారులు వివిధ ప్రాంతాల
నుంచి వర్తక సరుకు సేకరించేవారిగా కన్పిస్తారు. వారు
ఉప్పును స్థానిక ఉత్పత్తులతో వస్తు మార్పిడి చేస్తారు.
ఉమనాలు తమ కుటుంబాలతో బదారులుగా కదిలేవారు.
ఉప్పు వర్తకుల్లో కుటుంబం తప్ప వేరే సంస్థ ఏదీ ఉన్నట్లు
కన్పించదు.

ఉప్పువర్తకులే గాక వాణిజ్యంలో ధాన్య వర్తకులు
(కూలవణికన్) వస్త్ర (అరువై వణికన్) బంగారం (పొన్
వణికన్) పంచదార (పనిత వణికన్) మొ॥ వారుండేవారు.
సన్యాసులకు గుహాలు దానం చేస్తున్నట్లుగా ఈ వర్తకులు ప్రాచీన
తమిళ శాసనాల్లో కన్పిస్తున్నారు. అంటే వారు సాంఘికంగా
ఉన్నతంగా ఉండేవారని తెలుస్తుంది. అయితే వారి వర్తకం, వ్యవస్థీకరణ
వివరాలు తెలియట్లేదు. దక్షిణాగ్ర భాగంలో 'తిరువెల్లరై' లోని
ఒక శాసనంలో 'నిగమత్తార్' ల గురించి ఉంది, వీరు
నిగమ (a guild) సభ్యులని అర్థం.

ఏదిఏమైనా తమిళకంలో వర్తకులు

వ్యవస్థీకృతం కావడం లేదు.

<u>పట్టణ ప్రాంతాలు :</u>

తమిళకం లో 3 భిన్న పట్టణ కేంద్రాలు కన్పిస్తాయి. ఇవి సంగం సాహిత్యం, పురావస్తు ఆధారాల పై వివరించబడ్డాయి.

- గ్రామీణ వర్తక మార్పిడి కేంద్రాలు
- అంతర్గత విపణి పట్టణాలు
- రేవు పట్టణాలు.

జీవిత మనుగడ కై వస్తుమార్పిడి వివిధ తెగల మధ్య జరిగేది. ఇలాంటి కేంద్రాలు సాధారణంగా సంప్రదాయ బాటల వెంబడి ఉండేవి.

ఇలాంటి కేంద్రాల్లో కొన్ని నిత్య/తరచూ వర్తక మార్పిడి జరగడం చేత ఎక్కువ ప్రయోజనం పొందాయి. వీటిని ఆధునిక కోణంలో 'నగర' ప్రాంతాలు అనవచ్చు. ఏదైనా, సమకాలీనులు వీటిని సాధారణ రైతు జనావాసాల నుంచి భిన్నంగా చూశారు. భూభాగం (Inland) పట్టణాలైన ఉరైయూర్, వంజి, మదురై లాంటి వాటిల్లో కూడా ఇవి గొప్ప ప్రాంతీయ నగరాలు గా వృద్ధి చెందలేదు.

'పట్టణం' లు రేవుపట్టణాలు. ఇవి రాజుల
ఆదరణలు మరింత ప్రయోజనాలుగా ఉండేవి. తూర్పు
తీరంలో ఉత్తూర, అరికమేడు, కావేరిపట్నం ; పశ్చిమతీరం
లో ముజిరిస్, తొండిస, బకరె, నెల్కిండ మొదలైనవి,
ఉన్నాయి. ఇవి సముద్ర వాణిజ్యానికి కేంద్రాలు. వీటిలో
కొన్ని అరికమేడు వంటివి యవనుల కాలనీలు కూడా ఉన్నాయి.
బంగారాల కడలతో, లడ్డీ మిరియాల్లు, గిడ్డంగులతో ముజిరిస్
కళకళ లాడేది.

రేవుపట్టణాల్లో వర్తకం ఎలాంటిదన్న ప్రశ్న ప్రధానమైనది
కావటాన పట్టణాలు సాధారణంగా స్థానిక మార్కెట్ నెట్వర్క్ తో
దగ్గర సంబంధాలు కలిగి ఉండేవి కావు. అవి 'విదేశీ వర్తక
స్థానాలు' గానే పాలకులు, ధనికులు మాత్రమే ఉపయోగ
దారులుగా కలిగి ఉండేవి. అందువల్ల వీటి వృద్ధి విదేశీ
వాణిజ్య శీలతం, విదేశీ వాణిజ్యం పతనమవడంతో క్రమంగా
ఇవి కూడా క్షీణించాయి. అందువల్ల నగరాల స్వభావంలో

- స్థానిక మార్కెట్ నెట్వర్క్ తో సంబంధాలు లేకపోవడం
- చేతివృత్తుల్లో ప్రత్యేకీకరణ లేకపోవడం
- విహారాలు, శ్రేణుల వంటి సంస్థల మద్దతు లేకపోవడం

గమనిస్తాము.

## వర్తకం, పట్టణాలు సమాజం పై చూపిన ప్రభావం :

ఆమిశతం సాంఘిక జీవితంలో అతి వర్తకం, నగర అభివృద్ధులు గొప్ప ప్రాధమిక మౌలిక మార్పులు తెచ్చినట్లు కన్పించదు. స్థానిక మార్పిడి / వర్తక మార్పిడి మనుగడ కోసం గానే ఉండేది. నిత్యావసర వస్తువులే మార్పిడి చెందేవి. సుదూర వర్తకాలు విలాస వస్తువుల్లో ప్రధానంగా సాగేవి. ఇది పాలకులు వారి బంధువులకే పరిమితమయ్యేది. వ్యక్తిగత వర్తకులు ఇచ్చిన దానాల ఆధారంగా వారు అంత సంపన్నులుగా ఉన్నట్లు కన్పించదు.

చేతివృత్తిదారులు, వర్తకులు శ్రేణులుగా వ్యవస్థీకరించబడలేదు. వారు కుటుంబ సభ్యులుగా లేదా దగ్గర బంధువులుగా కలిసి పనిచేసే వారు. అందువల్ల వారు తెగల స్వభావం తో కూడిన నియమాలతోనే పనిచేసే వారు.

— o —

స్థానిక మరియు దూర వర్తకాలు రాజ్య ఆదాయాలకు ముఖ్య ఆధారాలుగా ఉండేవి. ఈ వాక్యాల కస్టమ్సు అధికారులు ఎలా పనిచేసేవారో తెలుస్తుంది. సరుకులు ప్రయాణం చేసే వర్తకులపై 'రవాణా సుంకాలు' విధించేవారు. వర్తకుల రక్షణ కోసం, సక్రమంగా నియంత్రించడం కోసం సైనికులు రహదారుల పై సదా

నిఘా ఉంచేవారు.

యుద్ధ దోపిడీ ధనం రాజ ఆదాయాల్ని మరింత పెంచేది. కాని యుద్ధాలకి, రాజకీయాలకి నికరమైన ఆధారం వ్యవసాయ ఆదాయమే. వ్యవసాయ ఉత్పత్తుల్లో రాజు భాగం తెలియటం లేదు. దక్షిణాగ్రం చాలా సారవంతంగా ఉండేది. వరి, రాగి, చెరుకు ప్రధాన పంటలు. ఇవే కాక తమిళ ప్రాంతం ధాన్యాలు, పళ్లు, మిరియాలు, చింతపండు పండించేది. వీటన్నిటిలో రాజుకు భాగం ఉండేదని తెలుస్తుంది. పాండ్యరాజ్యం లోని ముత్యాలని దిగుమతి చేసుకునేవారు.

— o —

పరిశ్రమలు:

నేత నేయటం, దారం తీయటం, పత్తి & సిల్కు నేత నేయటం లలా ఉత్తమ పరిపక్వత సాధించబడింది. స్త్రీలకి దారం తీయటం ప్రవృత్తిగా ఉండేది. సంగం సాహిత్యం లో నూలు వస్త్రాన్ని పాము కుబుసం లా మేఘం లా లేత సన్నగా నేస్తూంటారని ఉంది. ఉరైయూర గొప్ప నూలు, పత్తి వర్తక కేంద్రం. ముస్తులు తయారు చేయటం గొప్ప పరిశ్రమ. ఉప్పు తయారీ మరో ముఖ్య పరిశ్రమ.

వర్తకం:

సంగం యుగంలో దేశీయ, విదేశీయ వాణిజ్యాలు రెండూ విరివిగా సాగేవి. బండ్ల లో, మోతడు జంతువులలో వర్తకుల బిడారులు ప్రాంతం నుంచి ప్రాంతానికి సంత నుంచి సంతకి తిరిగేవి.

దేశీయ వర్తకంలో 'ఉప్పు' అతిముఖ్య వస్తువు. ఈ వర్తక లావాదేవీల్లో వస్తుమార్పిడి పెద్దపాత్ర పోషించేది. ముఖ్య నగరాల్లో 'నలంగడి' (పగటిపూట బజారు) 'అల్లాంగడి' (సాయంత్రం బజారు) ఉండేవి.

పెరిప్లస్ (క్రీ.శ. 75) రచయిత భారత్‌లో రోమను సామ్రాజ్యానికి వర్తక వివరాలు అందించాడు. చేర దేశంలో తొండి, ముజిరిస్; పాండ్య దేశంలో కొర్కై, చోళ దేశంలో పుహార్ ముఖ్యరేవుపట్టణాలుగా ఉండేవి. పొడుకే (పాండిచ్చేరి) మరో ముఖ్యరేవు. వర్తకుల నౌకల మరమ్మత్తు చేయడం చెప్పబడింది. లైటవాసుల ప్రస్తావన ఉంది. మిరియాలు, ముత్యాలు, దంతం, సిల్కు వస్త్రాలు, వజ్రాలు మొదలైనవి ఎగుమతి చేసేవారు. బంగారునాణాలు, టోపజ్, తగరం, గాజు, రాగి, పగడం, లెడ్, మద్యం మొదలైనవి దిగుమతి అయ్యేవి. అగస్టస్ నుండి నీరో వరకు రోమను చక్రవర్తుల బంగారు నాణాలు తమిళదేశంలో దొరికాయి. అరికమేడులో రోమను వర్తక స్థావరం బయల్పడింది. 'త్రాంగనూర' లో అగస్టస్ దేవాలయం బయల్పడింది. ఇవన్నీ రోమను వర్తక విస్తృతిని సూచిస్తున్నాయి.

Romila Thapar

Romila Thapar

పరిణామం సింధు తర్వాత తమిళకం రాజ్యాల్లో

పరిణామం నెమ్మదిగా ఉండడానికి ఆర్థిక కారణాలూ ఉన్నాయి. చేతివృత్తి వైవిధ్యం తక్కువ స్థాయిలో ఉండడం చేత పట్టణాల్లో చేతివృత్తికారుల సాంద్రత అవసరమై ఉండదు. అందువల్ల అలాంటి వర్గాల్ని పోషించడానికి గానూ వ్యవసాయోత్పత్తులకి కూడా గిరాకీ పరిమితం గానే ఉండేది. ఇది మరలా వస్తు మార్పిడితో సంబంధం కలిగి ఉండొచ్చు. సంబార వర్తకులు చేసే ముడి సరుకులు, పారిశ్రామిక ఉత్పత్తుల మార్పిడికి ఇది వర్తిస్తుంది. ప్రారంభంలో సంపద తెచ్చే పెద్ద వస్తువు 'మిరియాలు' ఇది కూ పారిశ్రామిక ఉత్పత్తి, వస్తుమార్పిడికి నిర్దేశించబడింది. మిరియాలకి బదులుగా రోమన్లు బంగారు, వెండి నాణాలు; కోరల్, మద్యం మార్పిడి చేసిన తీరాలు క్రమంగా వర్తక పట్టణాలుగా ఎదిగాయి.

వరి సాగు దారుల సమాజానికి సంపదనంతగా ఉండేది, సాగును విస్తరించడానికి ప్రేరణ ఏదీ కల్పించదు. మెగాలిథిక్ కాలాల్లోని ఇనుము సాంకేతికత ఉత్తరభారతంలో లాగా స్థిరపడిన రైతుల సాగును ఉన్నతస్థాయి మార్పేమీ కలిగించలేదు. గంగా మైదానం నుంచి భిన్నంగా ఉండే దక్షిణ మైదానాల్లో ఇనుప నాగలితో దున్నడం అవసరంగా కూడా కల్పించదు. ఇలాంటి పరిస్థితుల్లో నగరీకరణాలు, రాజ్య ఆవిర్భావానికి ఆరంభంగా ప్రేరణ, ఒత్తిడి బహుశా పెరుగుతున్న వర్తక గిరాకీ నుంచి వచ్చి ఉంటుంది. రాజ్యాల ఆవిర్భావం క్రమంగా (gradual) జరిగిన పరిణామం.

సంపద పుర: పంపకానికి దారి నివాసం కేంద్రం కావడం క్రమంగా పాలనా కేంద్రం ఏర్పడటానికి దారి తీసి ఉంటుంది. వర్తకం రావడం లో ఈ మార్పు కలిసిరావడం క్రమంగా నగరీకరణ జరిగి ఉంటుంది; ఉరైయూర్, మదురై, కరూర్ లలో ఇదే జరిగింది. నిత్యావసరాలైన వరి, ఉప్పు, మొ॥ నవి ఎక్కువ స్థానికంగా వస్తుమార్పిడి అయ్యేవి. రోము వర్తకం లో విలాసాలకి వర్తకం పెరిగి మిరియాలు, విలువైన రాళ్లు, వస్త్రాల కి బదులు రోమ్ బంగారు-వెండి నాణాలు; మద్యం, దీపాలు పొందేవారు. ఈ రేవు లలో వర్తకులు చేరడానికి రావడం ముజిరిస్, అరికమేడు, పుహార్ వంటి రేవు పట్టణాల వృద్ధికి కారణమైంది.

క్రీ.శ. ఆరంభానికి యవన వర్తకులు దక్షిణ భారతం లో క్రియాశీలకం గా మారారు. ఈ కాలం లోని దాన శాసనాలు అనేక చేతివృత్తుల నిపుణుల్ని, వర్తకుల్ని బంగారం, విలువైన రాళ్లు, వస్త్రాలు, ఇనుము మొ॥ వాటితో వ్యవహరించే వారిని పేర్కొన్నాయి. ఇది chiefdoms లలో మార్పును తెలియజేసి ఉంటుంది.

— o —

*Agnihotri*

స్థూలంగా వ్యవసాయం 'మెనపులం' (మెట్ట వ్యవసాయ మరుతం ప్రాంతాలు) 'వనపులం' (మిగతా ప్రాంతాలు) రకాలు గా ఉండేది.

మెనపులం లో వృద్ధి చెందిన మెట్ట వ్యవసాయం ఉండేది. 'అయం' అనే సరస్సులు, చెరువులు; 'సిరయ్' అనే చిన్న డాములు ప్రస్తావించబడ్డాయి.
(minor Dam)

పనస్ఫలం లాటి భూమాధార తెగలు వారి సొంత ప్రాంత ఉత్పత్తుల్ని మెన్కలం వడ్లు వరి ధాన్యాలతో మార్పిడి చేసుకునేవారు. తీరప్రాంతాల వారు మెన్కలం వడ్లు చేపలు, ఉప్పు లను వరి తో మార్పిడి చేసుకునేవారు. గ్రామాలలో చూస్తే మెన్కలం సమకాలీన ఆర్థిక జీవనానికి కేంద్రంగా భాసించేది.

'కానుక ఇవ్వడం' ద్వారా వనరుల పునఃపంపకం జరిగేది. దాడులు చేయడం ద్వారా వనరుల్ని సమీకరించే వారు. ఇది సమకాలీన ఆర్థిక వ్యవస్థ ని నిర్వహించేందుకు ప్రాథమిక మైన అంశం. ఆర్థిక నమూనాలు, వ్యవస్థలు దోపిడీ ఆధారిత పునఃపంపకాల విధిని సమర్థంగా సహకరించేవి. వారి వైతికత (అరం) యుద్ధాల్ని, దోపిడీలను సమర్థించింది. ఈ దోపిడీ దాడుల్లో భాగంగా సాగు పొలాల్ని, గ్రామాల్ని ధ్వంసం చేస్తుండేవారు, అయితే ప్రగతి చెందిన వ్యవసాయమనేది కావేరి, వైగై, తామ్రపర్ణి, పెరియార్ నదీ లోయల్లో వరి ప్రాంతాలకే పరిమితమైంది.

సంగం పద్యాల్లో వరి, అడవి వరి, అల్లం, చింతపండు, మిరియాలు, చెరుకు, పత్తి, horse-gram వంటి అనేక పంటధాన్యాలు చెప్పబడ్డాయి. చోళ రాజధాని ఉరయూర్ పత్తి కి ప్రసిద్ధి.

పత్తి విరివిగా ఉండటం వల్ల దారం తీయడం, నేయడం విపరీతంగా వృద్ధి చెందింది. ఇతర వృత్తుల్లో

అచ్చులు పోయడం, లోహ ఆయుధ పనిముట్లు చేయడం, 'కంచు మరియు లోహం' కి సంబంధించిన కళలు ఇవేగాక లోహకారులూ ఉండేవారు. యుద్ధ సామగ్రి తయారీ ఈ ఆయుధాగారాన్ని 'పరిశ్రమలలో' చేసారు. మృదంగం సాధారణ పరిశ్రమ.

వర్తకం:

వర్తకం, ముఖ్యంగా సముద్ర వర్తకం అమితంగా సంపదకి ముఖ్యకారణమై చివరికి మూడు రాజ్యాలు కూలిపోవ డానికి కారణమైంది. నగర ద్వారాల ద్వారా నిరంతరం వర్తకపు సరుకు రాగా అమ్మేవారి, బజార్లలో కంచు గాజులు, బంగారం, ఉప్పు, వస్త్రాలు, రాగి వస్తువులు, సుగంధాలు, చందన వేదాల వ్యాపారులు ఉండేవారని మధురైకాంచి లో చదవచ్చు. ఎద్దు బళ్ళు వరుసల్లో వెళ్ళేవి, వర్తకుల బిడారులకి రక్షణ ఉండేది. 'పట్టినప్పాలై' లో చోళరేవుకి సరుకు ఎలా వచ్చేదో వాటినెలా పొగుపరిచి వస్తువుల్ని అధికారులు పులి బొమ్మల పై రాజు పులి ముద్ర ఏ విధంగా వేసేవారో ప్రస్తావించింది. తీర వ్యాపారులు ఉప్పు పరదేశాలు గుర్రాలు, తెల్లరాళ్ళు దిగుమతి చేసుకునే వారు. వారు ముత్యాలు, కంబళ్ళు, శంఖ గాజులు, పెమ్మె చింతపండు, ఉప్పు, చేపలు ఎగుమతి వర్తకం చేసేవారు. గుర్రాలు ఇతర విలువైన వస్తువులు ఉత్తరాది నుండి వచ్చేవి.

'పురనానూరు' ఏ విధంగా యవనులు (రోమన్లు) బట్టల బట్టల మిరియాలని బంగారం ఇచ్చి తీసుకెళ్లేవారో చెబుతుంది. 'పెరిప్లస్' ద్వారా చేర రేవు Musiri గంగా ప్రాంతం నుండి Spikenard; సిల్క్, తాబేలు డిప్పలు, తమలపాకులు ఆగ్నేయాసియా నుండి దిగుమతి చేసుకునేది వివరంగా తెలుసుకోవచ్చు. బంగారం, రాగి, తగరం, లెడ్, ఇత్తడి, కోరల్, గాజు, సుర్మగూడి కూడా దిగుమతి చేసుకునేవారు. పుహార్ లో విభిన్న భాషలు మాట్లాడే వర్తకుల కాలనీలు ఉండేవి. 'శిలప్పదికారం' ఆగ్నేయాసియా నుండి కొడలు ద్రవ్యాల కలప, సిల్క్, గంధం, కర్పూరం, సుగంధద్రవ్యాలలో చోళ తీరం చేరడం చెప్పబడింది. పురావస్తు తవ్వకాల్లో రోమను నాణాలు, మృణ్మయపాత్రలు మాత్రం ఆధారాలుగా లభిస్తున్నాయి.

ఈ విధంగా తమిళకం విస్తారంగా విదేశీ వర్తకం చేపట్టేది. మిరియాలు, బియ్యం, వరి, గంధంచెక్క, ఈబొనీ, almug, cardamom, cinnamon, చింతపండు, దంతం, ముత్యాలు, బెరిల్ వంటి రాళ్ళు, corundum, పత్తి, నూలువస్త్రాలు మంచి విదేశీ గిరాకీ గలవి. కోతులు, జింకలు, నెమళ్ళు, చిలుకలు, పులులు, ఏనుగులకు కూడా మంచి గిరాకీ ఉండేది.

అగస్టస్ కాలం నాటి రోమను నాణాలు దక్షిణ భారతంలో విరివిగా దొరికాయి, ఇవి తమిళకం తో రోముల విస్తృత వర్తకం జరిగేదని నిరూపిస్తాయి.

తమిళనాడుకి అరేబియా, ఈజిప్టు, రోములతో
ప్రత్యక్ష వర్తక మార్గం పెరిప్లస్ కాలంలో కల్లా బాగా
ఏర్పడి పోయింది. రోములతో వర్తకం క్రీ.శ. తొలి శతాబ్దం
లో ఎంత లాభదాయకంగా ఉండేదంటే పాండ్యరాజు
అగస్టస్ ను మెప్పించేందుకు రెండు రాయబారాలని
(20 BC) పంపించాడు.

అందరు చరిత్రకారులు ఈ విదేశీ
వర్తకం తమిళనాడ్ని అంతగా ప్రభావితం చేయలేదు అని
ఒప్పారు. భారతీయ వర్తకులు / తమిళదేశం వర్తకులు
ఉత్పత్తిదారులు తోటి సంబంధాల మధ్య, బంధుత్వాల తోటి
ఉండేవారు. వారు విదేశీ వర్తకులకి, రాజులకి నడుమ
మధ్యవర్తులుగా వ్యవహరించినట్లు కన్పించదు. విదేశీ
వర్తకులు అగ్రహారీకులు నుంచి వర్తకసరుకుని తమిళ
రేవుల్లో స్వేచ్ఛగా వర్తకం చేసుకునేవారు, స్థానిక వర్తకుల
మధ్యవర్తిత్వం లేకుండా. అలాంటి [illegible] [illegible]
విదేశీ వాణిజ్యం ఉత్పత్తిని ప్రోత్సహించడం మినహా, లోతుగా
మార్పు చూపి ఉండలేదు. కాని దీనికి వ్యతిరేకంగా
ఆధారాలు ఇటీవల చూపుతున్నారు.

పశ్చిమతీరం లో బంగారం వచ్చే ఓడల్ని
చేర చేపట్టేది, ఇతరులకి ప్రవేశం ఉండేది కాదని
తెలుస్తుంది. 2వ. గ్రంథం లో [illegible] వెలియన

ఓడలు బంగారం తేవడం చెప్పబడింది. ప్లినీ ఒక
భారతీయ ఓడ గాలిక్ జర్మనీ తీరం చేరిందని చెప్పాడు.
ఎర్ర సముద్రం తీరంలో ఇటీవలి తవ్వకాలు తమిళ బ్రాహ్మీ
లిపిగల ఆధారాల్ని అందించింది - చాతన్, కనన్ బనాన్
తమిళ వర్తకులై ఉంటారు. శ్రీలంకలో క్రీ.పూ. 1వ
శతాబ్దం శాసనం లోని 'దమిళ వైశ', 'దమిళ నావిక'
'దమిళ గహపతి' అను వర్తకుల వర్తకం లో సంబంధాన్ని
కలవారిగా తెల్పుతుంది.

# తమిళకం - మతం

సంగం యుగ మతం ఏకరూపంలో లేదు. అది ఒక "అదృశ్య పాక్షిక మత, ఆచార, పద్ధతుల అల్లిక". వారి ఆచారాలు animism కు, మానవాత్మలు గల దేవతల పూజకు సంబంధించినవి. అవతారాలు, వీర పూజ, పూర్వీకుల ఆరాధన, సతి ఆరాధన మొ॥ రకాలతో చెందిన ఆధ్యాత్మికత బావ్య సంబంధించింది గా కన్పిస్తుంది. తమిళ సంగం మతం లో animism కు మంచి పాత్ర ఉంది, రాళ్లని నీటిని, నక్షత్రాలు, గ్రహాలు ఆరాధించటం ఇందులో కన్పిస్తుంది.

సంగం యుగంలో 3 విభిన్న మత భావాలు కన్పిస్తాయి.

స్థానిక indigenous
- దేశీయ దేవుళ్లు, ఆరాధనా పద్ధతులు
- బయట నుండి దేవుళ్లు, ఆరాధనా పద్ధతులు
- బయట నుండి మతేతర విశ్వాసాలు

వైదిక మత ప్రభావం దక్షిణాదిలో బలం గా కన్పిస్తుంది. సంగం యుగ రాజులు వైదిక యాగాలు చేయడం ఇందుకు నిదర్శనం.

కొండ ప్రాంతాల వేటగాళ్లు "మురుగన్" ను కొండ దేవుని గా ఆరాధించేవారు. అతని

ఘనత తరచూ సంగం సాహిత్యం లో పొగడబడేది. ఇతన్ని బ్రాహ్మణ మత సుబ్రహ్మణ్యస్వామి తో సమంగా చేసారు.

మరుదం యొక్క దేవుడిగా ఇంద్రుని వ్యవసాయదారులు పూజించేవారు. ఇంద్ర గౌరవార్థం పూహార్ లో ప్రత్యేక పండుగ జరిగేది.

మత్స్యకారులు, తీరప్రాంతాల ప్రజలు సముద్ర దేవుడైన వరుణుడి ని పూజించేవారు.

కొర్రవై విజయదేవత గా ఆరాధింపబడేది.

తమిళుల 'మురుగన్' అతి ప్రధాన దైవం.

బ్రాహ్మణ 'వేళ్వి' (యజ్ఞం), 'శ్రద్ధ', 'పిండ' మొ॥ ఆచారాల కి ప్రాధాన్యత, ప్రాచుర్యం సంగం సాహిత్యం లో స్పష్టం గా కన్పిస్తుంది. సంగం యుగం లో బౌద్ధం, జైనం కూడా పరిఢవిల్లాయి కాని అవి బ్రాహ్మణ వైదిక మతాని కి లోబడే ఉండేవి. సంగం యుగ తమిళులు కొన్ని అధ్యాత్మిక తాత్విక అంశాల పై — శరీరం, ఆత్మ, విధి యొక్క అధికారత, ఉత్తమ జీవనం కోసం మార్గాంచడం మొ॥ న వాటి పై అవగాహన కలిగి ఉన్నట్లు గా కన్పిస్తుంది.

మతం విషయం లో తమిళులకంటే

(పద్ధతుల, నమ్మకాల విషయంలో విభిన్న పట్టులు గల
విభిన్న పట్టుకలు గల పద్ధతులు, నమ్మకాలను
వారివి) తరచూ ఉమ్మడిగా ఒకే వర్గం ప్రజలు
ఆచరించడం కన్పిస్తుంది.

వైదిక యాగాలను రాజులు, దొరలు బ్రాహ్మణుల
చేసేవారు / చే చేయించేవారు. వ్యక్తిగతంగా బ్రాహ్మణులు
మూడు పవిత్ర అగ్నులను వారి గృహాల్లో పూజించేవారు.
వారు దేవతలకి, అతిథులకి వరుసగా యాగాలు, విందులూ
చేసేవారు. రెండింటిలోనూ వరి, నెయ్యి, మాంసం
ప్రధానంగా ఉండేవి. బ్రాహ్మణులకి పట్టే దానాల్ని
సదా నేల్లాదిలి కట్టేవారు.

అనేక దేవతల ని దేవాలయాల్లో ఆరాధించడం
ప్రజల్లో ప్రబలంగా పెరిగింది. విష్ణుమూర్తి తులసి లా
ఆరాధించేవారు. ఆలయప్రాంగణాల్లో ఉపవాసం పవిత్రంగా
ఆలపించేవారు. శివ, నంది అతని పెద్ద గాథలు ప్రాచుర్యం
పొందాయి. కృష్ణుడు గోకుల ఆరాధ్యుడు. అడవి దేవత
'కదుర్కైకడవుళ్' తరువాత దుర్గాదేవి గా చెప్పబడుతుంది.

బౌద్ధం, జైనాలు తమిళకం లో అస్తిత్వం
పొందినా సంగం సాహిత్యం లో వాటి ప్రస్తావన
అంతగా ఉండదు. 'శ్రమణ' ల గురించి పేర్కొనబడడం,
మదురై లో కన్పించే జైన విహారాలు జైనమత
అస్తిత్వానికి సాక్ష్యాలు.

గ్రామ ఆచారాల గురించి అంతగా తెలియటం
లేదు. అయితే పుట్టుబడి బడ్డ దారిన రంగం లా
వృద్ధి పొందేందుకు విస్తృత ఆచారాలు చెప్పబడ్డాయి.
దహనం, ఖననం రెండు ఆచారాలూ [illegible]
కనిపిస్తాయి. భర్త చితికి నిప్పు పెట్టే ముందు
భార్య అతనికి పిండం (బియ్యం ముద్ద) పెట్టి దాన్ని
పుల్లైయన సమాజంలో ఆరగించే సంప్రదాయం ఉండేది.

తమిళం లో దేవుళ్ళ పేర్ల ని

విశ్లేషిస్తే తమిళం లోనూ సంస్కృతం లోనూ
సమాంతరం గా ఉన్న పేర్లు కన్పిస్తాయి — మురుగన్,
సుబ్రహ్మణ్య ; తిరుమల్, విష్ణు మొ॥నవి.
కనీసం మురుగన్ విషయంలో ఇలా చెప్పవచ్చు-
మొత్తం ఆరాధన అంతా తమిళులతోనే ఆరంభమై
మురుగన్ సుబ్రహ్మణ్య గా మార్పు పొందాడు. తనతో
పాటు తన పాత గాథల్ని తీసుకెళ్లాడు. తన
చుట్టూ కొత్త గాథల్ని కొత్త పురాణాల్ని చేర్చు
కున్నాడు. స్థానిక మత ఆచారాలకీ బయటి
ఆర్యుల నమ్మకాలకీ - ఆచారాలకీ మధ్య చాలా
సర్దుబాట్లు జరిగినట్లు గా కన్పిస్తుంది.

సంగం యుగం లోని సాహిత్యం లో దేవాలయాలు ప్రాముఖ్యం గా పేర్కొనబడ్డాయి. దేవాలయాన్ని 'నగర' 'కోయిల్' మొదలైన పేర్లతో పిలిచేవారు. విష్ణువు ఆరాధన కూడా కన్పిస్తుంది. 'శివ' అనుడు గానీ సంగం సాహిత్యంలో కన్పించినా అతని ఘనత మాత్రం అనేక చోట్ల చెప్పబడింది.

సంగం యుగ మతాల్ని పరిశీలిస్తే ఆర్యేతర తమిళ మరియు ఆర్య వైదిక దైవాల సమ్మేళనం ఈ కాలంలో ఆరంభమైందని తెలుస్తుంది. సంగం యుగ సంస్కృతి మొత్తంగా తమిళ మరియు ఆర్య సంస్కృతుల సమ్మేళనమని చెప్పవచ్చు.

# తమిళకం – ప్రభుత్వ పాలన

ఇటీవలి కాలం లో చరిత్రకారులు తమిళకంలో రాజ్య ఆవిర్భావం ను మునుపెన్నడూ లేనంత స్పష్టంగా ఆవిష్కరించగలిగారు. అందువలన మునుపున్న భూస్వామ్య రాజ్య వ్యవస్థ భావాలని ప్రస్తుతం అనేకమంది అంగీకరించటం లేదు. నాటి సాహిత్య గ్రంథాల ద్వారా ఒక chiefdom స్థాయి సమాజం మూడు కేటగిరీల రాజకీయ అధికారం గల వర్గాల్ని తెలుస్తోంది: కిలార (గ్రామ పెద్ద) వేలిర (కొండప్రాంత దొర) వెందర (lord and chiefs).

'ఊర్-కిలార' తన ప్రజలతో బంధుత్వ (kinship) సంబంధాలు గల ఒక స్థానిక నాయకుడు. 'వేలిర' లు కొండ దొరలు, వీరు చాలాసార్లు ఊర్-కిలార లను దోపిడీ కోసం లొంగదీసుకునే (subjugated) or ఓడించేవారు. కాని వేలిరలు తమ తమ కొండప్రాంతాలకే పరిమితమై ఉండేవారు. 'వెందర' అతిపెద్ద నాయకుడు. ఈ వెందర్లు పెద్ద భూభాగాల కు అధిపతులుగా ఉండేవారు. వీరు కిలార్లని ఓడించేవారు. ఈ కిలార్ లు వెందర కోసం పోరాడి దోపిడీ ధనాన్ని వారితో పాటే పంచుకునేవారు. వారినే మూడు వారసత్వ పరంపరలు గా చేర, చోళ, పాండ్యులు గా చెప్తారు. ఏదేమైనా, చాలా వరకు నిర్దిష్ట సరిహద్దులు గల ప్రాంతాలు ఉండేవి కావని చెప్పవచ్చు. క్రమంగా (periodic) పన్నులు వసూలు చేసే పద్ధతులు ఊహించవచ్చు. అలాగే పొలిమేర ప్రాంతాల్ని చిన్న దొరలు సొంతంగా ఒక వెందర కు

లాంగి ఉండేవారనడానికి ఆధారాలు కన్పించవు. ఇవన్నీ
లోని తమిళకం లో 'రాజ్యం' అస్తిత్వం పై సందేహాలు కలిగిస్తాయి.
తమిళ సంగం సాహిత్యంలో కూడా రాజకీయ అధికారం ప్రభావం
దార ని రాజు గా చక్రవర్తి గా చెలాయించినట్లు గానే కన్పిస్తుంది.

చేర, చోళ, పాండ్యులు 'మువేంతర' (కిరీటం
గల రాజులు) లుగా చెప్పే వరి పండించే మైదానాలపై
నియంత్రణ కలిగి, సముద్ర వాణిజ్యం ద్వారా చిన్న చిన్న
'వెల్' 'వెలిర' మొ॥ దొరల నుండి భిన్నమైన వారు.

దీనికి వ్యతిరేకంగా కొందరు చరిత్రకారులు
తమిళకం రాజకీయాల్ని భిన్నంగా చూశారు. వారి
ప్రకారం సంగం యుగం లో సాధారణంగా ప్రభుత్వం
వారసత్వ రాచరికం. రాజులు ఆకర్షణీయ ఆస్థానాల్ని/ల
నిర్వహించేవారు, వారి కింది దొరలు వాటిని అనుకరించేవారు.
ఈ ఆస్థానాల్ని 'అవై' 'అరసవై' అనేవారు. ఆస్థానం
రాజుకి సలహాలిచ్చి అతన్ని సరైన దిశలో నడిపిస్తుంది.
రాజులు అనేక బిరుదులు ధరించేవారు. చేర రాజులు
'వనవర' 'విల్లవర' 'కుడవర' 'పులియర' మొ॥
బిరుదులు ధరించారు. చోళులు 'సెన్నిస' 'సెంబియన'
'వలవన' వంటి బిరుదులు పెట్టుకున్నారు. పాండ్యులు 'మీనవర'
'పాంచవర' 'తెన్నార' వంటి బిరుదులు ధరించారు.

ఇతరులు చిన్న రాజులు, వీరు
regular crown ధరించేవారు కాదు.

'అరసన్' అనే రాజులకు వాడే పదం 'రాజన్'
యొక్క తమిళరూపం. రాజు పుట్టిన రోజును 'పెరునాళ్'
గా ఉత్సవం చేసుకునేవారు. రాజ చిహ్నాలను (చోళ-పులి
చేర - విల్లు ; పాండ్య - carp) కోట బురుజుద్వారం
పై చెక్కేవారు.

రాజు అధికారం ఐదు కౌన్సిళ్ళ చేత అదుపులో
ఉంచబడేది. వీటిని 'ఐంపెరుంకుళు' (ఐదు గొప్ప కౌన్సిళ్ళు)
అనేవారు. ఆ ఐదు - 1) అమైచ్చర్ (మంత్రులు)
2) పురోహితర్ (పురోహితులు) 3) సేనాపతియర్ 4) దూతర్
(రాయబారులు) 5) ఒర్రర్ (గూఢచారులు).

ఈ ఐదే గాక 'ఎన్‌పెరాయం' అనే వృత్తులుండేవి.
అవి 1) కరణాత్తియలవార్ (అకౌంటెంట్లు) 2) కరుమకరర్
(పాలనాధికారులు) 3) కనకసుత్రం (కోశాధికారులు)
4) కడైకప్పలర్ (కోట రక్షకులు) 5) నగరమందార్ (నగర పెద్దలు)
6) పడైత్తలైవర్ (కాల్బల ముఖ్యులు) 7) యానై వీరార్
(గజదళాధికారులు) 8) ఇవులి మరవర్ (అశ్వదళాధిపతులు).
ఈ అధికారులకు సాంప్రదాయక హోదా ఏమీ ఉండదు,
కాని రాజుకు వ్యక్తిగత బాధ్యత మాత్రమే కలిగి ఉంటారు.

## మున్సిపల్ మరియు గ్రామ పరిపాలన:

గ్రామసభ "అవై" స్థానిక వ్యవహారాల్ని
నిర్వర్తించేందుకు గానూ 'మన్రం'/'పొడియల్' లేదా
'అంబలం' అనే ప్రాంతం లో

సమావేశమయ్యేది.

సిద్ధాంతంలో రాజ్యం చిన్న భాగాలుగా విభజింపబడకపోయినా మొత్తం రాజ్యాన్ని "మండలం" అనేవారు. చోళ, చేర, పాండ్య వంటివి పెద్ద మండలాలు. నచ్చినార్కినియర తమిళకం లో చేర, చోళ, పాండ్య మరియు తొండై మండలాలు ఉన్నాయని చెప్పాడు.

మండలం కింద పెద్ద విభాగం గా 'నాడు' ఉంది. 'కుర్రం' అనే మరో విభాగం కూడా కనిపిస్తుంది. V.R.R. దీక్షితార్ ప్రకారం నాడు కుర్రం యొక్క ఉపవిభాగం కాని U.V.S. అయ్యర్ ప్రకారం కుర్రం, నాడు లో ఉపవిభాగం. 'ఊర' ఒక పట్టణం, ఇది పెద్దగ్రామం (పెరుర), చిన్నగ్రామం (సిరుర) పాత గ్రామం (ముదుర) అది రకరకాలుగా వర్ణించబడేది. 'పట్టణం' తీర పట్టణం, కాగా 'పువార్' రేవు ప్రాంతాలకి సామాన్యంగా వాడే పదం.

## సైనిక పాలన :

సంఘకాలం లో తమిళకం వారికి కోటలు కట్టుకోవడం, కోటలపై దాడి చేయడం, రక్షించుకోవడం మొ|| నవి తెలుసు. (ఇంజి, పురిసై or అరాప్పు) కోటల ఎత్తైన ప్రాకారాలు (నయిల్ Nayil), వాటి భారీ చెక్క తలుపులు, అడ్డగడ్డ మొ|| వాటితో పాటు పర్వత కోటలు, మొ|| నవి నాటి సాహిత్యం లో పేర్కొన్నారు. 'మదురైకంజి'

లోపల గోడలు, moat (అగడ్త, కందకం) మరియు శిఖరాలు గల ప్రాకారాలు (పర్వగల) మొదలైనవి మదురైకాంచిలో ఉందని చెప్పబడింది.

సంప్రదాయ చతురంగబలం – రథ, గజ, అశ్వ, కాల్బలాలు తరచూ ప్రస్తావించబడ్డాయి. గజ, అశ్వబలాల ప్రాధాన్యత తరచూ నొక్కి చెప్పబడింది. రథాలు ఎద్దుల చేత లాగబడేవి. ఖడ్గం (వల్) డాలు (కేడకం / కిడుగు) ద్వంద్వ తేరా, దగ్గర యుద్ధాల్లో వాడేవారు. దూరం నుంచి శత్రువు పై వేసే 'తోమరం' చెప్పబడింది. తోలుతోలుతో చేసిన శరీరకవచం, చేతి తొడుగు వాడేవారు. యుద్ధభూమి లో ఢంకా, శంఖం మోగించేవారు. సాధారణంగా యుద్ధం పశువుల్ని స్వాధీనం చేసుకోవడం తో 'గోగ్రహణం' లో (తలసరంబల్ రం తొల్కాప్పియం లో చెప్పబడింది) మొదలయ్యేది. యోధులు వారి వీరకార్యాలు రాయబడిన 'వీరకళల్' ను ధరించేవారు.

పైన్నిల్లి ఉప్పు వాయించి రప్పించేవారు. సైన్యం లో ముందు (తూసి) వెనక్కి (కుత్తై) మధ్యలో గాక పక్కల్ని (పక్కం) కూడా వేరు చెప్పేవారు. యుద్ధ భేరి తెలిపించే యుద్ధ ఢంకా ని దైవం లా ఆరాధించేవారు. యుద్ధానికి బయలు దేరే ముందు కత్తి ని ఊరేగింపుగా తీసుకెళ్ళి, గొడుగు – ఢంకా లు యుద్ధభూమి కి ముందుగా పంపేవారు. ఈ ఉత్సవాల్ని "నల్ కోల్"

అనేవారు. పూర్వకాలమున సైనికులు "వీరస్వర్గం"
అలంకరించేవారని భావించేవారు. అంతేగాక వారిని
"వీరకల్లు" 'నడుకల్' (స్మారక శిలలు) ద్వారా
ఆరాధించేవారు.

యుద్ధంలో ఓడిన శత్రువులు తీవ్రంగా
అవమానపరిచేవారు. సంగం యుగ తమిళులకు ఒక
ప్రత్యేక ఆచారం ఉండేది. వారు "కవల్మరం"
ఆరాధ్య వృక్షంగా పెంచేవారు. ఈ రాజులు తమ మండలం
లేదా ముఖ్యస్థలంలో ఈ చెట్టును ఎంతో పవిత్రంగా
జాగ్రత్తగా పెంచేవారు, దానికి పట్టణాన్ని రక్షించే శక్తి
ఉందని నమ్మేవారు. శత్రురాజు ఈ చెట్టు ను
( కడిమరం) అవమానం చేస్తే అది రాజ్యానికి చేసినట్లే
గా తలచేవారు.

## రెవెన్యూ పరిపాలన :

సంగం సాహిత్యం ద్వారా తమిళకం రెవెన్యూ
పాలన గురించి కొద్దిగా తెలుస్తుంది. సాధారణమైన మరియు
అతిముఖ్యమైన ఆదాయ మార్గం గా భూమిశిస్తు ను చెప్పవచ్చు.
దీన్ని "ఇరై" లేదా "కరై" అనేవారు. తమ కింది
వారలు చెల్లించే కానుకలు, శత్రువుల్లో యుద్ధంలో
దోచుకున్న ధనం 'ఇరై' గా ఉండేది. టోలు

మరియు కప్పమ్ము సుంకాలని 'ఉలుగు' లేదా 'సుంగం' అనేవారు. సాధారణంగా రాజుకి కట్టాల్సిన సుంకాన్ని 'కడమై' 'పడు' 'పడువడు' అనేవారు. 'వరి' అనేది ఆదాయాన్ని సూచించే సాధారణ పదం. బలవంతంగా తీసుకునే కానుకల్ని 'ఇరవు' అనేవారు. పన్ను చెల్లించే బాధ్యత కల్గిన ప్రాంతాన్ని 'వారియం' అనే వాటిని వసూలు చేసే అధికారిని 'వారియర్' అని అనేవారు.

సంగం గ్రంథాలపై వ్యాఖ్యానాల్లో పంటలో $\frac{1}{6}$ వ వంతు భూమిశిస్తుగా చెప్పబడింది. 'కురల్' ప్రకారం రాజు ఆదాయాలు క్రింది విధంగా వచ్చేవి.

1) ఉరు పారుల్ (నిధులు & escheats లేదా భూమిశిస్తు — K.A. నీలకంఠ శాస్త్రి ప్రకారం)

2) ఉల్గు పారుల్ (కప్పమ్ము, టోల్స్)

3) ఒన్నారత్తెరు పారుల్ (యుద్ధ దోపిడీ ధనం, కానుకలు)

భూమిశిస్తు తర్వాత మొత్తం ఆదాయంలో కప్పమ్ము, టోలు ఆదాయం పెద్దమొత్తంగా ఉండేది. 'వారియర' (భూమిశిస్తు వసూలుదారు) లా విడిగా 'అలంబల్ వేల' కవిధి (ఆర్థిక మంత్రి) కరణత్తియలవర్, ఆయక్కారర్ (టోలు వసూలుదార్లు) మొ|| వారి పేర్లు తరచూ కన్పిస్తున్నాయి.

# తమిళం లో రాజ్య బాధ్యతలు

వంశపారంపర్యంగా ఉండేది గాన, సమాజం చాలా వరకు సంప్రదాయాలతో పాలింపబడేది కావున తీవ్ర నియంతృత్వ కూడా ఎక్కువ ప్రమాదం చేయలేదు. మొత్తం మీద ప్రజలు వారి పాలకుల పట్ల సంతృప్తి కలిగి విధేయులుగా ఉండేవారు. ప్రజలు రాజును ఆదర్శంగా తీసుకునేవారు గనుక రాజు ఉత్తమ శైలి ప్రమాణాలు కనబరిచేందుకు కృషి చేసేవాడు. రాజు తన ప్రజల పట్ల పైతృక ప్రేమ చూపి; మతం, కళ, సాహిత్యం ని ఉదారంగా ఆదరించాల్సి ఉండేది.

రాజులు తరచూ స్వయంగా యుద్ధాల్లో పాల్గొనేవారు. ఇక్కడి స్త్రీలు యుద్ధభూముల్లో భర్త కి తోడుగా ఉండేవారు. దిగ్విజయాలు చేయడం రాజధర్మం గా భావించబడింది.

దేశంలో అంతర్గత భద్రతల పరిరక్షణ కు ప్రత్యేక శ్రద్ధ చూపబడింది. రాత్రుల్లో రాజధాని నగర వీధుల్లో కాగడాలు పట్టుకుని కావలివాళ్ళు కాపలా కాసేవారు. పాలనా వ్యవస్థ లో శిస్తు ఒక భాగం గా ఉండేది.

# తమిళకం - రాజ్యావిర్భావం

'వెంకటం' మరియు 'కన్యాకుమారి' కొండల మధ్య భూభాగాన్ని 'తమిళకం' అంటారు. ఆధునిక తమిళనాడు, కేరళ రాష్ట్రాలు మొత్తం ఇందులో భాగమే. ఈ ప్రాంతం విభిన్న పర్యావరణ స్వభావాలు కలిగిన ఐదు 'తిణైలు'గా కన్పిస్తుంది - కురింజి (అడవులు) పాలయ్ (పొడిప్రాంతం) ముల్లై (పచ్చిక బయళ్ళు) మరుతం (మైదాన ప్రాంతాలు) నెయితల్ (తీరప్రాంతాలు). ఎక్కువ ఉత్పాదకత గల తిణైలలో సామాజిక క్రమిక శక్తిలో ఎక్కువ వృద్ధి చెందిన విభజనలు కన్పిస్తాయి. తక్కువ ఉత్పాదకత గల తిణైలలో సమాజం చాలా సామాన్యంగా ఉండి తెగలని కలిగి ఉండేది. (clans) మొత్తం మీద తమిళకం ప్రజలు అసమానంగా తేడా వివిధ స్థాయిలలో అభివృద్ధి గల భిన్న ప్రాంతాలలో ఉన్న సంక్లిష్ట సమాజం లో ఒకే సంస్కృతిని కలిగి కన్పిస్తారు. (By and large the peoples of Tamilaham represented a complex society of unevenly developed components which shared a common culture.) సమాజం లో రాజకీయ స్థాయి సామాన్య తెగల

Chiefdom నుంచి పాలక కుటుంబాల సంక్లిష్ట chiefdom వరకూ ఉండేవి. పూర్తి స్థాయి రాజ్యాధికారం ఇంకా రూపు దాల్చాల్సి ఉంది.

రాజకీయ సమాజం యొక్క పరిణామము:

రాజకీయ సమాజ పరిణామంలో గుర్తించదగిన తొలి దశ తెగల chiefdom లలా ఉంది. ఈ తెగల భూభాగం లలా కొన్ని పెద్దగా కొన్ని మరీ చిన్నగా వివిధాలు గా ఉండేవి. తెగల chiefdom స్వభావాన్ని సంగం పద్యాలలో 'పెరుమకన్' (గొప్ప కొడుకు), ప్రముఖ కొడుకు అనే అర్థం లో 'కో-మకన్' అనడం దొరలకి వారి తెగ సభ్యులకి మధ్య సంబంధాలని సూచిస్తుంది. ఇక్కడ వాస్తవం గా వెల్లడయ్యేది బంధుత్వ (kinship) ఆధారం. ఈ తెగల్లో కొన్ని ఇతర తెగల్ని ఓడించడం ద్వారా వాటిని లొంగదీయటం ద్వారా బంధుత్వ సంబంధాల్ని దాటి వృద్ధి చెంది ఉండవచ్చు. యథార్థం గా సంక్లిష్ట స్వభావం గల పెద్ద భూభాగంలు ఆక్రమణల ద్వారా, ఓడించటం ద్వారా ఏర్పడి ఉంటాయి. దొరల వివాహ సంబంధాలు కూడా పెద్ద భూభాగం లు ఏర్పడడానికి కారణమై ఉండవచ్చు, కాని భూభాగం లు వాస్తవంగా విస్తృతమవ-డానికి కారణం మాత్రం వాటి సంపదే. పెద్ద వ్యవసాయ ప్రాంతాలు గల భూభాగం లు మిక్కిలి శక్తివంతం గా ఉండేవి. సమకాలీన తమిళకం లో ఇలాంటి అతిశక్తివంత భూభాగంలు మూడు ఉండేవి — చేర, చోళ, పాండ్య. రాజకీయ సమాజ పరిణామం లో వాస్తవ రాజ్య ఆవిర్భావాన్ని ~~ఊహించ~~ గల దశ ని ఈ భూభాగంలు ప్రతిబింబిస్తుంటాయి.

## వివిధ రకాల భేదాలు :

తమిళకంలో 3 రకాల భేదాలు ఉన్నాయి - కిళర్ (చిన్న దొరలు) వెలిర (పెద్దదొరలు) వేదర (అతిపెద్ద దొరలు) అనే రకాల దొరలు ఉండేవారు. కిళర చిన్న గ్రామాల (ఊర) నాయకులుగా ఉండేవారు, సాధారణంగా బంధుత్వ సంబంధాలు కలిగి ఉండేవారు. పద్యాల్లో అనేకమంది కిళరలు ఉన్నారు. వారిని వారి గ్రామ పేర్లు ముందు పెట్టి పిలవడం కన్పిస్తుంది. ఉదా: అర్యాంతుర కిళర ఉర్యతుర కిళర మొదలైనవి. వీరిలా అందరూ వారి పెద్దదొరలు సేవించేవారు, అప్పుడు పెద్దదొరలకు యుద్ధ సమయాల్లో వీరు సాయం చేయాల్సి ఉండేది. పద్యాలలో కిళర్లు వారి పెద్ద దొరలైన చేర, చోళ, పాండ్యులకు 'విరుతాజిల్' (తప్పనిసరి సేవలు) యుద్ధాలప్పుడు చేయడం వర్ణించబడింది. పెద్ద దొరలు ఈ కిళర్లను సేవించిన గ్రామాలపై పాలకులుగా నియమించడం వల్ల భూతాల్లో కానుకలిచ్చి ఆదరించేవారు.

వెలిర్లు చాలా వరకు కొండదొరలు, కొందరు వెలిర్లు దిగువ ప్రాంతాల్లో నియమించబడం కూడా కన్పిస్తుంది. కొండ దొరలు ప్రధానంగా వేటగాళ్ల దొరలు 'వెటర - కామన్' లేదా 'కురవర్ - కామన్' 'నెడు వెట్టువన్' గా పిలువబడేవారు. కొండ ప్రాంతాల్లో ముఖ్యమైన తెగ ప్రజలు 'వెటర' 'కురవర' 'వెట్టువర' లపై 'వెలిర' ఆధిపత్యం కలిగి ఉండేవారు. (Vetar, Kuravar and vettuvar were the major clasmen of the hills dominated by the Velir)

వెంకటమల్లై, నాంజిలమల్లై, పరంపురలై మొ॥నవి నాటి ముఖ్య కొండ దొరల కేంద్రాలు.

చేర, చోళ, పాండ్య మూడు ముఖ్య/ లేదా పెద్ద దొరల విభాగాలకు చెందిన పాలక కుటుంబాలు – వీటిని "మువేందర" (the three vendar) అనేవారు. ఈ దొరల కుటుంబాలకు విస్తార ప్రాంత ప్రజలపై నియంత్రణ ఉండేది. పశ్చిమాన కొండల ప్రజలని చేర దొరలు నియంత్రించేవారు. కావేరి ప్రాంత ప్రజలపై చోళులకు నియంత్రణ ఉండేది. సముద్రం వైపు దక్షిణాగ్ర భాగాన్ని పాండ్యులు నియంత్రించేవారు. వీరి కింద అనేక మంది చిన్న చిన్న దొరలు వారి సేవ చేయడం, వారికి 'తిరువై' కానుకలు సమర్పించటం చేసేవారు. – స్పష్టంగా గుర్తించిన సరిహద్దులు గల ప్రాంతమేదీ ఉండేది కాదు. రాజకీయ అధికారం ప్రజల్ని నియంత్రించటం ద్వారా పనిచేసేదే గాని ప్రాథమిక పోషక వనరులపై వారి ద్వారా పనిచేసేది గా కన్పించదు. ఉదాహరణకు 'ఉరవర' 'వెళిర' 'వెట్టువర' మొ॥ ప్రజల పై నియంత్రణే వారిని పెద్ద దొరల్ని చేసింది. ఇలాంటి ప్రజలు ఉమ్మడి గా కొండల్ని, మైదానాల్ని సొంతం చేసుకునేవారు. వారి దొరల హక్కులన్నీ ప్రజలతో బంధుత్వం (kinship) నుండే ఆవిర్భవించేవి. వనరులని వ్యక్తులు వ్యక్తిగతం గా గాక ఉమ్మడి/ సాధారణ వారసత్వం పూర్వీకుల సంబంధాలు గల సమూహాలు వారసత్వం గా పొందేవి. (The resources were inherited not by individuals but by groups whose members were bound by ties of common ancestry.)

ఈ సమూహాలు వారి దొరలకి వాలంటరీగా కావలు సమర్పించేవి. క్రమబద్ధమైన, పీరియాడికలగా పన్నులు చెల్లించటం అమలులొ లేదు. ఏమైనా భూభాగం యొక్క ఉత్పాదకత దొరల శక్తిని నిర్ణయించేది. వ్యవసాయ ప్రాంత దొరలలాగా కాక, పశ్చిమ బయళ్ళ మరియు వేటగాళ్ళ దొరలు అంత శక్తివంతంగా ఉండేవారు కాదు. శక్తివంతమైన దొరలు చిన్న దొరల్ని ఓడించి వారి నుండి బహుమానాలు సంపాదించేందుకు యత్నించేవారు. సమకాలీన రాజకీయ పద్ధతుల్లో 'దోపిడీ దాడి' స్వాభావిక లక్షణంగా ఉండేది.

## దోపిడీలు - పునఃపంపకాలు:

పెద్ద, చిన్న దొరలందరూ వారి ప్రజల్ని తృప్తి పరచటానికి దోపిడీ దాడులు చేయాల్సి ఉండేది. దొరలు దోపిడీ ధనాన్ని తమ సొంత బంధువులకే కాక యోధులు, కవులు, గాంధర్వులకి కూడా పంచేవారు. కానుకలివ్వడమనే వ్యవస్థ (కొడై) దోపిడీ పద్ధతుల అంతర్భాగంగా ఉండేది. ఏ దొరకైనా ప్రధాన బాధ్యతగా కానుకలివ్వడం ఉండేది. 'పురనానూరు' లాంటి చాలా పద్యాలు దొరల ఉదారతను ప్రశంసిస్తాయి. ఈ పద్యాల ప్రకారం ఉదారత, వీరత్వం దొరల రెండు ప్రధాన లక్షణాలు. వనరుల కొరతలు దోపిడీలను ప్రధానంగా ఆర్థిక అవసరాలు చేశాయి.

'పురనానూరు' లాంటి పద్యాలు ఆర్థిక మరియు రాజకీయ ప్రతిబింబించాయి. ముఖ్యంగా దోపిడీ దాడులు, దోపిడీ సొత్తు పంపకాలు సమకాలీన రాజకీయ స్వాభావిక లక్షణంగా మారాయి. ప్రతి రాజుల దొరలు [illegible] పై దాడి దోపిడీ కి తెగబడేవారు. చిన్న దొరలు దోపిడీ దాడుల్లో పెద్ద దొరలతో చేయి కలిపేవారు, దోపిడీ సొమ్ము లో తమ వాటాలు పొందేవారు. దోపిడీ సొత్తు లో ప్రధానంగా పశువులు, ధాన్యం ఉండేవి. సమకాలీన కవులు విమర్శలు, గుర్రాలు, బంగారు ఆభరణాలు, రథాలు, [illegible] రాజు, [illegible] సామర్థ్య ప్రశంసించారు. చిన్నసామంత పెద్దదొరలు దాడుల్లో వారి నియంత్రణ లో లేని గ్రామాల్ని కలుపుకునేవారు. అలాంటప్పుడు వారికి సాయం చేస్తున్న చిన్న దొరలు ఆ గ్రామాల్ని పొందేవారు. వారికి ఇవ్వబడేది ఆ గ్రామాల భూమి కాదు, కొత్తగా ఉన్న ప్రజలపై నియంత్రణ మాత్రమే ఇచ్చేవారు.

## ముమ్వేందర్, ఇతర రాజకీయ నియంత్రణలు :

ప్రధాన పాలక వర్గాలుగా ముమ్వేందర్ల ప్రాచీనత [illegible] చెందుతుంది. తొలినాళ్లనే వారి పేర్లు ఉన్నాయి. కవులు ముమ్వేందర్ లను 'కిరీట రాజులుగా' అభివర్ణించి మొత్తం తమిళకం వారిదేనని చెప్పారు. అయితే కిరీటరాజు అన్న బిరుదు రాజ్యాధికారాన్ని సూచించాల్సిన అవసరమేమీ లేదు.

బాగా పెంచింది. పరంబుమత్తై పతి, పాకయిల్‌మత్తై అధియన్, కాడున్పై ఇరుంకోవేల్ మొ॥ వెళిర్ దొరలు పద్యాల్లో కన్పిస్తున్నారు. ఇటువంటి ప్రాదేశిక కేంద్రాల్ని నియంత్రించే వెళిర్ దొరలు మువేందర్ల నుండి తీవ్రమైన సవాళ్ళని ఎదుర్కోవాల్సి వచ్చేది. ఇటువంటి పోటీలు ఒక్కోసారి బలిష్టమైన సమూహాల వినాశనానికి దారితీసేవి. పరంబుమత్తై నాయకుడు పరి వెళిర్ దొర నాశనం ప్రసిద్ధ ఉదాహరణ. ప్రత్యక్ష యుద్ధాలే గాక పెద్ద దొరలు వివాహాల ద్వారా కూడా వెళిర్ దొరల ప్రాంతాల్లోకి సంబంధాలు ఏర్పరుచుకునేవారు. చేర, చోళ, పాండ్యులు వెళిర్ కుటుంబాల నుండి కన్యల్ని తెచ్చుకున్న/ పెళ్ళి చేసుకున్న సందర్భాలు కోకొల్లలు. ప్రాదేశిక ప్రాంతాల గ్రామ దొరల విషయంలో పెద్ద దొరలు పైచే నియంత్రణ విధానం అవలంబించేవారు. వారిని ఓడించి పెద్ద దొరలు వారిని తమ కు లోబడి ఉండేట్లుగా చేసుకునేవారు. మువేందర్లకు దోపిడీ దాడుల్లో సహకరించే ఇలాంటి లోబడిన చిన్న దొరలు ఎందరో మంది ఉండేవారు.

సమకాలీన తమిళకం లో మువేందర్ అతి శక్తివంతమైన రాజకీయ అధికారం గలవారిగా కన్పిస్తారు. వారి తర్వాత రాజకీయ అధికారంలో వెళిర్ దొరలు వస్తారు. కిజర్ గ్రామాల దొరలు రాజకీయ అధికారం లో ప్రాథమిక స్థాయికి చెందినవారు. ఇది ఒక రాజకీయ క్రమానుగతశ్రేణి భావాన్ని కలిగిస్తున్నా నిజానికి ఈ మూడు రాజకీయ

అధికార కేంద్రాన్ని కలిగిఉండేటటువంటి స్థిరమైన రాజకీయ నియంత్రణా గాని వంటివేవీ లేవు. చిన్నదారుల్ని సమైక్యపర్చటం అన్నది మూవేందరుల దోపిడీ, సైనిక/ యుద్ధ విధానాల కింద ప్రగతి పొందింది. కాని ఒక విస్తృ రాజకీయ విధానం (unified political system) ఇంకా రూపొందే దశ లోనే ఉంది. సమకాలీన రాజకీయ నియంత్రణా కి బంధుత్వం ఆధారంగా నివాస ప్రజలపై సంప్రదాయ అధికారాన్ని చెలాయించడమే ప్రాథమికం గా నిలిచి ఉంది. ప్రతి జనావాసం లోనూ సంప్రదాయ సభ లే నిత్యవ్యవహారాల్ని నిర్వహించేవి. సమావేశ స్థలాన్ని 'మన్రం' (చెట్టు చుట్టూ కట్టిన మిద్దె) అనేవారు. దీన్నే 'పొదియల్' అని అంటారు. దానికి 'అవై' అనే సభ సాయం చేసేది. దీని నిర్మాణం, విధులు తెలియడం లేదు. తొలి తమిళ పద్యాల్లో 'ఐంపెరుంకుళు' (5 great groups) 'ఎణ్పేరాయం' (8 great groups) ప్రస్తావించారు. ఇవి బహుశా క్రీ.శ. 3 వ శతాబ్దం తర్వాత వృద్ధి చెందిన సంస్థలుగా కన్పిస్తాయి. వీటి నిర్మాణం, విధులు కూడా తెలియడం లేదు.